మిరమిట్లు గొల్పే తెలుపు
చూడగానే అందరి నోట ఒకే మాట...

ఇది తప్పక

# డెట్

డిటర్జెంట్ బిళ్ల వుతుకే




Shilpi DM 35A/78 Tel




బిన్నీ ఇంటర్నేషనల్

# అందాల రాణి

ఈస్ట్‌మన్ కలర్

కథ-స్క్రీన్‌ప్లే-ఫోటోగ్రఫీ-నిర్మాణం-దర్శకత్వం కె. ఆర్. వి. భక్త

సంగీతం: రమేష్ నాయుడు



ఈ సంచిక నుంచి
ఈ 'అభిప్రాయాలు' పేజీలలో
ప్రచురింపబడే ప్రతి లేఖకూ
పారితోషికం పది రూపాయలు

### కల్తీ వస్తువులు కనుక్కోవడం

కల్తీ సరుకులు కనుక్కోవడం కేవలం ప్రయోగ శాలల్లోనే సాధ్యం కదా! మరి ప్రతీ ఊరిలో ప్రయోగ శాలలు ఎక్కడివి? ఈ కల్తీ వస్తువులు అమ్మకుండా చూడ్డం ఎలా సాధ్యం? అందుకని ప్రతీ తాలూకా కేంద్రంలో వినిమయదార్ల సంఘాలు ఏర్పడాలి. తాలూకాలో చాలామంది వీటిలో మెంబర్లుగా చేరి కొంత డబ్బు కట్టి, ఏటేటా మెంబర్లుగా చేరి వీటి ద్వారా వచ్చే రాబడిని బట్టి ప్రయోగశాలనీ, అందులో కెమిస్టునూ ఏర్పరిస్తే ఆ కెమిస్టు సర్టిఫై చెయ్యబడిన వస్తువుల్నే కొనే ఏర్పాటు చేసుకుంటే కల్తీ వస్తువుల నిరోధానికి ఇది సాధ్యం అవుతుంది. ప్రతీ తాలూకాలో వీలు లేకపోతే కనీసం జిల్లా కేంద్రాల్లోనే ఈ వినియోగదార్ల సంఘాలు కెమిస్టులను, లాబ్‌లను ఏర్పాటు చేస్తే జిల్లా కేంద్రాల్లో 20, 30 పెద్ద షాపుల్లో సరుకులు తనిఖీ చేయించి ఆ షాపుల్లో కొనే వస్తువులు నిక్కచ్చివి అని పేపరు నోటిఫికేషన్ ఇస్తే కనీసం ప్రతీ నెలా జిల్లా కేంద్రాలకు ఏ పని మీదేనా వెళ్లేవారు ఆ విధంగా సర్టిఫై చేసిన షాపుల్లో కొనుక్కురావడానికి వీలవుతుంది. ఈ పద్ధతి కనీసం మహిళా సమాజాల ద్వారా, లేడీస్ లైన్సు క్లబ్‌ల ద్వారానైనా వీలైతే ప్రజలు కల్తీ లేని సరుకులు కొనుక్కోగలుగుతారు.

పి. ఇందిర — అనకాపల్లి

### కాలంతో మారాల్సిన వనితలు

మన సమస్య లెన్నోరకాలు. వ్యక్తిగతంగా వయసును బట్టి వచ్చే సమస్యలు కొన్ని. మారే కాలంలో ఇమడలేని మనస్తత్వంతో యేర్పడే సమస్యలు కొన్ని. వయస్సు వలన వచ్చే అనుభవం చాలా గొప్పది. దాన్ని తరాల అంతరాలు అనే జల్లెడ పట్టి మెరుగు నేర్చుకోవాల్సిన మహిళలు నిరంతరం పాతనే ప్రేమిస్తూ నసపెడుతూ, ఇప్పటి వారికి చికాకు కల్గిస్తుంటారు. ప్రాచీన సంప్రదాయ విశేషాలను, సమకాలీన సమాజ విశేషాలతో రంగరించి ఇప్పటివారికి పాత కొత్తల మేలుకలయికగా ప్రదర్శిస్తుంటే అలాంటి వారి వయస్సు, అనుభవం అందరికీ శిరోధార్యంగా వుంటుంది.

కాని ఇందుకు భిన్నంగా వయసు వచ్చిన మహిళలు ప్రవర్తిస్తుంటారు. "ఎదిగిన బిడ్డ మిత్రులతో సమానం" అన్న సూక్తిని మరచిపోయి, తాము ఒక సుపీరియర్‌గాను, తమ కాలంలో అంతా గొప్పగాను వున్నట్లు భావించుకొంటూ, ఇప్పటి కాలపు వారిని అనుక్షణం చిన్నబుచ్చుతూ వుంటారు. ఫలితంగా ఎంతో ఆప్యాయత, గౌరవం, వుండాల్సిన పెద్దలపై యువతులకు, పిల్లలకు ఏహ్యాభావం, చులకన యేర్పడుతుంది. పిల్లలు తమను సక్రమంగా చూడటంలేదు మొట్టో అని యాగీ చేస్తూ ఇంట్లోని వాళ్లకెవరికీ మనశ్శాంతి లేకుండా చేస్తుంటారీ వృద్ధ వనితలు.

పరిణామశీలమైన కాలంలో ఎన్నో మార్పులు వస్తుంటాయి. "ఎడ్యుకేషన్ యీజ్ ది అడ్జస్ట్‌మెంట్ టు ఎన్విరాన్‌మెంట్" అన్నట్లుగా మౌలిక సిద్ధాంత సంస్కృతులలో మార్పు తెచ్చుకోకుండా, అనుషంగికమైన విషయాల్లో మార్పులు, చేర్పులు తెచ్చుకుంటే పెద్ద దోషమేమీ కాదు. అలాంటి సమరస ధోరణి యువతులలో వున్నంతగా వృద్ధ వనితల్లో వుండదు. ఫలితంగా అత్తాకోడళ్ల కలహాలు, తల్లీకూతుళ్ల తగాదాలు మగవారికి శిరోవేదన కలగజేస్తుంటాయి. పిల్లల ఆహార విహారాల్లోనూ, పెంపకపు పద్ధతుల్లోనూ, వివాహాది విషయాల్లోనూ సామాజికానుగుణ్యంగా వచ్చిన మార్పులను యువతులు చేపట్టవచ్చు. అవి మన సంప్రదాయాలకు భంగకరం కానంతవరకూ వాటిని ప్రౌఢ వనితలు పట్టించుకోరాదు. పదేపదే, "మా కాలంలో అలా వుండేది, ఇలా వుండేది" అనే పాత రికార్డును వల్లె వేయటం మానాలి. అదేవిధంగా ముసలివాళ్లంతా చాదస్తులు, ముక్కోపులు అనే అపోహలు యువతులు కూడ తొలగించుకోవాలి. అలాగే వయసు వల్ల వచ్చే అహంభావ అసహనాల్ని పెద్దల పట్ల మృదువైన ధోరణిలో యువతులు ఎదుర్కోవాలి.

కాలాని కనుగుణంగా మనసును మార్చుకుంటూ, చిన్నవయసు వారితో సమరస ధోరణిలో వృద్ధ



ఈ సంచికలోని 'మకర సంక్రాంతి – విశిష్టత' వ్యాసాన్ని రాసిన శ్రీమతి జయా సౌజన్యమూర్తి 'వనిత' పాఠకులకు కొత్త కాదు. ఆమె లోగడ 'వనిత'లో కొన్ని వ్యాసాలు రాశారు. "రచనా వ్యాసంగం ద్వారా నాకు పేరేదైనా వచ్చి వుంటే, అది శ్రీవారి సాహచర్యం లభించిన తర్వాతనే. వారూ రచయితే (లక్ష్మీనారాయణమూర్తి శ్రీరామ) కావడంతో, నా రచనలకు తుది మెరుగులు దిద్ది నాకు ప్రోత్సాహం కల్పిస్తున్నారు" అంటున్న శ్రీమతి జయా సౌజన్యమూర్తి, వరంగల్ జిల్లా మల్లంపల్లిలో వుంటున్నారు. ఆమె రాసిన కథలు, వ్యాసాలూ పలు పత్రికల్లో వచ్చాయి. 'ఆకాశవాణి' విజయవాడ కేంద్రం నుంచి ఆమె రచనలు ఎక్కువగా ప్రసారం కాబడ్డాయి.


# వనిత

స్త్రీ జన మాస పత్రిక

సంపుటి : 5 సంచిక : 7

జనవరి : 1980

విడి ప్రతి : రెండు రూపాయిలు

సం॥ర చందా : ఇరవైనాలుగు రూపాయిలు

శ్రీలంక : రూ. 2.00 (ఇండియా)

మలేసియా : 90 సెంట్స్

చిరునామా :

చందమామ బిల్డింగ్స్

మద్రాసు-600 026

వనితలు సంచరిస్తూ వుంటే గృహచ్ఛిద్రాల కవకాశమే వుండదు.

ఎస్. జ్ఞానేశ్వరి ఖమ్మం

### మనస్సాక్షికి మనవి

సమాజాన్ని 'కేన్సర్' వ్యాధిలా పట్టి పీడిస్తున్న 'వరకట్నం' దినదినానికి తీరని సమస్యగా పరిణమిస్తూ, మధ్యతరగతి కన్నెపిల్లల జీవితాల నుంచి కాంతిరేఖలను దూరం చేస్తోందన్న – చేదు నిజం గరళప్రాయంగా గొంతు దిగుతున్న రోజులివి:.... 'వరకట్నం' ఇచ్చేవారిని పుచ్చుకునేవారిని దారుణంగా శిక్షిస్తామని శిలా శాసనం చేసిన ప్రభుత్వం ఈ విషయమై ఎలాంటి శ్రద్ధా వహించకపోవడం చట్టప్రాయంగా అమలు జరిగిన సూత్రాన్ని ఆచరణ రూపంలో పెట్టేందుకు కట్టుదిట్టమైన ఏర్పాటు చేయకపోవడం అనే అంశాలు, అత్యంత శోచనీయాలు: చట్టానికి లొంగని శాసనానికి కూడా వంగని ఈ వరకట్న పిశాచిని మన జీవితాల నుంచి తొలగించలేకపోగా దాన్నొక మానసిక బలహీనతగా నిర్వచించుకుని మనని మనమే మోసం చేసుకోవడం, ఆత్మవిశ్వాసాన్ని మరచి అచేతనులమవడం నిజానికి వ్యక్తిగతంగా ప్రతి ఒక్కరూ సిగ్గుపడాల్సిన విషయం ఇది. ఐతే, "ఆత్మవంచనకు పాల్పడుతున్న నేరస్థుల్ని ఎలా పట్టుకోవడం? ఏ రీతిని శిక్షించడం?" అనే ఎదురు ప్రశ్నలు ఉదయిస్తాయి. అయినా, ప్రయత్నమంటూ చేస్తే దొరికిన ఏ కొద్దిమందిని శిక్షించినా దాని ప్రభావం తతిమా జనావళిపై తప్పక వుంటుందని నా అభిప్రాయం: .... అన్ని నేరాలకు శిక్షలు అమలు చేస్తున్నట్లే నేరం గురించిన అన్వేషణ జరుపుతున్నట్లే ఈ వరకట్న నేరాన్ని కూడా సాధించగలిగితే సరైన న్యాయం చేకూరినట్లే: .... ఏ చట్టమైనా.... ఏ న్యాయమైనా.... ఏ యుగంలోనైనా.... ఆచరణ రూపానికి వచ్చినప్పుడే అనుకున్న ప్రగతిని సాధించగలుగుతురదన్న నిజం కొత్త కాదు మనకు: సూచనగా నా చివరి మాట ఏమిటంటే .... ఉద్యోగాలకు, జనన - మరణాలకు 'రిజిస్టర్స్' నడుపుతున్నట్లే పెళ్లిళ్లకు కూడా 'రిజిస్ట్రేషన్ కంపల్సరీ'గా జరిగి తీరాలని నిర్బంధించి, ఇప్పటివరకూ ఐచ్ఛికంగా (Voluntary) మాత్రమే జరుగుతున్న 'రిజిస్టర్డ్ మారేజి'ని ప్రతి ఇంటా ప్రతి పందిటా సర్వసామాన్యంగా అమలు చేయమని ఆ మేరకు పెళ్లికి అంగీకరించని వారిని నేరస్థులుగా పరిగణించమని:.... ఈ పద్ధతిలో కూడా 'ఆత్మసాక్షి' అనే పదం అవసరపడకుండా కట్టుదిట్టమైన ఏర్పాట్లతో కల్యాణాలు జరిపించి, మానవ జీవితాలతో పాతుకుపోయిన 'వరకట్నం' అనబడే భయంకర సమస్యకో శాశ్వత పరిష్కారం లభించేలా వ్యవహరించమని కట్నం ఇచ్చుకోలేక బాధలు పడుతున్న ఆడపిల్లల కన్నవారందరి తరుపున నా మనవి.

ఎమ్. హరిప్రియ శ్రీకాకుళం

సంక్రాంతి నవలల పోటీ:

సంక్రాంతి నవలల పోటీకి వచ్చిన నవలల్లో

## శీలంశెట్టి రమాదేవి

రాసిన

## "బొమ్మా-బొరుసూ"

ప్రథమ బహుమతి (రూ. 3000) పొందిందని తెలియజేయడానికి సంతోషిస్తున్నాము. అయితే, తక్కిన నవలల్లో రెండవ స్థానానికి అర్హమయ్యే నవల ఏదీ కనిపించలేదని, న్యాయనిర్ణేతలు అభిప్రాయపడడంతో — ఆ బహుమతిని ఇవ్వలేకపోతున్నందుకు చింతిస్తున్నాము. 'బొమ్మా-బొరుసూ' ఈ సంచికలో ఆరంభమవుతున్నది.

### కన్నవారికే శ్రద్ధలేదు!

మనదేశంలో కూడా రష్యాలోలా బాలల స్వర్గం ఏర్పడి, అనాథలనే వారు లేకుండా పోతే ప్రపంచం భారతదేశపు ఔన్నత్యాన్ని చాటుతుంది కదా: మనం నిత్యం బస్‌స్టాపులలో, రైళ్ళలో అనేకమంది అనాథ బాలలను చూస్తుంటాము. వీరంతా కూటికి కరువై భిక్షమెత్తేవారని మనందరికీ తెల్సు. కాని వీళ్ళనిలా అడుక్కోమని వారిని కన్నవాళ్ళే ప్రోత్సహిస్తుంటారు. యాచించడం వాళ్ళ వృత్తిగా చేబట్టిన వాళ్ళు వారి పిల్లలను కూడా అదే వృత్తిలోనికి దింపుతున్నారు. ఇది చాలా విచారించదగిన విషయం. ఇంకా విచిత్రం-ఇలాంటివారు వారి పిల్లలను అనాథశరణాలయాలకు, ఇతర పనులకి పంపడానికి ఇష్టపడరు. కారణం తల్లిదండ్రులు (వారి) ఆదాయం తక్కువవుతుందని: కాబట్టి ఇలాంటి శిశువులను అధికారులు బలవంతంగానైనా అనాథ శరణాలయాలలోనో, శిశు సంక్షేమాలలోనో చేర్చితే ఆకలి బాధలను కొంతవరకైనా తగ్గించిన వారమవుతాము. మట్టిలోని మాణిక్యాలలాంటి ఇలాంటి శిశువులకు విద్య, బుద్ధులు నేర్పిస్తే వారిలో ఎందరు దేశభక్తులు, మహనీయులు కాగలరో:

డి. లతాఖన్నా హైద్రాబాదు

### సమ్మెలు! సమ్మెలు!!

మన దేశంలో సమ్మెలు చేయడం సత్యాగ్రహాలు చేయడం పరిపాటైపోయింది. మన దేశానికి స్వాతంత్ర్యం రాని రోజులలో యీ సమ్మెలన్నా సత్యాగ్రహాలన్నా ఒక విలువ, క్రమశిక్షణ, పట్టుదల వుండేవి. ఆనాటి అందరి ధ్యేయం మన దేశానికి స్వాతంత్ర్యం రావాలని. కాని, ఇప్పుడు సమ్మెలు సత్యాగ్రహాలు కేవలం స్వలాభాపేక్ష కోసం. పదవులకోసం. ఈ సమ్మెలు ఒక ఆయుధంగా స్వార్థపరులు, వారి స్వలాభం కొరకు విద్యార్థులను వారి అమూల్య కాలాన్ని - వాడుకుంటున్నారు. "బంద్" అని పేరు చెప్పి రాకపోకలకు అంతరాయం కలిగిస్తున్నారు. ప్రభుత్వంపై వత్తిడి తేవాలన్న దృక్పథంతో ప్రజలకు అసౌకర్యాన్ని కలిగించి రాకపోకలను అడ్డగిస్తున్నారు. దీనివలన దూరప్రయాణం చేసే ప్రయాణికులు ఎన్నో అవస్థలకు గురి అవుతున్నారు. సమ్మెలవల్ల ప్రజా జీవనానికి అంతరాయం కలుగకూడదు. బంద్‌లు నిర్వహించేటప్పుడు వాహనాల రాకపోకలకు తక్కినవాటికి అంతరాయం కలిగించకుండా సమ్మెలు నిర్వహించాలి.

బి. వెంకటలక్ష్మి అనకాపల్లి

డిసెంబరు 'వనిత'లో ముగిసిన 'నింగి నుండి నేలకు' సీరియల్ చాలా బాగుంది ముగింపు సంతృప్తి కరంగానే ఉన్నా అప్పుడే అయిపోయిందా అన్న బాధ కలిగింది. ఈ సమాజంలో సిద్ధార్థ వంటి యువకులు చాలా అరుదు. రచయిత్రి వాసిరెడ్డి సీతాదేవిగార్కి నా అభినందనలు తెలుపుతూ.

—కె. నాగేంద్రమణి, కరీంనగర్

డిసెంబరు ''వనిత'' మదర్ తెరెసా ముఖచిత్రంతో అత్యంత ఆకర్షణీయంగా వుంది. వివిధ బహుమతుల గ్రహీత మదర్ తెరెసా గూర్చి ఎన్నో విషయాలు తెలుసుకున్నాము. మన దేవాలయాలు శీర్షికలో 'నాగలాపురం'ను గూర్చి ఎన్నో విజ్ఞానదాయకమైన విషయాలు తెలుసుకున్నాము. ఇంటి యజమాని బాధ్యతలను విస్మరించి తప్పు తాగొస్తే పిల్లలు ఆకలి ఆకలి అంటే తల్లిపడే తపన, అటువంటి పరిస్థితులలో ఏ తల్లైనా చేయగలిగేది ఏదో విధంగా పిల్లలకు పట్టెడన్నము సంపాయించి పెట్టడమే. చిన్నకోట సుశీలా దేవిగారు 'బాధ్యత' కథ ద్వారా చక్కగా వ్యక్త పరిచినారు.

—యం. రాధిక, తరిగొండ

''వినియోగదార్ల హక్కులు'' గూర్చి చక్కని విషయాలు వివరించారు. ''వినియోగదార్లు, వ్యాపారస్తులు, ప్రభుత్వమూ వారు నేడు కలిగిన విషమపరిస్థితుల నుండి బయటపడేమార్గం కోసం వెతకటానికి కృషి చేసినపుడు నాణ్యత గల వస్తువులూ దొరుకుతాయి. పెరుగుతున్న ధరలు తగ్గుతాయి'' అన్న చక్కని జీవిత సత్యాన్ని చాటి వివరించారు. గత కొన్ని మాసముల నుండి మమ్మల్ని ఆనందసాగరంలో ముంచెత్తిన సీరియల్ ''నింగి నుండి నేలకు'' ముగింపు చాలా రమ్యముగా ఊహించని విధంగా ఉండి ఆశ్చర్య చకితుల్ని గావించింది.

—లోకం సరస్వతి సర్పయ్య, నవీపేట




'నింగినుండి నేలకు' సీరియల్ ముగింపు అనుకున్నంత ఆశాజనకంగా లేదు. దాని మూలంగా ఈ నెల 'వనిత'లో కొంత లోటు కనిపించింది. నాటకమాడిన హీరో ఆ మాత్రం ఎక్స్‌పెక్ట్ చేయకుండా 'కల్పన'ని ఒక్కర్తినే వదిలివెళ్ళడు. ఒకవేళ కల్పనకు ఆ స్లీపింగ్ టాబ్లెట్స్ వలన ప్రాణాపాయంజరిగితే అతను జీవితాంతం బాధపడాల్సివచ్చేది. ముగింపు యింకో విధంగా వుంటే బాగుండేదేమో అనిపిస్తుంది.

—సల్మ, తణుకు

వనిత డిసెంబరు సంచికలోని 'అభిప్రాయాలు' శీర్షికలో వై. కుల్‌సుమ్ బీ గారి వుత్తరం చివరన ''ఈనాడు సౌజన్యంతో'' అని వ్రాయడం మరచిపోయారనుకుంటాను! ఆ ఉత్తరములోని ప్రతి వాక్యము 26-10-79 ఈనాడు దినపత్రిక సంపాదకీయం నుంచి పునర్ముద్రించ బడిందని తెలియజేయడానికి ఎంతైనా చింతిస్తున్నాను. కనీసం అభిప్రాయాలు శీర్షికలోనైనా యిటువంటి గర్హనీయమైన చర్యలకు వనితలు పాల్పడరని ఆశించవచ్చా?

—గౌరి, మచిలీపట్నం

వనితలో ''నేరస్థుల కథలు'' చదువుతుంటే ఇటువంటి వనితలుంటారా అనిపిస్తుంది. ముఖ్య ద్వారానికి అందమైన అలంకారం ''పూసల తోరణం'' అత్యంత ఆకర్షణీయంగా వుంది. ''నింగినుండి నేలకు'' సశేష నవల ముగింపు చాలా బాగుంది.

—జి. సత్యవతి, గోకవరం

సమీక్ష చదివేక నవలని చదవాలనిపించడం సమీక్ష కొక కాంప్లిమెంట్. కేవలం నవలా ఇతివృత్తం నాలుగైదు వాక్యాలలో చెప్పి, మరి రెండు వాక్యాలలో తమ అభిప్రాయం చెప్పినంతలో అది మంచి సమీక్ష అనిపించుకోదు. తప్పులెత్తి చూపడమే కాకుండా, అలా కాదు ఇలా ఉంటే బాగుంటుందన్న సూచన కూడా చేసిన నిర్మాణాత్మక విమర్శ రచయిత్రులను పశ్చాత్తాపం పొందేట్టు చేస్తే మనం మంచి నవలలు చదువగలుగుతాము. సమీక్షార్థం వచ్చే నవలలో రచయిత్రి ఎన్నుకొన్న కథావస్తువూ, వాడిన శైలీ శిల్పాలూ, రచయిత్రి కనబరచిన సామాజిక స్పృహా, చివరగా పాత్రచిత్రణ గురించీ సమీక్షకులు కనీసం ఒక్కొక్క వాక్యమైనా రాసి తమ అభిప్రాయం వ్యక్త పరిస్తే అందులోనే నవలయొక్క ఇతివృత్తాన్ని పాఠకులు తెలిసికొన గలుగుతారు.

—కె. సత్యవతి, విజయనగరం

'వనిత' సర్వాంగ సుందరంగా రూపొందిస్తున్నారు సందేహం లేదు. కానీ నాదొక చిన్న మనవి. ప్రమదల్లో ప్రసిద్ధులైనవారి పరిచయాలు మన పత్రికలో చూస్తున్నాం. ఎవరెవరు ఏయేరంగాల్లో ఉన్నది. తెలుస్తుందేతప్ప దీనివల్ల సామాన్య గృహిణికి ఉపయోగమేమి? ఆంధ్రదేశంలోని మధ్యతరగతి గృహిణి, అట్టడుగున నున్న పేద ఇల్లాలు. వారి జీవన విధానం, వారి స్థితిగతులు, వారు నిత్యజీవితంలో ఎదుర్కొనే ఇబ్బందులు వాటి నివారణోపాయాలు వీటిని గురించి పరిచయాలు, వ్యాసాలు ప్రచురిస్తే బాగుంటుందని నా సలహా.

—కె. ఎస్. లక్ష్మిదేవి, చిత్రచేడు

''పిల్లలు-మానసికస్థితి'' వ్యాసం చాలా నీతిదాయకంగా ఉంది. ఎక్కువగా ఈ రోజుల్లో తల్లులు, పిల్లలు పుట్టీపుట్టగానే ఏ అమ్మమ్మల దగ్గరో, నానమ్మల దగ్గరో పెంచుతున్నారు. పిల్లల్ని అలా ఎవరిదగ్గరో పెంచటంవలన కలిగే నష్టాలేమిటో ఈ వ్యాసం చదివితే తెలుస్తుంది. గౌరాపంత్ శివానిగారు తెలియ చెప్తున్న నేరస్థుల కథలు కళ్ళవెంట నీళ్ళు తెప్పిస్తున్నాయి.

—గుత్తికొండ సుధారాణి, కొల్లూరు

మన దేవాలయాలులో ''నాగలాపురం'' గురించి ఫోటోలతోయుక్తంగా తెలిపిన విషయాలు చాలా ఆసక్తిని కల్గించాయి. ''నింగినుండి నేలకు'' సీరియల్ నేను ఊహించిన విధంగా ముగియడం నాకు చాలా సంతృప్తినిచ్చింది

—కందిగట్ల సావిత్రి, జనగామ

ఆంధ్రలో హైదరాబాద్‌లో తప్పించి సౌందర్యశాలలు ఇంక ఎక్కడా లేవు. ఇలాంటి సౌందర్యశాలలు ఉన్నాయని అందరికీ తెలుసు కాని అన్ని పట్టణాలలో ఇవి లేక స్త్రీలు ఇబ్బందిపడుతున్నారు. అలాంటప్పుడు మీరు వ్యర్థంగా ఫోటోలతోను వ్యాసంతోను రెండు పేజీలు నింపివేసారు.

—డి. ఉమాజీవన్, రామచంద్రపురం

## వనిత మాటల కొలువు – 53

**సరైన సమాధానం:**

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| 1 కా | టు | 14 క | | 2 గి | లి | 15 గిం | 16 త |
| కి | | 3 వ | ల్లి | రి | | 4 జ | లం |
| 5 బం | 17 తు | లు | | క | | | బ్రా |
| 6 గా | ని | | 18 గా | | 7 ఆ | 19 వా | లు |
| రు | | 8 చ | లి | కా | ల | ము | |
| | 9 జ | రి | వా | | కా | | 20 క |
| 10 యు | డు | త | న | | 11 ప | 21 ద | వి |
| | 12 పు | ము | | 13 లో | రి | ద | త |

పై సమాధానంతో సరిపోయే సమాధానం పంపిన వారు ఏడుమంది వారు:

1. టి. విజయలక్ష్మిబాయి, పామిడి 2. కె. వి. ఉషాకల్యాణి, ఏలూరు 3. ఎ. శ్యామలాదేవి, శ్రీకాకుళం 4. జి. హేమలత, కోటగిరి 5. వి. హైమవతి, నందివెలుగు 6. కె. సుజాత, హిందూపూర్ 7. ఎ. లక్ష్మితులసి, నందివెలుగు

**బహుమతి మొత్తం రూ. 150 లను వీరికి సమానంగా పంచి అందజేస్తున్నాము.**

# మకర సంక్రాంతి విశిష్టత'

'మకర సంక్రాంతి'ని మనవాళ్ళు 'పెద్ద పండుగ'గా భావిస్తున్నారు. పంటలన్నీ పండి ఇళ్ళకు చేరుకుంటాయి గనుక 'పంటల పండుగ' అనడం కూడా జరుగుతూ ఉంటుంది. సూర్యుడు మకరరాశి లోనికి ప్రవేశించే సందర్భంగా మనం జరుపుకుంటున్న ఈ పర్వానికి అన్ని పర్వాలకూ ఉన్నట్లే ఎన్నో గొప్ప గొప్ప కథలూ, గాధలూ ఉన్నాయి. అవన్నీ ఈ పండుగ గొప్పదనాన్ని చాటుతాయి.

సంక్రాంతి పండుగకూ గోదాదేవి కథకూ సంబంధముంది.

గోదాదేవి కథ:

శ్రీవిలిపుత్తూరులో భూదేవి అంశంగా జన్మించిన గోదాదేవి తులసీవనంలో పరమభాగవతోత్తముడైన విష్ణుచిత్తుడికి దొరికింది. నాగేంద్ర శయనుడి నారాధిస్తూ పుష్పమాలా కైంకర్యం చేస్తున్న ఆ విష్ణుచిత్తుడికి భగవత్కటాక్షలబ్ధ. ఈమెనే 'ఆండాళ్' అని కూడా పిలుస్తారు. పనిద్దరాళ్వార్లలో 'ఆండాళ్' ఒకరు. ప్రాగ్జన్మవాసనా ఫలితంగానూ ప్రతిరోజూ వటపత్రశాయి పుణ్యకథలూ, దివ్యప్రబంధాను సంధానమూ, తిరమాగళిలో శ్రవణపేయము గావడంవల్లనూ ఆమె రంగనాధునే ప్రేమించింది. విలిపుత్తూరు కోవెలలోని వటపత్రశాయినే రంగనాధునిగా భావించి తండ్రి గుడికి తీసుకెళ్ళే పూమాలన్నీ తాను ముందుగా ధరించి అద్దంలో చూసుకుని మురిసిపోయి, భద్రంగా వాటిని మళ్ళీ పూలసజ్జలో ఉంచేది. అలా భగవద్భక్తిని పెంపుజేసుకుని ఎంతకూ రంగనాధునికి తన పైన దయరాక పోగా ధనుర్మాస వ్రత మాచరించింది. దానినే శ్రీవ్రతమని కూడా అంటారు. వటపత్రశాయిని శ్రీకృష్ణునిగా, తన పరిసరాలను వ్రేపల్లెగా, తానే గోపికగా, తన చెలికత్తెలే గోపకన్యలుగా భావించి ఆమె ధనుర్మాస వ్రతాన్నాచరించింది. ఆ తాదాత్మ్య భావనతోనే ఆమె అభీష్టసిద్ధిని పొందింది. రంగనాధునిలో సంక్రాంతికి ముందు రోజునే ఆమె లీనమైపోయింది. వారి కళ్యాణానికి చిహ్నంగా ఈ పర్వదినం జరుపబడుతున్నట్లుగా చాలామంది విశ్వసిస్తున్నారు.

గోదాదేవియొక్క మధురభక్తి విధానం చేతనోజ్జీవనోపయోగం గావడంవల్ల ప్రపత్తి మార్గానుయాయులకీమె ఆదర్శం కావడంవల్ల, సంప్రదాయ తత్త్వజ్ఞులు ఈ ధనుర్మాస వ్రతాన్ని తప్పకుండా ఆచరిస్తుంటారు.

ధనుర్మాస ప్రాశస్త్యం

గోదాదేవి కథకూ సంక్రాంతికి సంబంధం ఉన్నట్లే ధనుర్మాసానికి గోదాదేవి కథకూ దగ్గర సంబంధముంది.

సూర్యుడు ధనుస్సులో ప్రవేశించిన మొదటి నెలరోజులూ ధనుర్మాసం. ఈ ధనుర్మాసం సంక్రాంతితో ముగుస్తుంది. శ్రీకృష్ణ భగవానునికి అత్యంత ప్రీతిపాత్రమైన మార్గశీర్ష మాసంలోనే ధనుర్మాసం వస్తున్నది. ఈ ధనుర్మాసం నెల రోజులూ విష్ణ్వాలయాల్లో విశేషంగా అర్చనలు జరుగుతాయి.

కార్తీకమాసం పరమశివుడికెలాగైతే ప్రీతికరమైనట్టిదో, అలాగే ఈ ధనుర్మాసం కూడా విష్ణుప్రీతికరమైనట్టిది. సదాశివుడు అభిషేక ప్రియుడైతే, శ్రీ మహావిష్ణువు అలంకార ప్రియుడు. ఈ కాలంలో చలి గజగజ వణికిస్తున్నప్పటికీ శ్రీ స్వామివారిని ముక్తికాముకులైన భక్తులు అలంకరించి పూజిస్తారు. విష్ణ్వాలయాల్లో అర్చావతారుడైన శ్రీమహావిష్ణుమూర్తికి బ్రాహ్మీ ముహూర్తంలోనే ఈ ధనుర్మాసం నెల రోజులూ సహస్ర నామార్చనలు జరిపి పట్టు పీతాంబరాద్యంలంకారాలతో స్వామిని అలంకరించి బాల భోగం చేస్తారు. ఇవన్నీ సూర్యోదయమవక ముందే జరిగిపోతాయి.

ఈ ధనుర్మాసంలో దీపదానం చేయడం కూడా చాలా ముఖ్యమైన విషయం. ఆవు నేతిలో దీపాన్ని వెలిగించడం మంచిదనీ, కనీసం నువ్వుల నూనెతోనైనా వెలిగించాలనీ చెబుతారు. తన శక్తికొద్దీ అఖండ దీపాన్ని వెలిగించి పరమాత్మ స్వరూపుడగు విష్ణుమూర్తికి సమర్పించినట్లయితే అన్ని రోగాలనుండీ విముక్తుడై సుఖాన్ని పొందుతాడని శాస్త్రాలు చెబుతున్నాయి. ఈభావంతో నిండిన శ్లోకాలివి—

'దీపదానం ప్రశస్తంహి ధనుర్మాస ప్రపూజనే
గోఘృతేనచ
వైదీప మధవాతిలతైలతః అఖండ దీపాన్
శ్శక్యాచ విష్ణవే
పరమాత్మనే అర్చయేద్యది పుణ్యాత్మా సర్వ
రోగా త్ప్రముచ్యతే'—అని.

వామనావతార గాథ

పూర్వం బలి చక్రవర్తి ఎంతో భక్తి శ్రద్ధలతో తొంబది తొమ్మిది యజ్ఞాలుచేసి నూరవ యజ్ఞాన్ని చేయడానికి తయారవుతున్న సమయంలో, వంద యజ్ఞాలు చేసిన వాళ్ళకి ఇంద్రపదవి లభ్యమౌతోందనే భయంతో దేవేంద్రుడు విష్ణుమూర్తి వద్దకు వెళ్ళి ఆయనకి విషయాన్ని మొరబెట్టుకోగా ఆ శ్రీ మహావిష్ణువు వామనావతారమెత్తాడు. బలి చక్రవర్తినంత మొందించే ఉద్దేశ్యంతో వామనావతారమెత్తిన లక్ష్మీనారాయణుడు బలి చక్రవర్తిని

మూడడుగుల స్థలం దానమిమ్మని అడుగుతాడు. అసాధారణ దాననిరతుడైన ఆ చక్రవర్తి మూడడుగుల స్థలాన్ని ఇవ్వడానికి సమ్మతించగా వామనుడు త్రివిక్రముడై భూమ్యాకాశాల పైన రెండడుగుల్నీ సరిపెట్టి, మూడవ అడుగు స్థలం కోసం బలి చక్రవర్తి శిరస్సుపై కాలిడి పాతాళానికి త్రొక్కి వేసి, దేవదానవ మానవులందరికీ ఆనందాన్ని కలిగిస్తాడు. ఆ చక్రవర్తి పాతాళానికి త్రొక్కి వేయబడిన రోజు ఈ మకర సంక్రాంతి రోజేనని చెబుతారు. త్రివిక్రముడి మూడు పాదాలకు సంకేతంగా ఈ మూడు రోజుల పండుగ (భోగి, సంక్రాంతి, కనుము) జరపడం ఆచారమైనట్టుగా పురాణాలు చెబుతున్నాయి.

గొబ్బి పూజల కథ

దేవేంద్రుడి పూజల్ని మాన్పించి గోపూజల్ని శ్రీకృష్ణమూర్తి చేయించగా ఆ అమరేంద్రుడు అవమానాన్ని భరించలేక కోపంతో ప్రళయాన్ని సృష్టించినంత పని చేస్తాడు. అలాంటి వాతావరణం నుండి గోవుల్నీ, గోపబాలుర్నీ రక్షించేందుకుగాను శ్రీకృష్ణుడు గోవర్ధన గిరినెత్తి అందర్నీ కాపాడుతాడు.

ఆ రోజునుంచి ఇంద్రుడికి చేసే పూజ గోవులకు చేయడం ఆచారమైపోయిందనీ, అదే కనుము పండుగ అనీ కొందరు నమ్ముతున్నారు. ఈ కథ నాధారంగా చేసుకునే గోవు కొకటీ గోపాలకృష్ణుని కొకటీ గోవర్ధనగిరి కొకటి సంకేతంగా మూడు గొబ్బిళ్ళుచేసి పూజలు చేయడం మనకు తెలియని సంగతి కాదు.

కాటమరాజు కథ:

గొబ్బిళ్ళకూ — కాటమరాజుకూ సంబంధం మున్నట్లుగా చిన్న కథ ద్వారా తెలుస్తున్నది. యాదవరాజైన కాటమరాజు ప్రతీ సంవత్సరం తన సోదరిని పిలిచి నూతన వస్త్రాలతో సత్కరించేవాడనీ, పశువుల పండుగనాడు ఆమెకు కనుము వేయించి అత్తవారింటికంపేవాడనీ చెబుతారు. ఆయన చెల్లెలి పేరు 'గొబ్బి' అనీ, ఆమెకూ మనవాళ్ళు పెట్టే గొబ్బిళ్ళకూ ఏదో సంబంధముండకపోదనీ కొందరంటారు.

ఇలా ఎన్నెన్నో విశిష్టగాథలతో పెనవేసుకున్న సంక్రాంతి పర్వం ఉత్తరాయణ పుణ్యకాలం ప్రారంభమవడంతోనే రావడం మరో విశేషం.

—జయా సౌజన్యామూర్తి

'సంక్రాంతి'కి ముగ్గుల పోటీని ప్రకటించగానే, ఎంతోమంది పాఠకులు రకరకాల ముగ్గులు పంపడం చూసినప్పుడు, రంగవల్లికల కళపట్ల మనకి వున్న ఆసక్తిని కొనియాడక తప్పదు! పోటీలో పాల్గొన్న వారందరికీ కృతజ్ఞతలు చెబుతూ, ఎన్నిక కాబడిన మూడు ముగ్గులను ఇక్కడ ప్రచురిస్తున్నాము.

ఈ ముగ్గులను పంపిన ఈ ముగ్గురికీ 'సంక్రాంతి బహుమతి'గా 50 రూపాయల చొప్పున పంపుతున్నాము.

మొదట 6 చుక్కలు 26 వరుసల్లో పెట్టుకోవాలి. ఆ తరువాత 5 చుక్కల కొకసారి అటు యిటు 5 చుక్కల చొప్పున పెంచాలి, తర్వాత అదే విధంగా తగ్గించుకుంటూ పోయి మొదటి ముగ్గులో చూపిన ప్రకారం గీతలన్నిటినీ కలుపుకోవాలి. ఆ తర్వాత అన్నివైపులా శిఖరాల మాదిరిగా కలుపుకోవాలి. ఈ శిఖరాలకు పూల గుత్తులను అమర్చితే చక్కగా వుంటుంది. ఈ ముగ్గు ఎన్నో మెలికలతో చూడ ముచ్చటగా వుంటుంది.

—డి. యస్. హేమలత, కర్నూలు







# ముగ్గుల పోటీ

మొదట 31 చుక్కలు ఒక వరుసలో పెట్టుకోవాలి. ఈ వరుసకి మధ్య చుక్క అంటే 16వ చుక్కకి అడ్డంగా అటు 15 చుక్కలు ఇటు 15 చుక్కలు పెట్టుకుని తర్వాత ముగ్గులో చూపిన విధంగా నాలుగు వైపులా చుక్కలు పెట్టుకుని కలుపుకుంటే ముగ్గు పూర్తవుతుంది. ఈ ముగ్గు అట్టే శ్రమ లేకుండా సులభంగా అందరూ వేసుకునేందుకు వీలవుతుంది.

—ఎస్. పి. ఎస్. దేవి, కడప



మొదట మధ్యవరుసలో 35 చుక్కలు పెట్టుకోవాలి. తర్వాత ఇరుపక్కలా 33 చొప్పున 2 వరసలు, 35 చొప్పున 1 వరుస, 33 చొప్పున 5 వరసలు, 27 చొప్పున 2 వరుసలు, 29 చొప్పున 1 వరుస, 27 చొప్పున 2 వరుసలు, 19 చొప్పున 1 వరుస, 17 చొప్పున 2 వరుసలు, చివర 3 చొప్పున 1 వరుస - చుక్కలు (మొదటి చిత్రంలో చూపిన విధంగా) పెట్టుకోవాలి. తర్వాత ముగ్గులో చూపినట్లుగా కలుపుకుంటే అందమైన ముగ్గు పూర్తవుతుంది.

—శారదా జనార్దన్, జగిత్యాల



## రూ 100 లు బహుమతి పొందిన ఈ నెల వంటకం



### సజ్జలతో లడ్డూలు

పిండివంటలన్నీ సాధారణంగా ఖరీదైన వస్తు సామగ్రితో చేసినవే బావుంటాయన్న నమ్మకం చాలామందిలో వుంటుంది. కానీ చౌకగా లభ్యమయ్యేవి, పోషక పదార్థాలు ఎక్కువగా వున్న ఆహారధాన్యాలతో కూడా కొత్తరకంగా పిండి వంటలు చేసుకోవచ్చు. అందుకు ఒక ఉదాహరణగా-సజ్జలతో చేసిన ఈ కొత్తరకం పిండి వంట గురించి వనితలకు వివరిస్తున్నాను.

సజ్జలు బాగా విరివిగా దొరికే ధాన్యం,కిరాణా కొట్టులో కూడా అమ్ముతారు. ఇవి బియ్యంకన్న చౌకగా లభ్యమవుతాయి. బియ్యం కన్న ఎక్కువ పోషకపదార్థాలు సజ్జలలో వున్నాయి కనుక ఇది దేహారోగ్యానికీ మంచిది.

**కావలసిన పదార్థాలు :**

1½ కప్పు సజ్జల పిండి, 1 కప్పు చక్కర, చిన్న కొబ్బరిచిప్ప ఒకటి, 2 టేబిల్ స్పూన్లు నెయ్యి, తగినంత జీడిపప్పు ముక్కలు, సార పప్పు, కొద్దిగా పాలు.

**తయారుచేయవలసిన విధానం :**

దీనికి మనం చేయవలసిందల్లా బాగా పచ్చగా, పెద్దగా వున్న సజ్జల్ని చూసి తెచ్చుకోవాలి. ఈ సజ్జల్ని రాయిరప్పా లేకుండా బాగా శుభ్రం చేసుకోవాలి. పొయ్యిపై బాణలి పెట్టి సజ్జల్ని పోసి దోరగా వేగేవరకు (వేగిన వాసన వచ్చేదాకా) వేయించి దించి పెట్టుకోవాలి. వేయించేటపుడు బాగా కలియపెడుతూ, అడుగున మాడిపోకుండా చూసుకోవాలి. వేయించిన సజ్జల్ని మిషనుకు పంపించి, మెత్తగా పిండి విసిరించి తెచ్చుకోవాలి.

ముందుగా బాణలి తీసుకుని అందులోకి ఒక టేబుల్‌స్పూన్ నెయ్యి వేసి వేడి చేయాలి. తర్వాత అందులోకి సజ్జల పిండిని వేసి వేయించుకోవాలి. ఓ అయిదు నిమిషాలకు పిండి బాగా వేగి ఘుమ ఘుమలాడే వాసన వచ్చేసరికి దించి ఒక పాత్రలోకి పోసి పెట్టుకోవాలి. జీడిపప్పును సన్నని ముక్కలుగా చేయాలి. కొబ్బరిని కోరి పెట్టాలి. మళ్ళీ బాణలిని పొయ్యిపై పెట్టి మిగిలిన నెయ్యి పోసి వేడి చేయాలి. అది వేడయ్యాక కొబ్బరికోరు, జీడిపప్పు ముక్కలు, సారపప్పు వేసి కొద్దిగా వేయించి దించి దానిని సజ్జ పిండిలోకి పోయ్యాలి. దీనికే చక్కెరను కూడా పోయాలి. ఇప్పుడు ఈ మొత్తం మిశ్రమాన్ని బాగా కలుపుకోవాలి. దీనికి పాలను చిలకరించి మళ్ళీ మొత్తం మిశ్రమాన్ని బాగా కలపాలి. (పాలు పోయకూడదు. పైపైనే చిలకరించాలి). ఇప్పుడు ఈ మిశ్రమాన్ని లడ్లు కట్టాలి. లడ్లు అన్నీ పూర్తయ్యాక డబ్బాలో పెట్టుకోవాలి. ఈ లడ్లు చాలా చౌకగా, చాలా సులభంగా తయారవుతాయి. చాలా రుచిగా కూడా వుంటాయి. ఇది ఆరోగ్యానికి మంచిది. ఇందులోకి పచ్చి కొబ్బరికి బదులు ఎండు కొబ్బరి కూడా ఉపయోగించవచ్చును, నేను చెప్పిన చక్కెర కొలతకు తీపి సరిగ్గా వుంటుంది. ఇంకా ఎక్కువ తీపి కావాలనుకునేవారు మరికొంత చక్కెర కలపవచ్చును.

పైన చెప్పిన మిశ్రమం పిండినే లడ్లు కట్టకుండా పూర్ణంవలె వుపయోగించి కజ్జికాయలు చేసుకోవచ్చును.

—గాడ్ల సరస్వతి, మద్రాసు



## వంటలపోటీ

మీరు ఎన్నో వంటలు తిని వుంటారు; తయారుచేసి వుంటారు. అలా ఒకరి ద్వారా నేర్చుకున్నవీ, చూసినవీ కాకుండా మీ పాక పరిజ్ఞానంతో మీరు ఏదైనా కొత్త వంటకం కనిపెట్టగలరా? అదీ స్వీటయినా, హాటయినా మరేదైనా పర్వాలేదు; కొత్త రకంగా వుండాలి; రుచికరంగా వుండాలి; చెయ్యడానికి తేలికగా వుండాలి. అలాంటి వంటకాన్ని చేసి మీరు తిని, "బాగుందీ, అందరూ మెచ్చుకుంటారు" అనిపించినపుడు ఆ వంటకం గురించి - అదెలా తయారుచెయ్యాలి? ఏమేం పదార్థాలు వెయ్యాలి? అన్న వివరాలతో మాకు రాసి పంపండి. మీ వంటకం కొత్తగా వుండి, బాగుందనిపిస్తే ఆ వంటకానికి—

## నూరు రూపాయలు బహుమతి!

జనవరి (80) నుంచి ప్రతి సంచికలోనూ ఒక్కో వంటకం వుంటుంది. వంటకాలలో ఆరితేరిన ప్రఖ్యాత పాకశాస్త్రజ్ఞురాలు - న్యాయనిర్ణేతగా వ్యవహరిస్తారు.

చిరునామా : వంటల పోటీ, వనిత—చందమామ బిల్డింగ్స్ మద్రాసు 600026

## టొమేటో టాఫీ

కావలసిన పదార్థాలు: ½ కిలో టొమేటోలు; ½ చిప్ప కొబ్బరి; 25 గ్రాములు జీడిపప్పు ముక్కలు; 3 టేబిల్ స్పూన్లు వెనీలా ఎస్సెన్స్; నెయ్యి-చిన్నకప్పు; చక్కెర తగినంత.

తయారు చేయవలసిన విధానం: టొమేటోలు నీళ్ళలో వేసి కొద్దిగా వుడికించి రసం తీసి చిక్కగా వడగట్టుకోవాలి. టొమేటో రసానికి రెండింతలు చక్కెర తీసుకుని కొబ్బరికోరు, టొమేటో రసం చేర్చి ఒక పాత్రలో కలుపుకోవాలి. ఈ పాత్రని స్టవ్ మీద పెట్టి సన్నని సెగ మీద ఈ మిశ్రమాన్ని గరిటతో కలుపుతూ వుండాలి. కొద్దికొద్దిగా నెయ్యి పోస్తూ - జీడిపప్పు ముక్కల్ని వేసి, పాత్రకు అంటుకోకుండా పక్వానికి రాగానే వెనీలా ఎస్సెన్స్ చేర్చాలి. స్టవ్ మీది నుంచి దించి నెయ్యి రాసిన పళ్ళెంలో పోసి చదునుగా చేసి ఆరిన తర్వాత — మనకి కావలసిన విధంగా ముక్కలుగా కోసుకోవాలి.

—ఆర్. బాల

వర్ణచిత్రాలు: కె. ఆర్. వి. భక్త



సజ్జలతో లడ్డూలు

టొమేటో టాఫీ

# సంక్రాంతి ముగ్గులు

"హిందూ గృహమే ఒక కళాశాల"—అన్నారు ఒక సుప్రసిద్ధ రచయిత. 'కళ' హైందవ మహిళల జీవనంతో నిత్య సంబంధియై పెనవేసుకొని పోయిందనడం నిర్వివాదాంశం. సంప్రదాయాలు, ఆచారాలు, కట్టుబాట్లు—అనే వంకతో హైందవ గృహం సర్వాలంకార శోభితమై, సకల కళలకు సదనమై అలరారుతూ వుంటుంది. గృహాలంకరణంలో ప్రధాన స్థానం అలంకరించేవి ముగ్గులు. హిందూ గృహానికి సరైన సంకేతం ముంగిట్లో ముగ్గు. హైందవ సంప్రదాయబద్ధ జీవనానికి ప్రతీక—హిందూ మహిళ కళాత్మక జీవితానికి జయపతాక-ముగ్గు.

హైందవ సంప్రదాయం ప్రకారం నిత్యమూ ముంగిట్లో, పూజా ప్రదేశాలలో, ప్రతి దైవ కార్యంలో తుదకు యజ్ఞాది క్రతువులలో ప్రముఖ స్థానాన్ని ఆక్రమించిన ఈ ముగ్గు ధనుర్మాసారంభ కాలం నుండి ఒక ప్రత్యేకతను సంతరించుకొని చిత్రవిచిత్ర రూపాలలో ఇంటి ముంగిట సాక్షాత్కరిస్తుంది. వీటిని 'ధనుర్మాసం ముగ్గులు' లేక 'సంక్రాంతి' ముగ్గులు అంటారు.

ముగ్గు అనేది చిత్రలేఖనంలో ఒక భాగం. చిత్రలేఖనంలోని 'బిందుజ' అనే భాగానికి చెందినదే ముగ్గు అని 'విష్ణుధర్మోత్తర గ్రంథము'లో చెప్పబడినది. అనగా బిందువులతోను (చుక్కలతో), రేఖలతోను ఎడబాటు లేకుండ కూర్చబడిన చిత్రమే ముగ్గు అని అర్థం. చుక్కను ఆధారం చేసుకుని నియమబద్ధమైన రేఖలను గీసి తీర్చబడేదే ముగ్గు. నియమిత ప్రదేశాలందుంచిన చుక్కలను కలుపుతూ పట్టుదలతో ముగ్గు దిద్దుతారు గనుక దీనికి 'పట్టు' అన్న పేరు కూడా వుంది. చూడడానికి రమ్యంగా ఉండడంచేత, రంగులతో కూడ తీర్చిదిద్దబడడం చేత 'రంగవల్లులు' అని కూడ పిలుస్తారు. తమిళులు 'కోలమ్' అని, బెంగాలీలు 'ఆల్పోన' అని ముగ్గును వ్యవహరిస్తారు.

ముగ్గులు పెట్టడంలో కొన్ని సందర్భ నియమాలున్నవి. ఒక్కొక్క సమయానికి ఒక్కొక్క రకమైన ముగ్గు వేయాలని నియమాలున్నవి. వ్రతాలు చేసేటప్పుడు, పూజా ప్రదేశాలలో సాధారణంగా 'పద్మాల ముగ్గులు' నిర్దేశితాలు. వివాహం జరిగే చోట 'పెండ్లి అరుగుముగ్గు' లేక 'కల్యాణ మండపం ముగ్గు', అలాగే ప్రతి శుభకార్యానికి 'పీటపట్ల ముగ్గు' వెయ్యడం ఆచారం. ముగ్గులు కేవలం కళా వైదుష్యానికి చిహ్నాలే గాదు. ఎంతో అర్థసహితాలు కూడ. గీత, చుక్కలముగ్గులు భగవంతునికి సంకేతాలుగా చెప్పబడుతాయి. సమబాహు త్రిభుజాకారపు ముగ్గు విష్ణుమూర్తికి - తిరగబడిన త్రిభుజం 'అగ్ని'కి, లతాకారుడైన శివునికి, పరస్పరం ఒకదానినొకటి ఖండించే త్రిభుజాలు పద్మాసీనుడైన బ్రహ్మదేవునికి సంకేతాలుగా పేర్కొనబడినవి—ధనుర్మాసారంభం నుండి వేయబడే సంక్రాంతి ముగ్గులలోగల ప్రత్యేకత, పరమార్థం పరిశీలిద్దాం.

సంక్రాంతి ముగ్గులలోని ముఖ్య నియమం చుక్కల ముగ్గులకన్న గీతల ముగ్గులకే ప్రాముఖ్యమీయబడటం. సంక్రాంతి ముగ్గులనగానే తొట్టతొలుత స్ఫురణకు వచ్చేది—వికసిత పుష్పాన్ని పోలిన 'గుచ్ఛబంధపు ముగ్గు'. మధ్యలో గుచ్ఛబంధాన్ని పోలిన ముగ్గును పెట్టడానికిరువైపుల పాములను చిత్రిస్తారు. ఈ ముగ్గులలో ప్రత్యేకమైన అర్థం ఇమిడి యున్నది. మధ్యగల గుచ్ఛ బంధము క్రమ కృతగ్గ ఫలితం. ఫలసాయము ఇంటికి చేరితే కర్షకుల ఆనందానికి సంకేతంగా కొందరు భావిస్తున్నారు. ఈ బంధం సూర్యుని రథచక్రమునకు అందలి పండ్రెండు గళ్ళు పండ్రెండు రాసులకు చిహ్నాలని కూడ భావించబడుచున్నవి. ఆదిత్యుడు ద్వాదశ రాసులలో సంచరిస్తాడని, ప్రక్కన గీయబడిన రెండు సర్పాలు మృత్యు సంకేతాలనీ, హేమంతశీతల వాతావరణ సంయుత అనారోగ్య సమయం అనేక రోగాల కాలవాలమనీ, సర్పదంష్ట్రలచే విగత జీవులైనట్లే, ఈ వాతావరణం అనారోగత ప్రేరిత ప్రభావంచేత అనారోగ్యులు కాగలరనే సూచించడానికి సర్పాలు చిత్రించడం జరుగుతున్నదనీ భావించబడుతున్నది.

ఇక 'గొబ్బిముగ్గు'. ధనుర్మాస కాలంలో బాలికలు ఈ ముగ్గును ముంగిట్లో తీర్చిదిద్దటం ఆచారం. పై గుచ్ఛబంధాన్ని పోలిన సంక్రాంతి ముగ్గువేసి అందులో మధ్య గోమయపు ముద్ద లుంచి, పసుపు కుంకుమ, బంతి లేక గుమ్మడి పూలతో అలంకరిస్తారు. ఈ గోమయపు ముద్దలు గోవర్ధనగిరికి, గోపాలకృష్ణునకు, గోమాతకు చిహ్నాలుగా చెబుతారు.

తర్వాత చెప్పదగినది 'రథము ముగ్గు'.

స్త్రీల అందానికి పైమెట్టు

# ఐటెక్స్

తిలకం బొట్టు

ఆకర్షణీయమైన అనేక రంగుల్లో, మేలైన
సువాసన ద్రవ్యాలతో. మృదువైన చర్మానికి
ఎలాంటి హాని కలుగని విధంగా
తయారు చేయబడుతోంది.

ఐటెక్స్ (MATT FINISH) తిలకం
స్త్రీల సొగసుకు ప్రియతమ తిలకం




CREATIVE AD SER 203

ARAVIND LABORATORIES MADRAS-600 033





సంక్రాంతికి వీడ్కోలు చెప్పే ఈ ముగ్గు 'ముక్కనుము' నాడు వేస్తారు. రథమును ముగ్గు రూపంలో చిత్రించి, ఒక ముగ్గు కర్రను రథానికి అతికినట్లు వేసి దానిని ప్రక్కింటివారి ముగ్గుకు (కొందరు వీధి చివరకూ, తీసుకొనిపోయి వదలుట కూడ కద్దు) కలుపుతారు. అనారోగ్య ప్రకృతిని రథం యెక్కించి సాగనంపుతున్నట్లుగా సూచించ డమే రథము ముగ్గుయొక్క ఉద్దేశ్యమని భావన.

మన పురాణాలలో కూడా సీతాదేవిచేత జనక మహారాజు రాజసౌధాల ముందు కస్తూరిని కళ్లాపుగా జల్లించి, రంగులతో రంగవల్లులు వేయించినట్లుగా వున్నది. నిత్య దరిద్రుడూ, నిరంతర వ్యాధి గ్రస్తుడూ అయిన ఒక సామాన్య గృహస్థుడు సతీ సమేతంగా సూర్యాలయంలో సంక్రాంతి రోజు లలో నిత్యమూ ముగ్గులు దిద్దటంచేత మరు జన్మలో సత్రాజితుడను రాజుగా అతని సతి మహారాణిగా జన్మించారని 'సాత్రాజితోపాఖ్యా నం'లో చెప్పబడి వుంది.

ఈ ముగ్గులు పెట్టడంలో ఆరోగ్య సూత్రాలు కూడ యిమిడియుండడం గమనార్హం. గోమ యంతో కలిపిన నీటితో కళ్లాపు చల్లడం, క్రిమి సంహారకమైన గుల్లసున్నపు ముగ్గుపిండితో ముగ్గులు దిద్దడంవల్ల వ్యాధికారక క్రిములకు స్థానం లేకుండా, సాంక్రమిక వ్యాధులు సంక్రమించ కుండా గృహ పరిసరాలు శుభ్రం అయ్యే అవ కాశమున్నది.

స్త్రీల కళాతృష్ణ, వారి హస్త కళా నైపుణ్యంతో నూతన రూపం దాల్చే విద్యయే ఈ ముగ్గులు. అందుకే అంటారు - ''ఇల్లు అందం చూడూ ఇంటి ఇల్లాల్ని చూడు...ముగ్గందం చూడూ... ముగ్గులోని మురిపెం చూడూ...'' అని. ఒకరోజు పెట్టిన ముగ్గు మరో రోజు పెట్టక ఒకరితో మరొకరు పోటీపడి తమ తమ ముంగిళ్ళలో ఈ వెల్లాళ్లు ఉవిదలు ఉప్పొంగే ఉత్సాహంతో తమ కళా వైదుష్యానికి నిగ్గులుగా ఈ ముగ్గులు వేస్తారు.

నవనాగరికతా వ్యామోహ ప్రభావంగా మనలో ఈ ముగ్గుల కళ కొంతవరకు మరుగున పడిపోతున్నదేమోననిపిస్తుంది అందువల్ల మన తర తరాల సంస్కృతికి ప్రత్యక్ష దర్పణంగా నిలిచే ఈ ముగ్గులను ప్రోత్సహించడం ఎంతైనా అవసరం.

—జి. వసుధ



## ముఖచిత్రం

# జయంతి



అట్ట మీద సంక్రాంతి శుభాకాంక్షలు చెబుతున్న అమ్మాయి కుమారి జయంతి. తెలుగు అమ్మాయి అయిన జయంతి తండ్రి శ్రీ రాజగోపాల్ (మేనేజింగ్ డైరక్టర్, లక్ష్మిమిల్స్), తల్లి శ్రీమతి మణి రాజగోపాల్. చాలాకాలం క్రితమే ఈ కుటుంబం కోయంబత్తూరులో స్థిరపడింది. అందువల్ల జయంతి విద్యాభ్యాసం అక్కడే జరిగింది. పాఠశాలలో చదువుతూ వుండగానే జయంతి వక్తృత్వపు పోటీలలోనూ, చిత్రలేఖనంలోనూ పలు బహుమతులు పొందారు. అంతేకాదు, జిల్లా స్థాయిలో ఆమె షాట్ పుట్‌లో అనేక రికార్డులు నెలకొల్పారు. ఛాంపియన్ షిప్‌లు గెల్చుకున్నారు. డిస్కస్ త్రో, షాట్ పుట్‌లలో వరుసగా మూడు సంవత్సరాలు రాష్ట్రస్థాయి జట్టు తరఫున జాతీయక్రీడలలో పాల్గొన్నారు. అంతర్ కళాశాల పోటీలలో కూడా పాల్గొన్నారు.

కుమారి జయంతికి రైఫిల్ షూటింగ్‌లోనూ ప్రావీణ్యత వుంది. ఆమె తండ్రి వన్యమృగాలను వేటాడంలో . అందవేసిన చేయి. ఆయనతోపాటే జయంతి కూడా వేటకి వెళుతూ వుండేవారు. రైఫిల్ షూటింగ్‌లో ప్రావీణ్యత వున్నా అనవసరంగా ఆ జంతువుల ప్రాణాలు తియ్యడం తనకు ఇష్టం లేదంటారు జయంతి. షికారీలోనే కాక స్విమ్మింగ్‌లోనూ ఆమెకు ప్రవేశముంది.

కుమారి జయంతి భరతనాట్యంలో కూడా సిద్ధహస్తురాలు. 1974 లో కోయంబత్తూరులో ఆమె అరంగేట్రం ప్రదర్శన ఇచ్చారు. 1976 నుంచి నాట్య కళాసమ్రాట్ వళువూర్ సామ్రాజ్ వద్ద తను నేర్చుకున్న భరతనాట్యానికి మెరుగులు దిద్దుకుంటున్నారు. ఆ సంవత్సరమే ఆమె కేంద్ర విద్యా మంత్రిత్వశాఖ అఖిలభారత స్థాయిలో ఏర్పాటు చేసిన యువజన ఉత్సవాలలో పాల్గొని భరత నాట్యంలో అత్యంత ప్రతిభ కనబరచినందుకు పలువురి ప్రశంసలు పొందారు.

ఇప్పటివరకు అనేక నాట్య ప్రదర్శనలు ఇచ్చిన జయంతి పలు సహాయ కార్యక్రమాలకు కూడా నాట్య ప్రదర్శనలు ఇచ్చి నిధుల సేకరణకు తోడ్పడ్డారు. అటువంటిదే గత మార్చినెలలో దేవాలయ నిర్మాణానికి బొంబాయిలో ఇచ్చిన ప్రదర్శన. నృత్యంతోపాటే ఆమె యోగాభ్యాసనల అధ్యయనం, వీణ, కర్నాటక సంగీతం కూడా నేర్చుకుంటున్నారు.

ప్రస్తుతం మద్రాసు విమెన్స్ క్రిస్టియన్ కళాశాలలో బి.ఎస్సీ (న్యూట్రీషన్) చివరి సంవత్సరం చదువుతున్న జయంతి 'హాస్పిటల్ అడ్మినిస్ట్రేషన్'లో ఉన్నత విద్య అభ్యసించాలని వుంది అన్న అభిలాషను వ్యక్తం చేశారు. □

సంక్రాంతి

**నవలల పోటీలో**
**రూ. 3000లు బహుమతి**
**పొందిన నవల**



సశేషనవల:

# బొమ్మా-బొరుసూ

## శీలంశెట్టి రమాదేవి

"హలో" డబుల్‌డెక్ బస్‌లో పైన కూర్చుని ఉన్న శ్రీనివాసరావును పలకరించాడు సుధీర్.

"ఎక్కడికి బయల్దేరావ్?" అడిగాడు శ్రీనివాసరావ్ చిరునవ్వుతో

"అబిడ్స్‌కి!"

"రా, ఇక్కడ కూర్చో!" తన సీట్లో కొంచెం స్థలం ఇస్తూ ఆహ్వానించాడతను.

"వద్దులే! నా వెనుక మా తాలూకు జనం కూడా నిలబడే ఉన్నారు!" వారిస్తూ అన్నాడు సుధీర్.

"ఎవరు వాళ్లు?" అతని వెనుకవేపుకి తల తిప్పి చూస్తూ అడిగాడు శ్రీనివాసరావు.

"ఏకవచనమేలే! బహువచనం కాదు! మా మామయ్య గారమ్మాయ్!" నవ్వుతూ అన్నాడతను.

సుధీర్ వెనుకే నిలబడ్డ అమ్మాయిని చూస్తూనే అప్రతిభుడయిపోయాడు శ్రీనివాసరావు. ఆ యువతి అందం అతనిని పూర్తిగా మొదటి చూపులోనే వ
చేసుకొంది. మరోసారి వెనక్కు తిరిగి చూడాలన్న కోరికను బలవంతంగా అణచుకొన్నాడు.

అంత అందమయిన యువతి మామయ్య కూతురవడం నిజంగా సుధీర్ అదృష్టం!

"మళ్లీ నాటకం వేయవా?" నవ్వుతూ అడిగాడు సుధీర్.

"ఆ ఒక్కసారికే బుద్ధి వచ్చింది గురూ! ఇంకొద్దు!" తనూ నవ్వుతూ అన్నాడు శ్రీనివాసరావు.

"ఎందుకని?"

"ఎందుకనేమిటి? అందరితో చివాట్లు తినడమే! రిహార్సల్ అన్ని రోజులూ డైరక్టర్ విసుక్కునేవాడు! మిగతా ఆర్టిస్టులు విసుక్కునేవారు. నా మూలాన తన డైలాగ్స్ దెబ్బ తింటున్నాయని హీరోయిన్ చివాట్లు పెట్టేది. స్టేజి ఎక్కాక జనం కేకలు - తిట్లు!...."

తన మాటలు వింటోన్న ఆ యువతి బలవంతంగా నవ్వాపుకోవడం ఓరగా గమనించాడు శ్రీనివాసరావ్. అతని గుండెలు వేగంగా కొట్టుకొన్నాయ్. తన మాటలు ఆమెను ఆకర్షిస్తున్నాయా? ఎక్కడలేని ఉత్సాహం పొంగుకొచ్చిందతనికి. ఆ అమ్మాయిని ఆకర్షించడానికి ప్రయత్నించడం తప్పని తనకు తెలుసు. కానీ మనసుని అదుపులో ఉంచుకొనడం ఎంతమందికి సాధ్యమవుతుంది?

ఆమె తన స్నేహితుడు సుధీర్ మావయ్య కూతురు. అంచేత అసలామె మీద అలాంటి అభిప్రాయమే కలుగకూడదు.

సరిగ్గా అప్పుడే ముందున్న సీటు ఖాళీ అవడం వాళ్లిద్దరూ వెళ్లి అందులో కూర్చోవడం జరిగింది.

శ్రీనివాసరావ్ నిరుత్సాహపడ్డాడు.

అతని మనసంతా అసంతృప్తితో నిండిపోయింది. ఆ యువతితో పరిచయం కలిగితే ఎంత బావుంటుంది? తన జన్మ తరించినట్లే భావించవచ్చు! ఒక్కసారి ఆమె తనని పలుకరిస్తే చాలు. తనామెతో ఒక్క మాట మాట్లాడితే చాలు!

ఆ మాటలను తన డైరీలో రాసుకుంటాడు. జీవితాంతం స్మరిస్తాడు.

బస్ ఆబిడ్స్ చేరుకుంది.

అయ్యో! వాళ్ళు దిగిపోతున్నారు.

ఊహుఁ! ఈ అవకాశాన్ని వదులుకోవడం తన వల్ల కాదు.

చటుక్కున లేచి నుంచున్నాడు శ్రీనివాసరావ్.

"నువ్వూ ఇక్కడే దిగుతున్నావా?" అడిగాడు సుధీర్.

"అవును!" అబద్ధమాడేశాడు శ్రీనివాసరావ్. నిజానికి తను కోఠీలో దిగాల్సి ఉంది.

వాళ్ళ వెనకే బస్ దిగి నిలబడ్డాడతను.

"నువ్వెందాకా వెళ్ళడం?" అడిగాడు సుధీర్.

"ఇక్కడే కొంచెం షాపింగ్ చేద్దామనీ...."

"వెరీగుడ్! అలాగయితే పద! మేమూ ఆ పని మీదే బయల్దేరాం!" నవ్వుతూ అన్నాడు సుధీర్.

ముగ్గురూ ముందుకు నడువబోతూండగా సుధీర్‌కి తక్కున గుర్తుకొచ్చింది. "నీకు మా హేమని పరిచయం చేయలేదు కదూ! పూర్తి పేరు హేమలత. బి. యస్సీ. బ్రాకెట్లో సెక్రటరీ, నారీ విప్లవ సంఘం, కాకినాడ!...."

"చాల్చాల్లే బావా! ఇంక ఆపెయ్...." కోపంగా అన్నది హేమ.

"సరే! ఆపేస్తాను! ఇక ఇతను శ్రీనివాసరావ్! మా డిపార్ట్మెంటేగాని వీళ్ళ ఆఫీస్ వేరే వుంది ఊరవతల! నాలాగానే నాటకాలంటే ఇష్టం! కాని బెదిరిపోయాడు మొదట్లోనే...."

"నమస్తే!" నవ్వుతూ ఆమెకు నమస్కరించాడు శ్రీనివాసరావ్. "నమస్తే!" చిరునవ్వుతో ప్రతి నమస్కారం చేస్తూ అందామె.

"మా బావకూ నాకూ క్షణం పడదులెండి! అందుకని నా మీద మా బావ చెప్పే మాటలేమీ నమ్మకండి!" సుధీర్ వంక చిరుకోపంతో చూస్తూ అంది హేమ.

ముగ్గురూ రద్దీగా ఉన్న ఫుట్‌పాత్ మీద నడువ సాగారు.

ఆమె అందాన్ని తనివితీరా చూస్తున్నాడు శ్రీనివాసరావు.

తను హైద్రాబాద్ వచ్చి అయిదేళ్ళవుతోంది. ఎంతోమంది అందమయిన అమ్మాయిలను చూశాడు ఈ అయిదేళ్ళల్లోనూ. కాని ఎవ్వరూ తననింత ఉన్మాదుడిని చేయలేదు. ఎవరి అందమూ తననింతగా ఆకట్టుకోలేదు. ఒకే ఒక్క చూపులో తనెందుకిలా అయిపోయాడో తలచుకొంటే విచిత్రమనిపిస్తోంది. లవ్ ఎట్ ఫస్ట్ సైట్ అంటే ఏమిటో ఇప్పుడు తెలుస్తోంది.

ముగ్గురూ ఓ పెద్ద చీరల షాపులోకి నడిచారు.

"ఏ చీరలు చూపమంటారు?" అడిగాడు కౌంటర్ దగ్గరున్న వ్యక్తి.

"అమెరికన్ జార్జెట్-ప్రింటెడ్...." చెప్పింది హేమ.

మరుక్షణం కౌంటర్ నిండుగా గుట్టలు గుట్టలుగా పేర్చేశాడు ఆ చీరలు.

"ఏవి బావున్నాయో చూడు బావా!" అందామె సుధీర్‌తో.

"అదేమిటి? మగాడు స్త్రీని అణగదొక్కేస్తున్నాడు, బానిసగా చేసుకొని హింసిస్తున్నాడు అంటూ మీ నారీ విప్లవ సంఘంలో ఉపన్యాసాలిస్తారు కదా! మళ్ళీ చీరల సెలక్షన్‌కి మగవాడెందుకు?" ఆమెని ఉడికిస్తూ అన్నాడు సుధీర్.

శ్రీనివాసరావు నవ్వేశాడు.

"సరే! నువ్వు సెలెక్ట్ చేయవద్దులే! శ్రీనివాసరావ్‌గారే చేస్తారు...." అందామె కోపంగా.

"అంటే? శ్రీనివాసరావ్ మగవాడు కాదా?" ముగ్గురూ నవ్వేశారు.

శ్రీనివాసరావ్ ఆమెకు ఎంతో బావుంటాయనుకొన్న రెండు చీరలు బయటకు లాగాడు.

"ఈ రెండూ బాగున్నాయి నాకు! వీటిలో ఏదయినా సరే మీకు అద్భుతంగా సూటవుతుంది" అన్నాడు హేమతో.

ఆమె కళ్ళు సంతృప్తితో మెరిసినయ్.

"థాంక్యూ! నాకూ ఇవే నచ్చాయ్! ఏం బావా రెండూ తీసుకోనా?"

"బావుంది! నా ఇష్టమేముంది? నేను కొని ఇవ్వడం లేదుకదా!"

"అయ్యో! నీ చేతులతో నాకు ఎప్పుడేనా కొనిచ్చావ్ కనుకనా, ఇప్పుడు కొనిస్తావనుకోడానికి? నా దగ్గర డబ్బుండిలే గాని, ఈ రెండూ కొనేయమంటావా, వద్దంటావా చెప్పు! తరువాత మా అమ్మ కేక లేస్తే నీ పేరు చెప్పేస్తాను — అందుకు?" అన్నది హేమ.

"నాకు ముందే తెలుసులే! ఆ విషయం!" నవ్వుతూ అన్నాడు సుధీర్.

"రెండూ కొనండి హేమగారూ! రెండూ బావున్నాయ్...." తను కల్పించుకుంటూ అన్నాడు శ్రీనివాసరావు.

"సరే! రెండూ ఇవ్వండి!" అని ఆ సేల్స్‌మేన్‌కి చెప్పింది హేమ.

పాకెట్ తీసుకుని బయటికి వస్తూ "చూడు బావా! నువ్వే మీ ఫ్రెండ్ ద్వారా బలవంతం చేయించి కొనిపించావని అమ్మతో చెప్పేస్తాను".... నవ్వుతూ అన్నది హేమ.

"చూశావా! అందుకే నేను మాట్లాడలేదు. ఎప్పుడయినా వాళ్ళ ఊరు వెళ్తే నన్ను మా అత్తయ్య అరగంట తోమేస్తుంది — అంత డబ్బు ఖర్చు చేయించినందుకు!" శ్రీనివాసరావుతో అన్నాడు సుధీర్.

"అంతే కావాలి!" వెక్కిరింపుగా అన్నది హేమ.

శ్రీనివాసరావు ఆ మాటలేమీ వినే స్థితిలో లేడు. వివిధ భంగిమల్లో ఇనుమడిస్తున్నట్లు కనబడుతున్న ఆమె అందాన్నే రెప్ప వాల్చకుండా చూస్తున్నాడు.

"మరి నీ సంగతేమిటి? నువ్వేం కొనాలి?" అడిగాడు సుధీర్ శ్రీనివాసరావుని.

"నేనా?....ఆ! నేనూ ఓ షర్ట్‌పీస్ కొనాలనుకొన్నాను...." అబద్ధమాడేస్తూ అన్నాడు అతను.

"మరింకేం! పద! ఈ షాప్‌లో కొందాం!" పక్కనే ఉన్న ఇంకో షో రూమ్‌లోకి అడుగు పెడుతూ అన్నాడు సుధీర్.

తమ ముందు పరచేసిన రకరకాల డిజైన్లు చూసి "ఏది తీసుకోమంటావ్?" అంటూ సుధీర్ నడిగాడతను. అతని ఉద్దేశ్యం హేమే తనకి షర్ట్ సెలక్ట్ చేయాలని. కానీ ఆమెనడగడం సుధీర్‌కి ఎబ్బెట్టుగా కనబడుతుందేమోనని అతనినే అడిగాడు.

"ఇది బావుంది! తీసుకోండి!" తనే చొరవగా ఓ చారల డిజైన్ లాగుతూ అంది హేమ.

శ్రీనివాసరావ్ ఆనందంతో ఉక్కిరిబిక్కిరయ్యాడు.

"థాంక్యూ!" అన్నాడు చిరునవ్వుతో ఆమె వంక చూస్తూ.

ముగ్గురూ బయటికొచ్చారు.

"నీ ప్రోగ్రామేమిటిప్పుడు?" అడిగాడు సుధీర్.

"ఏంలేదు. ఇంటికి వెళ్ళడమే! మీరు"

1. మన దేశపు జాతీయగీతం 'జనగణ మన' రాసినవారు రవీంద్రనాథ్ టాగూర్ అని అందరికీ తెలుసు. మరి మరొక జాతీయగీతం 'సారా జహాఁసే అచ్ఛా, హిందుస్థాన్ హమారా' అన్నది రాసినవారెవరు?

2. 'దేశమును ప్రేమించుమన్నా మంచి యన్నది పెంచుమన్నా' అన్న ప్రబోధ గీతాన్ని మీరు చాలాసార్లు వినే వుంటారు. ఇది రాసినవారెవరో చెప్పగలరా?

3. మరొక దేశ భక్తిగీతం 'ఏ దేశ మేగినా ఎందు కాలిడినా, నిలుపరా నీ జాతి నిండు గౌరవము' ఈ గీత రచయిత ఎవరు?

4. 'వందేమాతరం' స్వాతంత్ర్య పోరాట సమయంలో ఉద్రేకాన్ని, భావావేశాన్ని కలుగజేసిన గీతం, అయితే అంతటి మహత్తర గీతాన్ని రాసినవారి పేరు చెప్పగలరా?

5. 'మా తెలుగు తల్లికి మల్లెపూదండ' అనే గీతాన్ని ఒక 'సుందరకవి' రాశారు. ఆయన ఎవరు?




6. 'స్వరాజ్యం నా జన్మ హక్కు; దాన్ని నేను సాధించి తీరుతాను' అని ఘోషించిన జాతి రత్నం ఎవరు?

7. సెప్టెంబర్ 13, 1979న జతీన్‌ద్రనాథ్ దాస్ అనే ఆయన సంస్మరణార్థం మన తంతి తపాలా శాఖ ప్రత్యేకమైన 30 పైసల తపాలాబిళ్ల విడుదల చేసింది. ఇంతకీ ఈ జతీన్‌ద్రనాథ్ దాస్ ఎవరు?

8. 'డిస్కవరీ ఆఫ్ ఇండియా' (భారత దర్శని) అన్న మహోత్కృష్ట గ్రంథాన్ని రాసినవారు జవహర్‌లాల్ నెహ్రూ అని అందరికీ తెలుసు. మరి మన 'జాతి పిత'గా కీర్తింప బడిన మహాత్మాగాంధీ రాసిన గ్రంథం పేరు చెప్పగలరా?

9. 1947 ఆగస్ట్ 15 నాడు మనకి స్వాతంత్ర్యం లభించిందని తెలుసు. అయితే స్వాతంత్ర్య పోరాటం ముమ్మరంగా సాగుతున్న సమయం లోనే భారతావని అంతటా కూడా స్వాతంత్ర్య దినోత్సవం జరుపుకొన బడింది. అది ఏ సంవత్సరం.... ఏ నెల....ఏ తేదీన జరిగింది? ఆ సంవత్సరమే మహాత్మాగాంధీ దండి ఉప్పు సత్యాగ్రహం, మొదటి రౌండ్‌టేబుల్ కాన్ఫరెన్స్ కూడా జరిగాయి.

10. ఈ నెల అంటే జనవరి 26 న మనం ముప్పయ్యవ రిపబ్లిక్ దినోత్సవం జరుపుకుంటున్నాము. ఈ వేడుకలలో ముఖ్యభాగం పతాకావిష్కరణ. మరి మన జాతీయ పతాకాన్ని రూపొందించిన వ్యక్తి ఎవరో చెప్పగలరా?

**[సమాధానాలు ఈ సంచికలోనే వున్నాయి. వెతికి మీ సమాధానాలతో సరిపోతాయేమో పోల్చి చూసుకోండి]**

అడిగాడు శ్రీనివాసరావ్.

"మేమూ ఇంటికే: పద: కాఫీ తాగి ఎవరి దారిని వాళ్లు పోదాం!" ఎయిర్ కండిషన్ రెస్టారెంట్ వేపు దారితీస్తూ అన్నాడతను.

ముగ్గురూ రెస్టారెంట్‌లో కూర్చున్నారు.

వారికి పక్కనే దంపతులు వారి పిల్లలతో కూర్చుని ఉన్నారు. ఫలహారం తినడం ముగించిన పిల్లలను వాష్‌బేసిన్ దగ్గరకు తీసుకువెళ్ళి చేతులు, కడిగి తీసుకొచ్చిందామె.

"అదిగో చూడు బావా! అక్కడే నాకు వళ్ళు మండేది. మన పక్కన కూర్చున్న ఆ భార్యా భర్తలున్నారు కదా! ఆ పిల్లలు ఇద్దరికీ చెందుతారు కదా! కానీ వారికి సేవలు చేయాల్సి వచ్చేటప్పుడు పెళ్ళానికే చెందుతారు వాళ్ళు. అవన్నీ ఆడదే చెయ్యాలి. మగవాడికేం సంబంధం లేదు. బయటికి వెళ్ళేప్పుడు షోగ్గా జేబులో నుంచి పర్స్‌తీసి బిల్లు చెల్లిస్తే బాధ్యత తీరిపోతుంది కాబోలు...." కసిగా అందామె.

శ్రీనివాసరావ్ ఆశ్చర్యపోయాడు.

అంతవరకూ సుధీర్ హేమను నారీ విప్లవసమితి గురించి ఎగతాళి చేయడం కేవలం పరిహాసం కోసమే అనుకుంటూ వచ్చాడు. కానీ ఇప్పుడు హేమ మాటలు వింటూంటే ఆమెలో పురుషులను ఎదిరించి తమ హక్కులను సాధించుకోవాలనే ఆధునిక యువతి తత్వం తీవ్రంగానే ఉన్నట్లు తెలుస్తోంది. లేకపోతే ఆ దంపతుల విషయం అంత తీవ్రంగా ఎందుకు పరిశీలిస్తుంది?

శ్రీనివాసరావుకు నవ్వు వచ్చింది.

ఇలాంటి అమ్మాయిలను చాలామందిని చూశాడు తను. పెళ్ళి కాకముందు ఇలాగే ఎన్నో కబుర్లు చెప్తారు. మీటింగుల్లో మాట్లాడతారు. కేకలు వేస్తారు. ఉపన్యాసాలిస్తారు. ఆ తరువాత షరా మామూలే! పెళ్ళవగానే భర్తే సర్వస్వం అయి పోతాడు. మిగతా అందరిలాగానే అదే రొటీన్‌లో పడిపోయి "తీర్థయాత్రలకు బృందావనమేలనో" అంటూ పాటలు పాడేస్తారు.

తన పిన్నికూతురు శారద, ఆమె ఫ్రెండ్స్ కూడా ఇలాంటి కబుర్లు చెప్పినవాళ్ళే! ఇప్పుడు వాళ్ళందరకూ వివాహాలయేసరికి ఆ కబుర్లన్నీ కూడా మర్చిపోయారు. తనే ఎప్పుడయినా గుర్తు చేస్తే శారద సిగ్గుపడిపోతుంది.

"అన్నట్టు ఒకేవైపు ఆలోచించే వాళ్ళు మన్నయ్యా! నిజానికి భార్యాభర్తలు అన్న తరువాత అన్యోన్యంగా ఉండడం ముఖ్యం. హక్కులూ, సమానత్వం అంటే ఎలా కుదురుతుంది? ఇద్దరి విధులూ వేర్వేరు. ఇద్దరి బాధ్యతలూ వేరు. సమానత్వం అనేది వివాహమయేంతవరకే - లేదా ఒంటరిగా ఉన్నంతవరకే కావాలి. ఆ తరువాత

ఆ పదానికి అర్థం లేదు....'' అంటుంది.

హేమ మాత్రం శారద లాంటి ఆడపిల్ల కాదా? ఆమెను తన వేపు ఆకర్షించుకోవాలంటే ఆమె ఆలోచనల్ని అభిప్రాయాల్ని సమర్థించాలి. అంతే!

''మీరన్నమాట నిజమే హేమగారూ! మగాడికి మరీ స్వార్థం ఎక్కువయిపోతోంది.'' ఒప్పుకుంటున్నట్లు అన్నాడు శ్రీనివాసరావ్.

హేమ శ్రీనివాసరావ్ వేపు మెరుస్తున్న కళ్ళతో చూసింది. సుధీర్ రెండు చేతులతో తల పట్టుకున్నాడు.

''ఇంక హేమను భగవంతుడే రక్షించాలి! ఇంతకాలం ఈ విషయంలో మావయ్య ఒక్కడే ప్రోత్సహిస్తున్నాడనుకున్నాను. ఇప్పుడు నువ్వు కూడా తోడయ్యావన్నమాట!''

శ్రీనివాసరావ్ నవ్వేశాడు.

బేరర్ తెచ్చిన కాఫీలు అందుకున్నారు ముగ్గురూ.

''అవునవును. ఆడది ఆలోచించడం మొదలు పెడితే, ఏదో విపరీతం జరిగినట్లు కేకలేసేయాలి. లేపోతే మగవాడికి ప్రమాదం కదా!'' ఉక్రోషంగా అంది హేమ.

''ఇదిగో చూడమ్మాయ్. ఇందులో మగాళ్ళకొచ్చిన ప్రమాదమేమీ లేదు. ఏదో పాపం మామ కూతురుకదాని జాలి! అంతే! ఇదే ఇంకే ఆడపిల్లయినా అయితే గోవిందా కొట్టేసి ఊపుకునే వాడిని....'' నవ్వుతూ అన్నాడు సుధీర్.

''నీకూ నాకూ ఎప్పుడూ చుక్కెదురేగా! ఇంక నీతో వాదించడం కూడా దండగ! కానీ ఓ విషయం గుర్తుంచుకో బావా! ఎప్పటికయినా మీ మగాళ్ళ ఆటకట్టేది ఖాయం! ఇంకపద!'' లేచి నిలబడుతూ అందామె.

సుధీర్ నవ్వుతూ మాట్లాడుతున్నా హేమ మాత్రం సీరియస్‌గా మాట్లాడుతున్నట్లు తెలిసిపోతూనే ఉంది శ్రీనివాసరావుకి. సుధీర్‌కీ ఆమెకూ ఎప్పుడూ ఈ విషయంలో వాగ్వివాదాలు జరుగుతూనే ఉంటాయనీ, అంచేత వారిద్దరూ ఉత్తర దక్షిణ ధ్రువాలనీ కూడా అర్థమవుతోంది. మరి అతని అభిప్రాయాలతో ఏమాత్రం ఏకీభవించని హేమని సుధీర్ వివాహం చేసుకొంటాడా? ఊహూ! అలా జరగదనే అనిపిస్తోంది తనకి. ఒకవేళ వారిద్దరికీ వివాహం జరగనిపక్షంలో మరి హేమ తనను చేసుకోడానికి వప్పుకొంటుందా? ఏమో! వప్పుకోవచ్చు! వప్పుకోకపోవచ్చు! అది తన అదృష్టం మీద ఆధారపడి ఉంటుంది. తన ఆలోచనలకు నవ్వు వచ్చింది శ్రీనివాసరావుకి.

ఏమిటిది? అప్పుడే హేమతో వివాహం వరకూ వెళ్ళిపోయాడు తను. ఇవి పగటికలలు! పిచ్చి ఆలోచనలు!

హేమ లాంటి అందమయిన మామకూతుర్ని సుధీర్ చేసుకోకుండా ఉంటాడా? ఏదో సరదాగా వాదించుకొన్నంతమాత్రాన వారు విరోధులయిపోతారా? తనంత తెలివితక్కువ మనిషి ఇంకెవ్వడూ ఉండడు.

రెస్టారెంట్ నుంచి బయటికి వచ్చారు ముగ్గురూ.

''నేనింక వెళ్తానుమరి....'' రోడ్డు పక్కగా నిలబడిపోతూ అన్నాడు శ్రీనివాసరావ్.

''ఓ. కే! థాంక్యూ ఫర్ యువర్ కంపెనీ!'' నవ్వుతూ అన్నాడు సుధీర్.

''నేనే మీకు థాంక్స్ చెప్పాలి! చాలా సరదాగా గడిచింది సమయం'' తనూ నవ్వుతూ అన్నాడు శ్రీనివాసరావ్.

సుధీర్ ముందుకు నడిచాడు.

''వస్తానండీ!'' అంది హేమ శ్రీనివాసరావ్ వంకచూస్తూ.

"సీ యూ ఎగైన్...." మనసంతా విలవిల లాడుతూండగా అన్నాడు శ్రీనివాసరావ్.

ఆమె మందహాసం చేసి వెళ్ళిపోయింది.

కొద్ది క్షణాలు అక్కడే నిలబడిపోయాడు శ్రీనివాసరావ్. హేమ వెళ్ళిపోతూంటే తన సర్వస్వం పోగొట్టుకొన్నట్లు అనిపించసాగిందతనికి.

తలచుకొంటే ఆశ్చర్యంగా ఉంది.

రెండు గంటలక్రితం వరకూ అసలు హేమ అంటే ఎవరో తనకు తెలీదు ఆ అమ్మాయిని అంతకు ముందెప్పుడూ చూడనూ లేదు. కాని ఇప్పుడు హేమ లేకపోతే తన జీవితమే వృథా అనిపించేంత గాఢమయిన అనురాగం అల్లుకు పోయింది! ఇలాంటి సంఘటనలు కేవలం కథల్లో చదివాడు తను. అప్పుడు అవి ఎంతో అసహజం అనిపించాయి. కానీ ఇప్పుడు ఆ సంఘటనలు కేవలం కల్పితాలు కావనీ, వాటి వెనుక అనుభవాలు ఉన్నాయనీ తెలుస్తోంది. అందుకే "రవి గాంచనిచో కవి గాంచున్" అన్నారు.

ఇంతకూ ఇప్పుడెక్కడికి వెళ్ళడం ?

ఎటూ తోచటం లేదతనికి. నిజానికి ఆవేళ ఆఫీసుకి శెలవు రోజు కావడంవల్ల మలక్‌పేటలో ఉంటున్న పిన్నిగారింటికి వెళ్ళి సాయింత్రం వరకూ అక్కడే కాలక్షేపం చేయాలనుకొన్నాడు. కానీ ఇప్పుడు ఎక్కడికీ వెళ్ళాలనిపించడంలేదు. కొద్ది సేపు ఎక్కడయినా ఏకాంతంగా కూర్చుని ప్రశాంతంగా గడపాలని ఉంది. నెమ్మదిగా పార్కువైపు నడవసాగాడతను.

నిర్మానుష్యంగా ఉన్న పార్కులో నీడగా ఉన్నచోట గడ్డిమీద పడుకుండిపోయాడు. చేతిలోని పాకెట్ కొద్దిగా చింపి అందులోని షర్ట్ పీస్ బయటకు లాగాడు. అది చూస్తూంటే అతనికి ఆనందం పొంగి పొరలింది. హేమ సెలక్ట్ చేసిన షర్ట్ ఇది. ఈ షర్ట్‌కి ఓ అనుభూతి ముడిపడి వుంది. దాన్ని ముద్దు పెట్టుకొని మళ్ళీ పాకెట్‌లోకి తోసివేశాడు.

ఆలోచిస్తున్నకొద్దీ అతని హృదయం బాధతో నిండిపోతోంది. హేమ మీద ఆశలు పెట్టుకోవడం ఎండమావులను నమ్ముకోవడం వంటిది. ఆ నిజం తనకు తెలుసు. ఒకవేళ సుధీర్‌ను చేసుకోక పోయినా తనను చేసుకొంటుందన్న ఆలోచన హాస్యాస్పదమైంది. తను గొప్ప అందగాడు కాదు. ఆస్తిపరుడూ కాదు. ఒక హోదా, అంతస్తూ ఇవేమీ కూడా లేవు. మరి హేమలాంటి అందాలరాశి ఇంకేం చూసి తనను వరిస్తుంది? అలాంటి అందగత్తె ఏ ఆఫీసరు భార్యో అవుతుంది! స్కూటర్ల మీదో, కారుల్లోనో షికార్లు చేస్తుంది. మరీ బంగళాల్లో కాకపోయినా, అందమయిన ఇంట్లో ఉంటుంది. ఇదీ హేమ భవిష్యత్తు.

చాలాసేపటికి బరువెక్కిన మనసుతో తన గదికి చేరుకొన్నాడు శ్రీనివాసరావ్.

*

సుధీర్, హేమ ఇల్లు చేరుకొనేవరకూ ఏమీ మాట్లాడలేదు. ఎవరి ఆలోచనల్లో వారు మునిగి పోయారు.

సుధీర్‌కి ఇది కొత్తేం కాదు. అంతకుముందు చాలాసార్లు ఆమెతో 'స్త్రీలకు సమాన హక్కులు' అన్న విషయం మీద వాగ్వివాదం జరిపాడు. ఆమె ఆలోచనలు మరీ సంకుచిత ధోరణిలో పడినట్లు అతనికి అర్థమయిపోయింది. అంతవరకూ ఆమె మీద అల్లుకొన్న అనురాగాన్ని గురించీ, తమ మధ్య ఏర్పడబోయే బంధాన్ని గురించీ పునః పరిశీలన చేసుకోవాల్సిన అవసరం ఏర్పడింది. హేమా, తనూ తామిద్దరి పెద్దల కోరిక మీదా వివాహం చేసుకొంటే ఆ వివాహం ఎంతకాలం సజావుగా వుంటుందో తను తేలిగ్గా ఊహించగలడు. అందుకే ఎన్నో రోజులు ఆలోచించి తను హేమను వివాహం చేసుకోకూడదని నిర్ణయించుకొన్నాడు. కానీ తన నిర్ణయం ఆమెకుగానీ, మావయ్యకుగానీ ఎలా తెలియజేయాలో తోచటం లేదు. హేమకు తన నిర్ణయం ఆనందాన్నే కలిగిస్తుందని తన నమ్మకం. కానీ మావయ్య మాత్రం క్రుంగిపోతాడు. తమ రెండు కుటుంబాల మధ్య కలతలు ప్రారంభమవుతాయ్. అదే తనకు బెరుకు కలిగిస్తున్న విషయం. మొదటి నుంచీ తను హేమను వివాహం చేసుకొనే విషయంలో విముఖత్వం చూపితే ఈ రోజు ఈ పరిస్థితి వచ్చేదికాదు. కానీ మరి ఆనాటి హేమ వేరు! ఈ రోజు హేమ వేరు.

ఆ హేమలో అమాయకత్వం ఉండేది. తను కోరుకొనే లాలిత్యం, సౌకుమార్యం, తనంటే అభిమానం–అన్నీ ఉండేవి.

కానీ ఈ హేమ–వీటన్నిటికీ భిన్నం!

స్త్రీ పురుషుడికి అణగిమణగి పడిఉండాలన్న భావన తనకూ లేదు. కానీ సంఘంలో ప్రస్తుతం స్త్రీకున్న స్థానంలో ఎలాంటి లోపమూ కనిపించ లేదు. ఎక్కడో కొంతమంది మగాళ్ళు స్త్రీకివ్వాల్సిన గౌరవం ఇవ్వకపోతే అది స్త్రీజాతి అంతటికీ సంబంధించిన విషయంగా తీసుకోవడం తప్పని తన అభిప్రాయం.

ఏదేమయినా తనను అర్థం చేసుకొని అన్ని విధాలా కలసిమెలసి ఉండే భార్య తనకు కావాలి. ఎలాంటి సమస్యలూ, చికాకులూ ఉత్పన్నం కాని వైవాహిక జీవితాన్నే తను కోరుకొంటున్నాడు. మరి హేమతో అలాంటి జీవితం తనకు లభించదు!

హేమ మనసులో ఈ ఆలోచనలేమీ లేవు. ఆమె తను అంతకు ముందు రోజు హాజరయిన ఇంటర్‌వ్యూ గురించే ఆలోచిస్తోంది. తను సెలక్టవుతుందా లేదా అనేదే ఆమెకు తెలీటం లేదు.

అసలు తనకు ఉద్యోగం చేయాల్సిన అవసరమేమీ లేదు. కాని ఉద్యోగం చేయాలన్న కోరిక మాత్రం చాలాకాలం నుంచీ ఉంది. ప్రతి స్త్రీ ఉద్యోగం చేయాలి. ఆర్థికంగా పురుషుడి మీద ఆధారపడకుండా ఉండాలి. వివాహం చేసుకోక పోయినా జీవితం సాఫీగా గడచిపోతుందన్న నమ్మకం ఏర్పడాలి. అప్పుడు గాని మగాడి మన స్తత్వం మారదు. 'ఆడది వంటింటి కుందేలు, పిల్లల్ని కనే యంత్రం' అన్న ఆలోచన అప్పుడే రూపు మాసిపోతుంది.

"ఏం కొన్నావే కోడలా ?" దేవకి నవ్వుతూ హేమకు ఎదురొచ్చి అడిగింది.

"రెండు చీరలు కొన్నానత్తా ? అంతే! వాటికే డబ్బంతా అయిపోయింది. అందుకనే ఇంటికి చక్కా తిరిగి వచ్చేశాము...." తన చేతిలోని పాకెట్ ఆమెకందిస్తూ అంది హేమ.

"డబ్బు అయిపోతే వాడినడిగి తీసుకోవాల్సింది..." చీరలు పాకెట్‌లో నుంచి బయటకు లాగి పరీక్షగా చూస్తూ అందామె.

"అమ్మో! బావ నాకు డబ్బిస్తాడా ? నేనెక్కడ అడుగుతానోనని పదపద అంటూ త్వరత్వరగా ఇంటికి లాక్కొచ్చేశాడుగా!" చిలిపిగా అంది హేమ సుధీర్ వంక చూస్తూ.

"సరే! నిజమే! నేను షైలాక్‌ని. పిల్లికి బిచ్చం పెట్టని వాడిని! సరేనా ?" తనూ నవ్వుతూ అన్నాడు సుధీర్.

"ఇప్పుడు దాచినా, రేపయినా ఆ డబ్బు దానిదే అవుతుందిగా? అప్పుడేం చేస్తావ్ ?" హేమను సమర్థిస్తూ అంది దేవకి.

ఈ మాటతో హేమ సిగ్గుపడింది కాని అలా సిగ్గుపడినట్లు సుధీర్‌కి తెలీడం ఆమెకిష్టం లేకపోయింది. అందుకే వెంటనే సంభాషణ మార్చివేసింది.

"మరి రేపు ఉదయం బస్‌కి రిజర్వేషన్ చేయించుకోవాలి కదు బావా నేను?"

"సాయంత్రం బస్‌స్టాండ్ కెళ్ళి ఆ పని చూద్దాం:" అన్నాడు సుధీర్. తన తల్లి మాటలు అతనికి ఇబ్బంది కలిగించినయ్. అందుకని వెంటనే అక్కడి నుంచి తన గదివేపు నడిచాడు.

"ఇప్పుడే తొందరేముంది? మరో రెండు రోజులుండి వెళ్ళకూడదటే హేమా?" అడిగింది దేవకి.

"ఊహూం! కుదరదు అత్తా! బోలెడు ఉద్యోగాలకి అప్లయ్ చేశాను. ఎప్పుడే ఉద్యోగం తాలూకు ఇంటర్‌వ్యూ వస్తుందో తెలీదు. అయినా మొన్న ఇక్కడ అయిన ఇంటర్‌వ్యూలో సెలక్టయితే ఇక హైద్రాబాద్‌లో ఉండాలి కదా! అప్పటికి రెండు రోజులేమిటి? జీవితం ఇక్కడే గడిచిపోతుంది..." నవ్వుతూ అంది హేమ.

దేవకి ఏవేవో కుటుంబ విషయాలు మాట్లాడుతోంటే 'ఊఁ' కొడుతోంది హేమ. కాని ఆమె మనసంతా ఏవేవో ఆలోచనలతో నిండిపోయింది. అదివరకటికీ ఇప్పటికీ సుధీర్ ప్రవర్తనలో ఏదో మార్పు కనబడుతోంది. మూడేళ్ళ క్రితం తను ఇక్కడికొచ్చినప్పుడు అతను తన మీద గ్రుమ్మరించిన ఆప్యాయాభిమానాలు ఇప్పుడు కనిపించడం లేదు. అసలు తనని ఒక్క క్షణం కూడా వదిలి ఉండేవాడు కాదు. ఎప్పుడూ ఏదో ఒకటి చెప్తూ నవ్వుతూ నవ్విస్తూ ఉండేవాడు. కొంత రొమాంటిక్‌గా కూడా ఉండేవతని చేష్టలు. మరిప్పుడు....చాలా మామూలుగా - తామిద్దరూ బంధువులేనాని, అంతకంటె ఎక్కువ సంబంధాలేమీ లేవన్నట్లు మసులుతున్నాడు. ఆ మధ్య ఓసారి తామిద్దరూ ఓ బంధువు అమ్మాయి పెళ్లిలో కలుసుకొన్నప్పుడు 'స్త్రీలు, పురుషులవల్ల అనుభవిస్తున్న బాధలు' గురించి వాదించుకొన్నారు. ఒకరి అభిప్రాయాలను ఒకరు నిరసించుకున్నారు. ఆ పెళ్లికొచ్చిన అమ్మాయిలందరూ తన పక్షం వహించేసరికి అతను తగ్గక తప్పలేదు. తామిద్దరికీ అనేక విషయాల్లో అభిప్రాయ భేదాలుండవచ్చు. అంత మాత్రాన అవి తమ మధ్య ఉన్న ప్రేమాభిమానాలకు అంతరాయం ఎందుకవాలి?

ఇంటికి వెళ్ళాక తను ఇవే విషయాలు వివరిస్తూ సుధీర్‌కి పెద్ద ఉత్తరం రాయాలనుకుంటోంది. అయినా ఈ మగాళ్ళకు మరీ ఇంత చిన్నపిల్లల మనస్తత్వమేమిటి?

తనకు మగ స్నేహితులు కూడా ఉన్నారు. ఇంకా తన స్నేహితురాండ్ర అన్నయ్యలూ, తమ్ముళ్ళూ చాలామంది తెలుసు. సాధారణంగా అందరిదీ ఒకటే మాట. అందరూ స్త్రీలు కోరుతున్న సమాన హక్కులను నిరసించేవారే! తన ఎదురుగా కాకపోయినా, వెనుకయినా తనని అవహేళన చేసేవారే!

హఠాత్తుగా శ్రీనివాసరావ్ గుర్తుకొచ్చాడు హేమకు.

అవును. అతనికి స్త్రీ అంటే గౌరవం వున్నట్లే వుంది. అవగాహన వుంది. సంఘంలో ఆమెకు జరుగుతోన్న అన్యాయాన్ని అతనూ నిరసిస్తున్నాడు. మగాళ్ళలో శ్రీనివాసరావులాంటి వ్యక్తులు ఉన్నారు. ఆడదాని పరిస్థితి అతివేగంగా మార్పు చెందుతుంది! మగాడితో సమానంగా మసలగలుగుతుంది.

అతనితో మరి కాసేపు మాట్లాడాలనీ, తన అభిప్రాయాలను ఆలోచనలనూ అతనితో పంచుకోవాలనీ, అతనిని మరింత దగ్గరగా పరిశీలించాలనీ అనుకొంది తను. కానీ అవకాశం లభించలేదు సుధీర్ ఏమనుకొంటాడోనని వెనుకాడింది. కనీసం అతని అడ్రస్ తెలిసినా కలం స్నేహం చేసేది.

సాయంత్రం సుధీర్‌తోపాటు బస్‌స్టాండ్‌కి వెళ్ళింది హేమ. మర్నాటికి రిజర్వేషన్ తేలిగ్గానే దొరికింది. ఇద్దరూ ముక్తసరిగానే మాట్లాడుతూ ఇల్లు చేరుకొన్నారు. ఆ రాత్రంతా సుధీర్‌కి నిద్ర లేదు సరిగ్గా.



సాలార్‌జంగ్ మ్యూజియంలోని 'వీల్డ్ రెబెకా' శిల్పం అని భ్రమపడుతున్నారా? అయితే పొరబడుతున్నారన్నమాట. మరైతే ఇంతకీ ఈమె ఎవరు?

ఇలా ప్రతిమలా తయారైన అతివ-కుమారి ఎమ్. వేదకుమారి - హైద్రాబాదు స్టేట్ బ్యాంక్ ఆఫ్ ఇండియా మెయిన్ బ్రాంచ్‌లో ఉద్యోగిని. ఇటీవల ఆమె ఉద్యోగం చేస్తున్న బ్యాంకులోని లోకల్ ఇంప్లిమెంటేషన్ కమిటీవారు సాంస్కృతిక కార్యక్రమాలను ఏర్పాటు చేశారు. ఆ కార్యక్రమాలలో 'విచిత్ర వేషధారణ' పోటీలో కుమారి వేదకుమారి కూడా పాల్గొనాలని అనుకున్నారు. అయితే ఎటువంటి వేషధారణ అయితే బాగుంటుంది అన్న మీమాంసలో వున్నాక ఆమెకి సాలార్‌జంగ్‌లోని 'వీల్డ్ రెబెకా' శిల్పం జ్ఞాపకం వచ్చింది. ఆ పాలరాతి శిల్పపు వేషధారణకి కొంత భారతీయత మిళితం చేసి అందరి దృష్టిని ఆకర్షించేలా ఆమె ఈ పోటీలో పాల్గొన్నారు. ఇలా తయారవడానికి ఆమె తెల్ల చాక్‌పీస్ పొడి మాత్రమే మేకప్ సామగ్రిగా ఉపయోగించారు. మేకప్ అంతా కూడా ఆమె స్వయంగా చేశారు.

కుమారి వేదకుమారికి చిత్రలేఖనంలోనూ, రచనలు చెయ్యడంలోనూ అల్లికలలోనూ ప్రవేశముంది. ఆమె వర్ణచిత్రాల ప్రదర్శన గత సంవత్సరం జూలై నెలలో హైద్రాబాద్ స్టేట్ బ్యాంకు లైబ్రరీహాలులో జరిగింది. ఓమర్ ఖయ్యాం జీవితం పైన చిత్రించిన చిత్రాలు, ప్రకృతి సౌందర్యాన్ని చూపే చిత్రాలను ఆమె ప్రదర్శించారు. ఈ మధ్య హైద్రాబాద్‌లో జరిగిన రామాయణ మేలా పెయింటింగ్ ఎక్సిబిషన్‌లో పాల్గొని ఆమె బహుమతి పొందారు.

# ఇప్పుడు మీరు కన్య మీకు కావలసిన రక్షణ ఒక్క కేర్‌ఫ్రీ* మాత్రమే ఇవ్వగలదు

OBM/1765 TEL

**కేర్‌ఫ్రీ** మిమ్మల్ని దృష్టిలో పెట్టుకొని తయారు చేయబడింది. ఆ 5 రోజుల శానిటరీ రక్షణకోసం ఇది ఆధునిక యువతికి చేదోడు.

**కేర్‌ఫ్రీ** ఒక ప్రత్యేకంగా చెమ్మనుపీల్చు నేప్‌కిన్, ఇది అధికమైన చెమ్మను పీల్చి మీకు ఇబ్బందిలేకుండా చేస్తుంది వాస్తవంగా, **కేర్‌ఫ్రీ** ఎంతపీల్చగలదంటే ఒకే ఒక నేప్‌కిన్ మీ పూర్తి సమయంలోని ప్రసరణలో సగం దాకా నిలుపుకోగలదు. కాని తాజా భావనకోసం మీరుఎంత తరుచుగా కావాలంటే అంత తరచుగా మార్చుకోండి.

ఒక్క **కేర్‌ఫ్రీ** మాత్రమే దిగువ భాగము ప్రక్కలా చుట్టూ ఒక ప్లాస్టిక్ షీల్డ్ కలిగియున్నది. ఇది మరకలు పట్ల త్రివిధ అడ్డంకిగా పనిచేస్తుంది.

**కేర్‌ఫ్రీతో** మీరు హాయియైన భావన పొందగలరు, నెలలో ఇది ఏరోజో మీరు మరిచిపోతారు—చెమ్మ తగలటం ఉతికి ఆరవేసే ఇబ్బందిలేదు.

**కేర్‌ఫ్రీ** వాడకానికి తయారుగా వుంటుంది. మార్చుట చాలాసులభం. పారవేయుట చాలా తేలిక. అతి ఆరోగ్యకరమైనదిగూడా.

**కేర్‌ఫ్రీ** ధరించండి.

ఎల్లప్పుడూ విశ్వాసంతో ఉండండి.




10 మరియు 20 నేప్‌కిన్ల ప్యాక్‌లలో లభిసుంది.

Johnson & Johnson

తన మనసులోని విషయాలు హేమకి తెలియ చేయాలా వద్దా అనే మీమాంసలో పడిపోయాడు. ఆమెకు తెలియజేస్తే, మామయ్యకు తెలిసి పోతుంది. దాంతో యుద్ధం మొదలయిపోతుంది. అయినా సరే! తను ఆఖరి క్షణం వరకూ దాచడం కూడా మంచిది కాదు. అలా చేస్తే తప్పు తనదవుతుంది. తెల్లారు జామున తల్లి నిద్రలేపుతుండగా మెలకువ వచ్చిందతనికి.

"లే త్వరగా! హేమ రెడీ అయిపోయిందప్పుడే." అంది దేవకి. సుధీర్ లేచికూర్చున్నాడు. వెంటనే బాత్‌రూమ్‌లోకి నడిచాడతను. తనూ బట్టలు మార్చుకొని రెడీ అయే సరికి టైము ఆరుదాటింది. ఆటోలో త్వరగానే బస్‌స్టాండ్ చేరుకున్నారిద్దరూ. ఏడు గంటలకు బయల్దేరాల్సిన బస్సు ఏడు దాటినా బయటకు రాలేదు. సుధీర్, హేమ పక్కపక్కనే కూర్చున్నారు బస్ కోసం ఎదురుచూస్తూ. ఆ విషయం ఎలా కదపాలో తెలీటం లేదతనికి. తనేదో తప్పుచేయబోతున్నట్లు అనిపిస్తోంది.

"మా ఊరెప్పుడొస్తావ్ బావా?" అడిగింది హేమ.

"బహుశా ఇప్పట్లోరాననుకుంటాను...."

"ఎందుకనో? కోపంవచ్చిందా మా ఊరంటే?" నవ్వుతూ అందామె.

"ఊరేంచేసిందని కోపం రావడానికి?" తనూ నవ్వుతూ అన్నాడు.

"అయితే నామీదేనన్నమాట కోపం!"

"దావుంది! అయినా మనిద్దరికీ ఒకరంటే ఒకరికి పడకపోవచ్చుగానీ అంతమాత్రాన కోపాలెందుకుంటాయ్?" తను చెప్పదల్చుకొన్న విషయానికి నాందిగా అన్నాడతను.

"ఏమో! నువ్వీమధ్య మరీ చిన్నపిల్లాడిలా ఉడికిస్తున్నావురే!"

"అదేం లేదు! అయినా హేమా! మనిద్దరి అభిప్రాయాలూ వేరు! మనిద్దరి ఆలోచనలూ వేరు! నిజం చెప్పాలంటే నీది ఉత్తర ధ్రువం, నాది దక్షిణ ధ్రువం. అవునా? అలాంటప్పుడు మన మధ్య ప్రేమ, అభిమానం వగైరాలు ఎలా ఉంటాయ్ చెప్పు! అంచేత ఎంత తక్కువగా కలిసి ఉంటే అంత మంచిది! తరచుగా కలుసుకొని దెబ్బలాడుకోవడం కంటె ఎప్పుడో ఓసారి కలుసుకొని ఆప్యాయంగా పలుకరించుకోవడం మంచిది కాదూ?"

# పాలెపు జగన్మోహిని



వనితా లోకానికి, మహిళాభ్యుదయానికి సేవ చేసే వివిధ సంస్థలను స్థాపిస్తూ, వెనుకబడిన తరగతుల వారి అభివృద్ధికై పాటుబడుతున్న వనిత కుమారి పాలెపు జగన్మోహిని. వృత్తిరీత్యా విశాఖపట్నంలోని ప్రముఖ మహిళా న్యాయవాదులలో ఆమె ఒకరు.

అంతర్జాతీయ మహిళా సంవత్సరమైన 1975లో ఆమె నగరంలోని వనితలను ప్రోత్సాహపరచి కస్తూరిబా మహిళా మినీ సూపర్‌బజార్‌ను స్థాపించారు. అప్పటినుండి ఆ సంస్థకు ప్రమోటర్‌గానూ, మేనేజింగ్ డైరెక్టర్‌గానూ వుంటున్నారు.

విద్యారంగంలో వెనుకబడిన తరగతుల బాలబాలికల ప్రయోజనార్థం ఆమె రామ్‌నగర్ ప్రాంతంలో ఒక ప్రాథమికోన్నత పాఠశాల (విశాఖ సేవాసదన్)ను స్థాపించారు. ఆ పాఠశాల ఇప్పుడు ఉన్నత పాఠశాలగా రూపొందింది. అక్కడి పిల్లలకు మధ్యాహ్నపు భోజన సదుపాయాలను కూడా ఏర్పాటు చేశారు. అంతేగాక రామ్‌నగర్‌లో పేదపిల్లల నిమిత్తం రెండు బాల్వాడీ కేంద్రాలను కూడా (భారత శిశుసంక్షేమ సమాఖ్య, ఆంధ్రప్రదేశ్ సాంఘిక సంక్షేమ బోర్డు సహకారంతో) నిర్వహిస్తున్నారు. రామ్‌నగర్‌లోని పోషకాహార కేంద్రానికి ఆమె కార్య నిర్వహణాధికారి!

విశాఖ ద్వారకా నగర్‌లోని బా - బాపు సేవా సంఘం ఆమె చేస్తున్న సేవలకి చిరస్థాయిగా నిలిచే చిహ్నం. బా - బాపు భవన నిర్మాణానికి కుమారి జగన్మోహిని విశేషంగా కృషి చేశారు. ఈ సేవా సంఘానికి కార్యదర్శిగా ఆమె సమాజ కార్యకలాపాలను విస్తృతం చేయడానికి విశేషంగా కృషి చేస్తున్నారు. బా-బాపు భవన్ నిర్వహణలోని విశేషమేమంటే- అక్కడ కుమారి జగన్మోహిని పేద ప్రజల సహాయార్థం 'ఉచితన్యాయ సహాయ కేంద్రం' స్థాపించి తావే స్వయంగా నడుపుతున్నారు. ఒక ఉచిత వైద్య సహాయ కేంద్రం, వయోజన విద్యా కేంద్రం కూడా ప్రారంభించారు. అంతర్జాతీయ బాలల సంవత్సరంలో 'పిల్లల గ్రంథాలయం' నెలకొల్పారు.

అఖిల భారత మహిళా సమాఖ్యకు విశాఖపట్నం స్థాయీ సంఘం, అంతర్జాతీయ రెడ్‌క్రాస్ సంస్థ, ప్రేమ సమాజం, గాంధీ - శాంతి సమాఖ్య. జంతు సంక్షేమ సంఘం - వీటన్నిటిలోనూ ఆమె సభ్యురాలుగా వుంటున్నారు. భారత-రష్యా సాంస్కృతిక సంఘానికి ఉపాధ్యక్షురాలుగానూ, విశాఖ రంగస్థల వృత్తి కళాకారుల సంఘానికి ఉపాధ్యక్షురాలుగానూ, విశాఖ శారదా సంఘానికి కార్యదర్శిగానూ వుంటున్నారు. ఎలమంచిలి తాలూకాలోని దిమిలి గ్రామంలో పేదవర్గానికి చెందిన స్త్రీలకు ఉపాధి కల్పించే నిమిత్తం ప్రారంభించబడిన 'భాగవతుల ఛారిటీస్ ట్రస్ట్'కు ఆమె కార్యనిర్వాహక సభ్యురాలు (ట్రస్టీ) కూడా. విశాఖపట్నంలోని అరుంధతి (హరిజన) మహిళామండలి నిర్వహణకు కూడా తమ సహాయ సహకారాలను అందజేస్తున్న కుమారి పాలెపు జగన్మోహిని అనేక జాతీయ సభలలోనూ, సెమినార్లలోనూ పాల్గొన్నారు. —విలేకరి

తన మాటలను ఆమె అర్థం చేసుకుంటోందో లేదోనని ఆమె వేపు పరీక్షగా చూస్తూ అన్నాడు సుధీర్.

హేమ కొంచెం కలవరపడింది.

"అవును బావా! అదీనిజమే!" అంది ఆలోచిస్తూ.

"హేమా! నిన్నో విషయం అడుగుతాను! కాని నువ్వేమీ బాధపడనని మాట ఇస్తేనే!" అన్నాడతను ధైర్యం తెచ్చుకొని.

"తప్పకుండా అడుగు బావా! అయినా నేనంత తేలిగ్గా బాధపడే మనిషిని కాదులే! నీకా భయమేమీ అవసరం లేదు...." వేగంగా కొట్టుకొంటున్న గుండెలతో అంది హేమ. అతనేమడుగబోతున్నాడో ఆమె ఊహించలేకపోతోంది.

"మనిద్దరికీ పెళ్లి చేయాలని మనవాళ్ళను కొంటున్నారు కదా! మరి మనం వివాహం చేసుకొంటే-ఎలాంటి గొడవలూ లేకుండా సంసారం చేయగలమంటావా? ప్రతి విషయంలోనూ కీచులాడుకొంటూ, ఒకరినొకరు మాటలతో గాయపరచుకొంటూ గడిపే ఆ జీవితంలో సుఖం ఎక్కడ ఉంటుంది? ఈ పరిస్థితుల్లో మనం పెళ్లి చేసుకోవటం ఎంతవరకూ సమంజసమో నువ్వే ఆలోచించు! అసలు నీ అభిప్రాయం ఏమిటో నాకు చెప్పు ఈ విషయంలో!"

హేమ తెల్లబోయింది. అతని మాటలు ఆమెకు ఆశ్చర్యాన్ని కలిగించాయి. మనసులో ఏవేవో ఆలోచనలను రేకెత్తించసాగాయి. తామిద్దరూ వివాహం గురించి మాట్లాడుకోవడం ఇది రెండో సారి. మొట్టమొదటిసారి తామిద్దరూ ఇదే బస్ స్టాండ్‌లో తను ఇలాగే తమ వూరు వెళ్తున్నప్పుడు అతను అ ప్రసక్తి తెచ్చాడు. అది రాత్రి పదిగంటల బస్. బస్‌లో తన సీటు దగ్గర బాగ్ ఉంచి తను కిందకు దిగి సుధీర్‌తో మాట్లాడుతోంది. తమ పక్కనే ఇద్దరు దంపతులు కూడా నిలబడి మాట్లాడుకొంటున్నారు. వారి మాటలను బట్టి అతను ఆమెను పుట్టింటికి పంపుతున్నట్లు తెలిసింది తమకు. బస్ నీడ పడడం వల్ల తాము నుంచున్న ప్రాంతం కొంచెం చీకటిగా ఉంది.

సుధీర్ ఏవేవో విషయాలు చెప్తూంటే తను 'ఊ' కొడుతోంది.

బస్ బయల్దేరే సమయమయింది. కండక్టర్ బస్‌లోకొచ్చి టికెట్లు తనిఖీ చేస్తున్నాడు.

హఠాత్తుగా తమ పక్కన నిలబడ్డ దంపతులు కౌగలించుకొని ముద్దు పెట్టుకొన్నారు.

తనూ, సుధీర్ ఆ దృశ్యం చూచి ఆశ్చర్య చకితులయిపోయారు. తను బాగా సిగ్గుపడిపోయింది. మరు క్షణంలో ఆమె బస్‌లోకి వెళ్ళిపోయింది.

"మరీ ఇంత బహిరంగంగానా?" నవ్వుతూ అంది తను.

"మనకి పెళ్ళయితే-మనమూ అంతేనేమో!" నవ్వుతూ అన్నాడు సుధీర్.. తను ఆ మాటలతో మరింత సిగ్గుపడిపోయింది.

ఆ తరువాత మరెప్పుడూ తామిద్దరి మధ్యా మళ్ళీ ఆ ప్రసక్తి రాలేదు. ఇప్పుడు తిరిగి అతను-ఇలా-ఆ ప్రసక్తి తీసుకురావడం-కొంచెం బాధగా ఉంది. అంతే! తను అదివరకటి హేమ అయితే అతని మాటలకు క్రుంగిపోయేదేమో! కన్నీళ్ళు పెట్టుకొనేదేమో! కానీ తన ఆలోచనలు ఇప్పుడు వివాహం గురించి కానీ, సెక్స్ గురించి కానీ పరిభ్రమించడం లేదు. అవన్నీ తనకు సెకండరీ! తనకో ధ్యేయం ఉంది! తన జీవితంలో సాధించాలనుకొన్నవి ఎన్నో ఉన్నాయ్. అందుకే నారీవిప్లవ సమితిలో సభ్యురాలయింది. అసలా దృష్టి ఏర్పడడానికి కూడా కారణముంది. అది హాబీకోసం ఏర్పరుచుకొన్నది కాదు. తనకో గుర్తింపు లభించాలనీ, పేరు ప్రఖ్యాతులు తెచ్చుకోవాలనీ కూడా కాదు. చిన్నప్పటి నుంచీ తన చుట్టూ జరుగుతూ వచ్చిన సంఘటనలే తనను అటువేపు మళ్ళించాయి. ఆడదాని జీవితం గురించి ఆలోచించేలా చేశాయి. స్త్రీ నిర్వహిస్తోన్న పాత్రను పునఃపరిశీలించేందుకు పురిగొల్పాయి.

తను ఎలిమెంటరీస్కూల్లో అయిదో తరగతి చదువుతున్నప్పుడు తమ స్కూలుకు వెళ్ళే త్రోవలో అరుణ వాళ్ళ ఇల్లు ఉండేది. తను రోజూ అరుణ వాళ్ళింటికి వెళ్ళి - అరుణను తీసుకొని స్కూలుకు వెళ్ళడం అలవాటు. అరుణ తల్లి తనను కూడా ఎంతో ప్రేమగా చూసేది. ఒకోసారి బలవంతంగా అరుణతో పాటు తనకూ అన్నం పెట్టేది. అరుణ కేమయినా చిరుతిండి కొనిపెడితే అందులో తనకూ తప్పక భాగముండేది. ఓ రోజు స్కూలు నుంచి వస్తూ వాళ్ళింటి దగ్గర కనిపించిన దృశ్యం చూసి భయకంపితురాలయిపోయింది తను. అరుణ వాళ్ళమ్మను వాళ్ళ నాన్న కర్రతో చావబాదుతున్నాడు. ఆమె బిగ్గరగా రోదిస్తూ అతని చేయి వదిలించుకుని పారిపోడానికి ప్రయత్నిస్తోంది. అది చూసి అరుణ కూడా బిగ్గరగా ఏడ్వేయసాగింది.

[సశేషం]



విస్సా నిర్మల

విశ్వవిద్యాలయానికంతటికీ ప్రథమురాలుగా రావడమన్నది ఘనమైన విషయం. అటువంటి ఘనత సాధించిన వనిత - కుమారి విస్సా నిర్మల. మద్రాసు విశ్వవిద్యాలయం ఎమ్. ఏ (ఇండియన్ ఫిలాసఫీ)లో ప్రథమ శ్రేణిలో ఉత్తీర్ణురాలై ఫస్ట్ రాంక్ తెచ్చుకున్న నిర్మల డాక్టర్ టి. ఎమ్. పి. మహదేవన్ షష్ఠ్యబ్ది పూర్తి అవార్డును పొందారు. అయితే విద్యారంగంలో ప్రథమశ్రేణి సాధించడమన్నది ఆమెకిది మొదటిసారి కాదు. స్కూల్ ఫైనల్‌లోనూ, ప్రియూనివర్శిటీలోనూ కూడా ప్రథమశ్రేణిలోనే ఉత్తీర్ణురాలయ్యారు. బి. ఎస్సీలో జవహర్‌లాల్ నెహ్రూ మెమోరియల్ ఫండ్ అవార్డు ఆమెకు లభించింది. పాఠశాలలోనూ కళాశాలలోనూ అనేకమార్లు వక్తృత్వపు పోటీలలో పాల్గొని ప్రథమ బహుమతులు అందుకున్నారు.

వీణ, పెయింటింగ్, కొత్త వంటలు ప్రయత్నించడం తన హాబీలని చెబుతూ క్రికెట్, టెన్నిస్ ఆటలంటే తనకు చాలా ఇష్టం అంటారు నిర్మల.

# 'ఆదర్శ' మహిళా

పని మనిషి నీలవేణి రెండు మూడిళ్ళలో పని చేసుకుని వచ్చేసరికి పొద్దుగుంకుతుంది. ఆమె భర్త ఎక్కడో కర్మాగారంలో పని చేస్తున్నాడు. వారి సమస్య తమ పసిపిల్లని ఎక్కడ వుంచడమా అని....

కమల ఒక ప్రైవేట్ సంస్థలో ఉద్యోగం చేస్తోంది. ఆమె భర్త బ్యాంకి ఉద్యోగి. వారి జీవితం ఏ చీకూ-చింతా లేకుండా హాయిగానే గడిచి పోతోంది. కమలను పురిటి నుంచి తీసుకు వచ్చిన ఆమె తల్లి మరో కూతురు కాన్పుకి వెళ్ళిపోయింది. ఆర్నెల్ల పసికందుని కమల ఎక్కడ వుంచుతుంది?



అంతస్తులు వేరైనా ఆ యింట పని చేసే నీలవేణిది....కమలది ఒకటే సమస్య.

అక్కడి పూరిగుడిసెలలో జీవిస్తున్న చిన్నారి పాపలు చదువు సంధ్యా లేక అల్లరి చిల్లరగా తిరుగుతున్నారు. కాన్వెంటు చదువులు ఆ తల్లి దండ్రులు భరించగలరా....మరి ఆ సమస్యకు పరిష్కారం?

సీతకు తన రోగం ఏమిటో అర్థం కాదు. ధర్మాసుపత్రిలోని రంగునీళ్ళకి లొంగడం లేదా రోగం. వైద్యుడి దగ్గరకి వెళ్దామంటే అంతంత ఫీజు చెల్లించుకునే తాహతు ఏది? మరి ఆమెకి వైద్యసహాయం లభించేదెలా....

వీరందరూ కూడా మద్రాసులోని తాంబరం ప్రాంతంలో నివసించేవారే. వీరి సమస్యలన్నిటికీ పరిష్కారమార్గాన్ని చూపింది - అక్కడి మహిళా సమాజం!

సాధారణంగా మహిళా సమాజం అనగానే కుట్లు, అల్లికలపోటీలు, సాంస్కృతిక కార్యకలాపాలు నిర్వహించే సంస్థ అనే అపోహ వుంటుంది. ఈ అపోహకు కారణమూ వుంది. మన మహిళా సమాజాల కార్యక్రమాలు చాలావరకు ఈ పరిధిని దాటడం లేదు. ఒక వేళ అడపాతడపా పేద పిల్లలకు ఉచిత వైద్యచికిత్స చేయించడం వంటి కార్యక్రమాలు చేపట్టినా అవి తాత్కాలికంగా వుంటున్నాయే తప్ప శాశ్వతమైన రూపాన్ని సంతరించుకోవడం లేదు.

'మహిళా సమాజాలు చెయ్యవలసింది ఇంతేనా?' అని ప్రశ్నించుకున్నారు తాంబరంలోని ఈ మహిళా సమాజ కార్యకర్తలు. 'ఇది కాదు. ఇంకా ఎంతో వుంది. అందరం కలిసికట్టుగా పని చేస్తే ఇంకా ఎన్నో బృహత్కార్యాలు చేపట్టి మహత్కార్యాలుగా మలచవచ్చు' అనుకున్నారు. ఆ ప్రాంతంలోని వారినందరినీ కూడగట్టుకుని తమ కార్యక్రమాలను ప్రారంభించారు.

ఏ పనినైనా ప్రారంభిస్తే అందులో ఆ ప్రాంతంలోని వారందరి తోడ్పాటు వుండాలి. అందరూ ఆ కార్యంలో నిమగ్నులై కృషి చెయ్యాలి. సామూహిక చైతన్యం కలిగి 'ఇది నాది' అన్న భావం ఏర్పడితేనే ఏదైనా సాధించడానికి వీలవు వుంది. అందుకే సేవా సమాజాలు, సంఘాలు ప్రారంభించినప్పుడు సామూహిక కృషి వుండాలి అని అంటారు.

'సామూహిక కృషి' అనే సూత్రం మీద ఆధారపడి నడుస్తున్నదే — తాంబరంలోని ఈ మహిళా సమాజం కూడా. ప్రస్తుతం ఈ సమాజం కార్యకలాపాలలో ఉత్సాహంగా పాల్గొంటున్న సభ్యురాండ్రు 50 మందిదాకా వున్నారు. వీరందరూ కూడా తాంబరం ప్రాంతం లోనివారే.





(REGD)
TAMBARAM.

# సమాజం



ఈ సమాజానికి ప్రస్తుత అధ్యక్షురాలు – రేవతీ నరసింహన్, కార్యదర్శి సుందరీ రామచంద్రన్, సహకార్యదర్శి అన్నపూర్ణి పద్మనాభన్, కోశాధికారిణి జయశ్రీశర్మ, కార్య నిర్వాహక సభ్యులలో ఒకరైన కమలా బాలసుబ్రహ్మణ్యం తమ కుటుంబ సభ్యులందరితోనూ ఈ సమాజం బాధ్యతల్లో పాలుపంచుకోవడం ఒక విశేషం.

విజయుడైన ప్రతి పురుషుడి వెనుకా ఒక స్త్రీ వుంటుందన్న ఆంగ్ల సామెత ఇక్కడ తారు మారైందని చెప్పక తప్పదు. ఈ సమాజం ఇంతటి విశిష్టమైన కార్యక్రమాలు చేపట్టడానికి, ముఖ్యంగా ఆరోగ్య సంరక్షణా కేంద్రం ప్రారంభించడానికి కారకులు – డాక్టర్ గంగాధర్ శర్మ. కూలినాలి చేసుకునే పేద ప్రజల పిల్లల సంరక్షణాభారం ఈ సమాజం స్వీకరించడానికి కారణం ఆయనే. ఈ కార్యక్రమాలన్నిటికీ తమ సలహా సంప్రతింపులతో సాయపడుతూ సమాజం అభివృద్ధి కోసం కృషి చేస్తున్నారు డాక్టర్ గంగాధర్ శర్మ, ఆయన సతీమణి జయశ్రీశర్మ.

అసలు ఈ సమాజాన్ని 1955లో 'మాదర్ సంఘం' పేరిట పుష్పా దొరైస్వామి ప్రారంభించారు. అయితే అప్పట్లో ఇది తీరికవేళల్లో కుట్లు, అల్లికలు, సంగీతం మొదలైనవి నేర్చుకోవడానికి మాత్రమే నిర్దేశించబడింది. అది ఆ చుట్టుపక్కల వారికి కాలక్షేపానికి బాగా ఉపయోగపడేది. ఆ తర్వాత రెండు సంవత్సరాలకి ప్రభుత్వం ఆ స్థలాన్ని వీరికి కేటాయించడంతో చిన్న భవనం ఏర్పడింది.

నేటికీ ఇక్కడ చేతిపనులు, సంగీతం, కుట్లు అల్లికలలో శిక్షణ ఇస్తూనే వున్నారు. చేతి పనులను కార్యదర్శి శ్రీమతి సుందరి నేర్పుతున్నారు. ఈ శిక్షణకు నెలకి ఐదు రూపాయలు రుసుము వసూలు చేస్తారు. పేదవారికి ఉచితం.

అయితే మహిళా సమాజం అంటే ఈ కార్యక్రమాలతో మాత్రమే సరిపెట్టనవసరం లేదనీ దీనిని మరింత ప్రయోజనకరంగా తీర్చిదిద్దవచ్చునని అభిప్రాయపడ్డారు ప్రస్తుత కార్యకర్తలు. ఆవిధంగా 1973లో పిల్లలకి ఓరల్‌పోలియో, ట్రిపిల్‌ఏంటిజెన్ ఇంజక్షన్లు ఇవ్వడంతో ఒక ఆరోగ్య కేంద్రాన్ని ప్రారంభించారు.

వీరు నడుపుతున్న నర్సరీ పాఠశాలలో 90 మందిదాకా పిల్లలు చదువుకుంటున్నారు. వీరిలో చాలామటుకు పూరి గుడిసెలలోని వారే. శిశు సంక్షేమ శిబిరం (క్రెష్)లో 32 మందిదాకా పసి పాపలు సంరక్షణ పొందుతున్నారు. ఇందుకు ఉయ్యాల తొట్లు, ఆట వస్తువులు వున్నాయి.



పాఠశాలలో శిక్షణ యివ్వడానికి బాల్వాడీ శిక్షణ పొందిన ముగ్గురు ఉపాధ్యాయినులు, పిల్లల్ని చూసుకునేందుకు ముగ్గురు ఆయాలు వున్నారు. పాఠశాల, క్రెష్ ఉదయం 9 నుంచి సాయంత్రం 4-30 దాకా పని చేస్తాయి. క్రెష్‌లో ఆరు నెలల నుంచి పద్దెనిమిది నెలలలోపు పిల్లలను చేర్చు



కుంటారు. నర్సరీ పాఠశాలలో ఐదేళ్లలోపు పిల్లలని మాత్రమే చేర్చుకుంటారు.

"1976లో మేము మధ్యాహ్న భోజన పథకాన్ని ప్రారంభించాము. ఈ పథకం కింద ఇక్కడ విద్య నేర్చుకుంటున్న పిల్లలకి పోషక పదార్థాలతో కూడిన ఆహారాన్ని, వైటమిన్లని ఇస్తున్నాము. ఇందుకుగాను ఒక వంట మనిషిని కూడా నియమించాము. ఇందుకు చెల్లించవలసిందల్లా పిడికెడు బియ్యం, నెలకి అరవై పైసలు మాత్రమే. అంతేకాదు. ఇక్కడి బాలలందరికీ హెల్త్ కార్డ్ యిస్తాము. వారం వారం వైద్యపరీక్షచేసి ఆ వివరాలు అందులో రాస్తాము" అన్నారు సుందరి.

వీరు నిర్వహిస్తున్న కార్యక్రమాలన్నిటిలోకి విశిష్టమైనది - ఆరోగ్య సంరక్షణా కేంద్రం అనే హెల్త్ కేర్ సెంటర్ :

1977 నవంబర్ నెలలో వీరు ఈ కేంద్రాన్ని ప్రారంభించారు. ఇది ప్రతిరోజు సాయంత్రం 6-45 నుంచి 8-45 వరకు, ఆదివారం ఉదయం 9-30 నుంచి 11-00 వరకు పని చేస్తున్నది. శనివారం సెలవు దినం. ఈ ఆరోగ్య సంరక్షణా కేంద్రానికి రోజూ కనీసం 30-40 మంది రోగులు వస్తూ వుంటారు. ఆదివారం వీరి సంఖ్య 80-100 మంది వరకు వుంటుంది. వైద్యవృత్తిలో పాతికేళ్ల అనుభవం గల డాక్టర్

హైమవతి ఈ ఆరోగ్య కేంద్రాన్ని నిర్వహిస్తున్నారు.

"ఈ హెల్త్ కేర్ సెంటర్ కేవలం ఇక్కడి పిల్లలకే కాక ఈ ప్రాంతంలోని పెద్దవారికీ, వారి పిల్లలకీ కూడా ఉపయోగపడుతున్నది. ఇది స్త్రీలకి మాత్రమే ప్రత్యేకించి నిర్వహింపబడుతున్నది కాదు. ఇక్కడ పురుషులు కూడా చికిత్స పొంద వచ్చును. స్త్రీలే నడుపుతున్న ఈ ఆరోగ్య కేంద్రం ప్రత్యేకత యిదే" అన్నారు శ్రీమతి సుందరి.

ఈ ఆరోగ్య సంరక్షణా కేంద్రంలో చికిత్స పొందడానికి ముందుగా పేరు నమోదు చేసుకోవాలి. అందుకు రుసుము రెండు రూపాయలు మాత్రమే. వీరికి ఒక హెల్త్ కార్డు, గుర్తింపు కార్డు ఇస్తారు. హెల్త్ కార్డులో పూర్తి వివరాలు కేస్‌హిస్టరీతో సహా రాసివుంటాయి. ఆ తర్వాత ప్రతిసారి వచ్చినప్పుడు పావలా చొప్పున రుసుము చెల్లించాలి. రోగులకు మాత్రలు, ఇంజక్షన్లకు ఏభై పైసల చొప్పున వసూలు చేస్తారు.

"ఇలా వసూలు చెయ్యడానికి కారణముంది. ఇందువల్ల రెండు ప్రయోజనాలు ఉన్నాయి. ఒకటి- ఉచితంగా వస్తోందిలే అని కారణం ఉన్నా లేకున్నా ఇక్కడకు రావడాన్ని అరికడుతుంది. రెండవది. అలా కొంత డబ్బు ఖర్చుపెట్టడంవల్ల తమకు కూడా ఈ సేవా సమాజంలో ఒక భాగం వుందనే భావం ఏర్పడుతుంది. వారిచ్చేది స్వల్పమే కావచ్చు. కాని అది వారికి తమ బాధ్యతని తెలియచెబుతుంది." అంటారు కోశాధికారిణి శ్రీమతి జయశ్రీశర్మ.

అతి తక్కువ ఖర్చులో గర్భిణీస్త్రీలకు వైద్య సదుపాయం లభించేలా చెయ్యాలన్న ఆశయంతో త్వరలోనే ఒక ఆస్పత్రి నిర్మించాలని నిశ్చయించారు వీరు. ప్రసవ ఆస్పత్రితోపాటే వ్యాధిగ్రస్తులకి చికిత్స నిమిత్తం కొన్ని పడకలను కూడా ఆ ఆస్పత్రిలో కేటాయించాలన్నది వారి నిర్ణయం. తమ సమాజం ఆవరణలోనే అందుకు కావలసిన స్థలం వుంది. ఆ ప్రాంతంలోని వారి సహకారంతో ఆస్పత్రి నిర్మాణానికై విరాళాలు సేకరిస్తున్నారు కార్యకర్తలు.

ఈ సంస్థ నిర్వహణకు కొంతవరకు ఆర్థిక సహాయం కేంద్ర సాంఘిక సంక్షేమ బోర్డు నుంచి, విమెన్స్ ఇండియా అసోసియేషన్ ద్వారా లభిస్తోంది. అయితే వీరి కార్యక్రమాలు చాలా వరకు విరాళాల మీద ఆధారపడి వున్నాయి.

"ఏ బృహత్కార్యాన్ని ప్రారంభించాలన్నా అందుకు తగినంత ధనం కావాలి. అయితే మేము ప్రభుత్వం నుంచి ఈ నిధులు ఆశించడం లేదు. ప్రజలకోసం నిర్దేశించబడింది కాబట్టి వారి నుండే చందాలరూపంలో సేకరిస్తున్నాము. ఎవరి తాహతుకు తగ్గట్టుగా వారు ధనరూపేణాగానీ, వస్తురూపేణాగానీ విరాళాలు యిచ్చి సహకరిస్తే పదిమందికీ ఉపయోగపడే ఒక మంచి పనికి సహాయపడినవారవుతారు. మరొక్క విషయం. మా సమాజానికి విరాళాలిచ్చినవారికి ఆదాయం పన్ను మినహాయింపు లభిస్తుంది" అన్నారు శ్రీమతి జయశ్రీ శర్మ.

ఇటువంటి సమాజాలు వాడవాడలా రావాలి. వివిధ ప్రాంతాలలో మహిళా సమాజాల్ని నిర్వహిస్తున్న కార్యకర్తలు ఈ సమాజం పురోగతిని, మార్గాన్ని అనుసరించిననాడు తమ సమాజంవల్ల సామాన్య ప్రజానీకానికి ఎంతో మేలు చేసిన వారవుతారు. అలా తమ ఉనికి కూడా సార్థకమవుతుంది.

ఈ సమాజం గురించి ఇతర వివరాలకు, విరాళాలు పంపడానికి సంప్రతించవలసిన చిరునామా:

మాదర్ సంఘం (తాంబరం)
10-బి, వ్యాసర్ వీధి,
తూర్పు తాంబరం, మద్రాసు_600045



# వైద్యసలహాలు

## -డాక్టర్

ఎన్. ఎస్.

నా వయసు ఇరవైఅయిదు సంవత్సరాలు. ఇద్దరు సంతానం. ఇద్దరూ సిజేరియన్ ఆపరేషన్ ద్వారానే పుట్టారు. రెండో పాప పుట్టి మూడు నెలలు అవుతుంది. ఇప్పుడు నా కడుపు కొద్దిగా పెద్దదవుతోంది. మామూలు స్థితికి రావాలంటే ఏమి చెయ్యాలి?

జ: దీనికి కొన్ని తేలిక వ్యాయామాలు చెయ్యడం మంచిది. సిజేరియన్ ఆపరేషన్ అయిన నాటి నుంచే రోజూ కొంతసేపు గాలిని బాగా పీల్చి నెమ్మదిగా వదలడం అభ్యసిస్తూ రావాలి. క్రమక్రమంగా కాళ్ళు వంచి కడుపు లోపలికి వచ్చేట్టు గాలిని పీల్చి వదలాలి. అన్నీ నెమ్మదిగానే చెయ్యాలి. తొందర పడకూడదు. అయితే మీకిప్పుడు ప్రసవం జరిగి మూడు నెలలు అయిందంటున్నారు. అంచేత పొత్తికడుపు మీద కొంత నూనె రాసి బాగా మసాజ్ చెయ్యండి. మోకాళ్ళు వంచకుండా చేతి మునివ్రేళ్ళు కాలి వ్రేళ్ళను తాకే విధంగా వంగి వ్యాయామం చేస్తే - పొట్ట తగ్గి మామూలు స్థితికి వస్తుంది.

ఎస్. ఆర్.

మా అమ్మాయికి జుత్తు బాగా ఒత్తుగా వుండేది. అయితే పొడుగు పెరగడం లేదు. పైగా ఇప్పుడు రోజు రోజుకు చేయి తగలగానే జుట్టు ఊడిపోతోంది. దీనికేం చెయ్యాలి? ఏ నూనె వాడడం మంచిది? దయచేసి చెప్పగలరు.

జ: శిరోజాలు రాలడానికి ముఖ్య కారణం శరీరంలో పోషకాహారాలు లోపించడమే. రక్తక్షీణత (అనీమియా) కూడా కావచ్చు. అందువల్ల ఆహారంలో ఆకుకూరలు ఎక్కువగా చేర్చుకోవాలి. విటమిను మాత్రలు వాడడం మంచిది. తలకు తరచూ నూనెలు మార్చకుండా ఎప్పుడూ కొబ్బరి నూనె వాడడమే మంచిది.

ఎస్. యు.

మా బాబుకి ఇప్పుడు ఐదో నెల. మొదటిసారిగా పోలియోడ్రాప్స్ Triple An igen పోయిననెలలో ఇచ్చాము. ఈ నెల తరచూ విరేచనాలు కావడంతో ఇవ్వలేదు. కొంచెం తగ్గాక ఇచ్చాము. అయితే ఇచ్చిన రెండు గంటలకల్లా రెండు మూడుసార్లు విరేచనాలయ్యాయి. అందువల్ల పోలియోడ్రాప్స్ శరీరంలో కలవకుండా పోయివుంటుందేమోనని సందేహంగా వుంది. మళ్ళీ ఎప్పుడు ఇవ్వచ్చు? పిల్లలకు తరచూ విరేచనాలు రావడానికి కారణం ఏమిటి?

జ: పోలియోడ్రాప్స్ ఇచ్చేప్పుడు విరేచనాలుంటే ఒక్కోసారి ఉపయోగం లేకుండా పోవచ్చు. అంచేత మీ పాపకు నాలుగునుంచి ఆరు వారాల వ్యవధిలో రెండు మూడుసార్లు పోలియోడ్రాప్స్ ఇవ్వడం మంచిది. ఇక పిల్లలకు తరచూ దగ్గు జ్వరం, విరేచనాలు రావడానికి ఎన్నో కారణాలు వున్నాయి. అవి ఆయా శిశువుల్ని చూస్తే తప్ప చెప్పలేము. అంచేత మీ పాపను డాక్టర్‌కు చూపడం మంచిది. రోజూ మల్టీవైటమిన్ డ్రాప్స్, సి వైటమిన్ డ్రాప్స్ ఇవ్వడం పాప ఆరోగ్యానికి మంచిది. •

కె. ఎల్.

మూడు నెలలుగా నా రెండు కాళ్లు విపరీతంగా పోట్లు పెడుతున్నాయి. మోకాళ్లు వంచడానికే కష్టంగా వుంది. డాక్టర్‌ను సంప్రదిస్తే కొన్ని వైద్యపరీక్షలు చేసి అంతా నార్మల్‌గా వుందని కొన్ని మాత్రలు రాసిచ్చారు. వాడాను. కాని ఎలాంటి ఫలితమూ కనబడలేదు. నా వయసు నలభై అయిదు సంవత్సరాలు.

జ: వయసు ఎక్కువయితే కొందరికి మోకాళ్ళ పోట్లు పెడతాయి. మోచిప్పలు, అక్కడి కండరాలు సడలి బలహీనం కావడమే దీనికి కారణం. కాళ్ల పోట్లు కదా అని నడవకుండా, కాళ్ళు మడిచి కూర్చోకుండా వుండకూడదు. రోజూ పదిహేను నిమిషాలు కాళ్లు మడిచి తేలికగా వ్యాయామం చేస్తూ, బలవర్థకమైన ఆహారం తీసుకుంటే బాధ తగ్గుతుంది.

డి. కె.

మా అబ్బాయికి ఐదేళ్లు నిండాయి. రోజూ గుడ్డును అలాగే పాలలో కలిపి ఇస్తున్నాము. ఇలా ఇవ్వవచ్చా? భోజనం చేసిన వెంటనే మలవిసర్జన చేస్తాడు. డాక్టర్‌కు చూపెంచి కొన్ని టానిక్కులు కూడా వాడాను. అయితే ఇంకా పూర్తిగా నయం కాలేదు. ఈ అలవాటు మాన్పడం ఎలా? దయచేసి చెప్పగలరు.

జ: గుడ్డు పైపెంకు మీద సూక్ష్మక్రిములు వుంటాయి. గుడ్డు లోపలి పదార్థాన్ని వేడి పాలలో కలిపినా కొన్ని క్రిములు అలాగే వుండి ఆ తర్వాత వ్యాధులు రావడానికి కారణం అవుతాయి. అంచేత పచ్చి గుడ్డుగా కాకుండా సగం వుడికించి లేదా ఆమ్లెట్ వేసి ఇవ్వడం మంచిది. పాప తిన్న వెంటనే మలవిసర్జన చేయడానికి అమీబాయిక్ జియార్డియల్ ఇన్‌ఫెక్షన్ కారణం కావచ్చు. డాక్టర్‌ను సంప్రదించి మందులు వాడితే సరిపోతుంది.

కె. ఎమ్.

నా వయసు ఇరవైయేడు సంవత్సరాలు. మూత్ర విసర్జన త్వరగా చేయడానికి వీలుకావడం లేదు. నెమ్మదిగా చేయవలసివస్తోంది. అయితే, ఋతుస్రావంలో ఎలాంటి ఇబ్బందీ లేదు. దీనికి కారణం ఏమిటి? నివారణోపాయం చెప్పగలరు.

జ: ప్రసవ ద్వారంలోనో, మూత్ర ద్వారంలోనో పుండువంటిది వుండవచ్చు. లేదా మూత్రంలో క్రిములేవైనా చేరివుంటాయి. అందువల్ల మూత్ర పరీక్ష చేసి చూసిన తర్వాతనే, తగిన మందులు వాడాలి. వాటితోపాటు వళ్ళరసం, లేత కొబ్బరి నీళ్ళు తీసుకుంటే బాధ తగ్గుతుంది.

ఏ. పి.

నా వయసు పద్దెనిమిది సంవత్సరాలు. నా బుగ్గలు, చెంపలు లోతుకు పోయినట్లు మరీ పలుచగా వున్నాయి. కండకట్టి అందంగా రావాలంటే ఏం చెయ్యాలి?

జ: ఆహారంలో పాలు, పెరుగు, పళ్లు బాగా చేర్చుకోండి. మాంసాహారులయితే చేపలు, గ్రుడ్లు ఎక్కువగా తీసుకున్నట్లయితే కూడా ఫలితం కనబడుతుంది. □

# "ఇంట్లోకి రాకూడదు!"

"ఒరే వెధవా! ఆ పక్కకి వెళ్ళద్దని ఎన్నిసార్లు చెప్పాలి?.... వెధవ పరుగెత్తడాలూ మీరూనూ. వీధిలోకి పోయాడుకోండి...." అని గట్టిగా గసిరింది, అత్తగారు.

వీధి తలుపు పక్కనే వున్న చిన్న గదిలో ఓ మూలగా కూచునివున్న కోడలు ఆ కేకలకి హడలిపోయింది - అత్తగారు తననేం అంటుందోనని. ఆమె అనుకున్నట్టుగానే అత్తగారు కోడల్ని నాలుగు పెట్టింది!

"పొద్దస్తమానం అలా గదిలోనే వుండకపోతే, పెరట్లోకిపోయి ఓ మూల కూచోరాదూ? జ్ఞానం వచ్చిన వెధవలు ఇక్కడ తిరుగుతూనే వుంటారు గదా-చిన్న గాడిదలకి మంచి చెడ్డా ఏం తెలుస్తాయి? ఆడుతూ ఆడుతూ ఓ మారు నీ గదిలోకి పరుగెడుతారు."

కోడలేం మాట్లాడలేదు. మరీ మూలకి వెళ్ళి ఒదిగి కూచుంది....

మధ్యాన్నం అందరూ భోజనాలు చేసేశాక, అందరూ చేతులు కడిగేసుకున్న తర్వాత అప్పుడు నిదానంగా, కోడలికి వడ్డించారు _ ఆ చీకటి గదిలోనే. ఆకులో అన్నీ వడ్డించేవరకూ, ఆమె దూరంగానే వుంది. "ఇహ రా" అన్న తర్వాతే దగ్గర కొచ్చింది - తన దగ్గరున్న చెంబు తెచ్చుకుంటూ. తాగడానికి ఆ చెంబులో నీళ్ళు పోసిన తర్వాత, ఆమె మరేమీ అడగలేదు; అడగనూకూడదు. పెట్టినదాన్నే తినేసింది.

ఆకు పారేయడానికి లేచేముందు, అటూ ఇటూ ఎవరూ లేకుండా చూసి, వుంటే లోపలికి పొమ్మని-అప్పుడు వీధిలోకి వెళ్ళి దూరంగా ఆకు పారేసి వచ్చింది. వస్తూనే ఆ చీకటి గదిలోకి పోయి యథాస్థానంలో కూచుంది.

ఏమిటది? ఎందుకని ఆ కోడలు అలా అంటరానిదయింది? — ఆమెకు ఏదయినా అంటురోగమా? ఆమె గాలిసోకితేనే రోగాలు చుట్టుకునేంత భయంకరమైన వ్యాధా? _ కాదు, అదేం కాదు. అది — స్త్రీకి ప్రకృతి సిద్ధమైన ఋతు సమయం. ఆ సమయంలో ఆమె అంటరానిది! భయంకర వ్యాధిగ్రస్తురాలు!

పురాతనకాలం నుంచి వస్తున్న అనేక చాదస్తాలలో ఇదీ ఒకటి. ముఖ్యంగా గ్రామీణ ఛాందస బ్రాహ్మణ కుటుంబాల్లో అయితే ఇది మరీ ఎక్కువ! ఆ మూడు రోజులూ ఆమె స్నానం చెయ్యకూడదు; ఇంట్లోకి రాకూడదు; దేవుడి గదివేపు చూడకూడదు; ఎవర్నీ తాకకూడదు. ఒక్కత్తే ఓ మూల కూచోవాలి. మూడు రాత్రులు - అది చలికాలమైనాసరే, చాప మీద - తల కింద ఏమీ పెట్టుకోకుండా ఏ పాత చీరో కప్పుకుని పడుకోవాలి. ఇంట్లో అందరూ భోజనాలు చేసిన తర్వాత గాని, భోజనం చెయ్యకూడదు....

ఈ 'అంటరానితనం' ఎప్పట్నుంచి, ఎందుకని అమల్లోకి వచ్చిందో గాని - సాటి స్త్రీకి ఆ పేరు మీద ఆ మూడు రోజులూ 'కఠిన శిక్ష' విధించడానికి ఏ స్త్రీ వెనకాడదు!

బహిష్టు రక్తం చాలా అపాయకరమైనదనీ, అపవిత్రమైనదనీ ... ఆ సమయంలో స్త్రీని అంటు



కుంటే, అంటుకున్నవారందరూ అపవిత్రులై పోతారనీ, ఏదో తీవ్రమైన 'వ్యాధి' సంక్రమించేస్తుందనీ- ఒక మూఢ విశ్వాసం తరతరాలుగా మనలో నాటుకుపోయి వుంది. ఇవాళ పట్టణాల్లో దీన్ని గురించి ఆటే పట్టించికోనట్టు నటించినా ఇళ్ళలో మాత్రం యధావిధి కార్యక్రమమే. చదువుకుంటున్న అమ్మాయిలూ, ఉద్యోగాలు చేస్తున్న స్త్రీలూ ఋతుసమయంలో కూడా కాలేజీలకీ, ఆఫీసులకీ వెళ్తున్నారు. అక్కడ అందరి పక్కనా కూచుంటారు; అందర్నీ తాకుతారు. ఇంటికొస్తే మాత్రం- మళ్ళీ మామూలే. పొరపాటున ఎవరైనా వాళ్ళని తగిల్తే, వాళ్ళు బట్టలు తడుపుకోవాలి; స్నానం చెయ్యాలి. అంత అపవిత్రకరమైన సిద్ధాంతం అందులో వుంది.

అయితే, ఆధునిక వైద్యులు ఈ విధానాన్ని పూర్తిగా కొట్టిపారేశారు. నెలకొకసారి వచ్చే బహిష్టులో జారీ అయేకొద్దీ అవున్నుల రక్తంలో ఎలాంటి అంటురోగ లక్షణాలూ వుండవనీ, అదేమీ చెడు రక్తం కాదనీ, అశుభ్రమైనదేమీ కాదనీ, పైగా శుభ్రమైనదేననీ డాక్టర్లు చెబుతూనే వున్నారు. కానీ, 'స్త్రీకి స్త్రీయే శత్రువు' అన్నట్టు ముందుగా అత్తగారో, తల్లో ఎవరో ఒకరు తక్కిన వారికి ఆ 'శిక్ష' విధించేస్తారు; వాళ్ళూ ఆ శిక్షను శిరసావహించేస్తారు.

మన భారతదేశం అంతటా ఈ విధానం బాగానే అమల్లో వుండడం అలా వుంచి, క్రైస్తవులు కూడా దీన్ని నమ్ముతారు. వారి మత గ్రంథంలో దీన్నిగురించి ప్రస్తావిస్తూ ఆ సమయంలో స్త్రీలు అపరిశుభ్రంగా వుంటారనీ, వారం రోజులపాటు వారు అందరికీ దూరంగా వుండాలనీ వున్నదిట! పార్శీవారు కూడా ఈ విధానాన్ని నమ్ముతారు. అయితే, ఇవాళ చాలామంది మామూలుగా తమ పనిపాట్లు చేసుకుంటున్నారు.

ఐతే, ఆ మూడు రోజులూ రక్తస్రావంతో స్త్రీలు కొంత బలహీనం కావచ్చునని అందుకని విశ్రాంతి అవసరం అనీ పూర్వీకుల ఉద్దేశం. ఆ ఉద్దేశంతోనే విశ్రాంతి తీసుకోరని కాబోలు - 'కఠినశిక్ష' లాంటిది కూడా అమలు చేసి వుంటారు. ఆ మూడు రోజులూ భర్త సమాగమం పూర్తిగా నిషిద్ధం గనక, భర్త వేపు కన్నెత్తి కూడా చూడరాదన్నారు. కానీ, ఆధునిక విజ్ఞానశాస్త్రం వీటన్నిటినీ మూఢ విశ్వాసాలకిందనే కొట్టిపారేసింది. కాస్త విశ్రాంతి తీసుకోడం వరకూ పర్వాలేదు గానీ, తక్కిన విషయాల్లో మామూలుగానే ఉండొచ్చునని, దానివల్ల దుష్ఫలితాలేమీ వుండవని ఆధునిక విజ్ఞానశాస్త్రం చెబుతున్నది.

అయితే, రానురాను రోజులు మారుతున్నకొద్దీ కొన్ని కొన్ని నమ్మకాలు కూడా మారుతూనే వస్తున్నాయి. ఇవాళ స్త్రీలలో ఎక్కువమంది చదువుకుంటున్నారు; ఎక్కువమంది ఉద్యోగాలు చేస్తున్నారు. ప్రతి మాసంలోనూ మూడు రోజులపాటు స్కూళ్ళు, కాలేజీలు మానివెయ్యడమో ఆఫీసులకు సెలవు పెట్టడమో చెయ్యడం కుదరని పనికాదు గనక, ఎవరి పన్లు వారు చేసుకుంటున్నారు – ఇళ్ళ దగ్గర మాత్రం పెద్దవాళ్ళకి దడిసి, దూరంగా వున్నాసరే.

ఏమైనా, పూర్వం లాంటి రోజులు కావివి. భర్తా భార్యా ఇద్దరూ ఉద్యోగాలు చేసి సంపాయించుకుంటేనే, జీవితాలు కాస్త సాఫీగా నడిచే రోజులు. భార్య మూడు రోజులపాటు మూల కూచుంటే, తాను వండి వడ్డించుకునే వీలు భర్తకెక్కడిది? భార్యతోపాటు తానూ మూడు రోజులు ఆఫీసుకి సెలవు పెడతాడా? అయినా కాకపోయినా, పెద్ద దిక్కు వున్న ఇళ్లలో అయితే ఇబ్బంది వుండకపోవచ్చు గాని, పట్టణాల్లో వుండే చిన్న కుటుంబాల్లో ఈ విధానం బాగా తగ్గిపోయింది. బహిష్టు కాగానే స్నానం చేసేసి, తమ ఇంటి పన్లు తాము చూసుకుంటున్నారు. ఒకవేళ లోపల తాను తప్పు చేస్తున్నానన్న బాధ వున్నా కూడా – తప్పదని సరిపెట్టుకుంటున్నారు. వీలు, అవకాశం వున్నవాళ్లు మూడు రోజులూ విశ్రాంతి తీసుకుంటే తీసుకోవచ్చునేమో గాని, ఆ పేరు మీద తాము మూఢ విశ్వాసాలకొద్దీ 'కఠిన శిక్ష'కు లోనుకావడం మాత్రం అనాగరికమే.

## రాగి మాల్ట్

కాఫీ, టీలకంటే రాగిమాల్ట్ ఆరోగ్యానికి మంచిది. చిన్న పిల్లలకు, డయాబిటీస్ గల వారికి, పాలు ఇచ్చే తల్లులకు, ఎదిగే పిల్లలకు ఇందులో కావలసినన్ని పోషకపదార్థాలు ఉన్నాయి. కాల్షియం, ఐరన్ ప్రొటీన్స్ ఎక్కువగా ఉన్న పానీయం రాగిమాల్ట్.

రాగిమాల్ట్ కొంచెం కష్టపడితే ఇంటిదగ్గరే చేసుకోవచ్చు. రాగులు కొని రాళ్ళు, తుక్కు లేకుండా శుభ్రం చేసుకొని ఒక రాత్రి అంతా నీళ్ళలో నానపెట్టాలి. ప్రొద్దున నీళ్ళు లేకుండా ఒడ్చి ఈ రాగులు బట్టలో (తువ్వాలు కాని ఇంకేదైనా మంచి గుడ్డలో) మూటకట్టి ఉంచాలి. పెసలు నానపెడితే మొలకలు వచ్చినట్లు చిన్న మొలకలు వస్తాయి ఈ రాగుల్లోంచి. అప్పుడు వాటిని (మొలకలు వచ్చిన రాగుల్ని) ఎండలో పెట్టి కొంచెం ఎండాక మూకుడులో వేసి వేపి వాసన వచ్చేవరకు వేయించాలి. (మంచి వాసన వస్తుంది) అప్పుడు వీటిని మెత్తని పొడిలాగా విసురుకోవాలి. విసురుకున్న పొడిని తడి లేని డబ్బాలో కాని సీసాలో కాని జాగ్రత్తగా గాలి తగలకుండా మూత వేసి పెట్టుకోవాలి. ఇదే రాగిమాల్ట్.

ఈ పొడిని (ఒక చెంచాడు) గ్లాసు పాలల్లో వేసుకొని పంచదార ఏలకులపొడి వేసుకుని త్రాగితే చాలా రుచిగా ఉంది ఎదిగే పిల్లలకు మంచి ఆరోగ్యాన్ని ఇస్తుంది.

ఒక చెంచాడు రాగిమాల్ట్ను కొంచెం నీళ్లలో కలిపి రెండు గ్లాసుల నీళ్లను మరగనిచ్చి అందులో ఆ కొంచెం నీళ్ళలో ఈ నీళ్ళువేసి రెండు పొంగులు వచ్చేవరకు మరగనిచ్చి చల్లారేక అందులో ఉప్పు కొంచెం మజ్జిగవేసుకొని త్రాగితే వంటికి మంచిది. డయాబెటిస్ (చక్కెర వ్యాధి వారికి) వారికి కాఫీ, టీల కంటె మంచి పోషక ఆహారం. వేసవి కాలంలో దాహం కడుతుంది కూడా.

—యస్. లక్ష్మి

**లోకజ్ఞానం - సమాధానాలు**

1. సర్ మహమ్మద్ ఇక్బాల్ (1873 - 1938)
2. గురజాడ అప్పారావు (1861-1915)
3. రాయప్రోలు సుబ్బారావు
4. బంకిం చంద్ర ఛటర్జీ (1838—1894)
5. కీ. శే. శంకరంబాడి సుందరాచారి
6. 'లోకమాన్య' బాలగంగాధర తిలక్ (1856-1920)
7. భారత విప్లవవీరుడు. 64 రోజుల నిరాహార దీక్ష అనంతరం సెప్టెంబర్ 13, 1929న ఆయన లాహోర్ జైలులో మరణించారు.
8. 'మై ఎక్స్‌పెరిమెంట్స్ విత్ ట్రూత్' (సత్యశోధన)
9. జనవరి 26, 1930. ఈ సంఘటన జరిగిన 20 ఏళ్ల తర్వాత సరిగ్గా అదే రోజున మనకు సంపూర్ణ స్వాతంత్ర్యం సిద్ధించింది.
10. కీ. శే. పింగళి వెంకయ్య.

# సంస్కృత పాఠమాల 13

క్రిందటి పాఠమున అకారాన్త పుంలింగ శబ్దమైన 'బాలకః' అను దానికి భిన్నభిన్న విభక్తులందు గల రూపములను--- ఏక, ద్వి, బహువచనములందు) తెలిసికొన్నాము.

సంస్కృతమున శబ్దములు రెండు విధములు. సుబంతములు, తిఙంతములు, నామములు, విశేషణములు మొదలగునవి సుబంతములు. ఉదాహరణకు **रामः** రామః **बालकः** బాలకః (బాలుడు) **श्यामः** శ్యామః (నల్లనివాడు) మొదలగునవి.

తిఙంతములనగా క్రియలు. ఉదాహరణకు **अस्ति** అస్తి (కలదు) **गच्छति** గచ్ఛతి వెళ్లుచున్నాడు మొదలగునవి.

సుబంత పదములకే మూడు లింగములు. పుంలింగము, స్త్రీ లింగము, నపుంసకలింగము. ఉదాహరణకు **बालकः** బాలకః పుంలింగము. **सीता** సీతా స్త్రీలింగము **फलम्** ఫలమ్ ఫలము నపుంసకలింగము.

సుబంత పదములకు ఏడు విభక్తులు. ప్రథమ, ద్వితీయ, తృతీయ, చతుర్థ, పంచమి, షష్ఠి, సప్తమి అను విభక్తులు. ప్రథమావిభక్తి యందే సంబోధన ప్రథమాయని విశేషము. మరల ప్రతి విభక్తికి మూడు వచనములు (ఏక, ద్వి, బహు).

క్రిందటి పాఠమున **बालकः** బాలకః శబ్దమునకు (అకారాంత పుంలింగము) ఏడు విభక్తులందు మూడు వచనముల రూపములను తెలిసికొంటిమి.

సుబంత పదములలో లింగము, విభక్తి, వచనము లేని పదములు కలవు. వాటికి అవ్యయములని పేరు. ఉదాహరణకు **यत्र** యత్ర **कुत्र** కుత్ర **यदा** యదా **तदा** తదా **एवम्** ఏవమ్ మొదలగునవి

సంస్కృత విభక్తులు — తెలుగు విభక్తులు — విభక్తి నామములు.

| ఏకవచనం | ద్వివచనం | బహువచనం | | |
|---|---|---|---|---|
| సు | ఔ | జస్ | డు, ము, వులు | ప్రథమా విభక్తి |
| అమ్ | ఔట్ | శస్ | ని, ను, ల, కూర్చి | ద్వితీయా విభక్తి |
| టా | భ్యామ్ | భిస్ | చేత, చే, తోడ, తో | తృతీయా విభక్తి |
| ఙే | భ్యామ్ | భ్యస్ | కొఱకు, కై | చతుర్థీ విభక్తి |
| ఙసి | భ్యామ్ | భ్యస్ | వలన, కంటె, పట్టి | పంచమీ విభక్తి |
| ఙస్ | ఓస్ | ఆమ్ | కికు, యొక్క, లో, లోపల | షష్ఠీ విభక్తి |
| ఙి | ఓస్ | సుప్ | అందున | సప్తమీ విభక్తి |

సంస్కృతభాషలో ప్రత్యయముల యొక్క సహాయమువలన విభక్తులయొక్క స్పష్టమైన రూపము గ్రహింపవచ్చును.

సంస్కృత విభక్తులను జ్ఞాపకముంచుకొనుటకు శ్లోకమొకటికలదు.

స్వౌజసమౌట్ఛస్టా భ్యామ్ భిస్ఙే భ్యామ్ భ్యస్ఙసి భ్యామ్ భ్యస్
ఙసోసామ్ ఙ్యోస్సుప్ బిత్యేతాః క్రమాత్ జ్ఞేయోవిభక్తయః

వాక్యముల అర్థమును పూర్తిగా అవగాహన చేసికొనుటకు శబ్దముల స్వరూపము తెలియవలెను. శబ్దముయొక్క రూపమే విధముగా పరిణమించునో కొంతవరకు విభక్తులవలన, లింగములవలన, వచనములవలన తెలియును. ఇది ముఖ్యముగా గుర్తు పెట్టుకొనవలెను.

[సంస్కృత పాఠాలమీద సందేహాలున్నవారు 'వనిత'కు రాసి తెలుసుకోవచ్చును]

# ఏమిటో మచ్చలు?



ముద్దుగా బొద్దుగా వున్న తన పాప అంటే ఆ తల్లికి పంచప్రాణాలు. లేక లేక పుట్టిన పాప ఆలనా, పాలనా తనే స్వయంగా చూసేది. ఓ రోజు పాపకు స్నానం చేయిస్తున్నప్పుడు పాప మెడ క్రింద కొన్ని మచ్చలు కనబడ్డాయి. అవి మామూలు శోబి అనుకుని అంతగా పట్టించుకోలేదామె.

రోజులు కానుకాను శోబి పొడలా తయారై ఎక్కువకాసాగింది. అంచేత డాక్టర్ దగ్గరికి తీసుకెళ్లింది.

డాక్టర్ పాప పొడల మీద గుండుసూదితో తాకి "ఎలా వుందమ్మా" అని పాపను అడిగాడు. "ఏమీ తెలియలేదు డాక్టర్. తాకినట్టే లేదు" అంది పాప అమాయకంగా. మరికొన్ని పరిశోధనలు జరిపి—"పాపకు కుష్ఠువ్యాధి" అని చెప్పాడు డాక్టర్.

గతుక్కుమంది తల్లి హృదయం! "చిన్న పిల్లలకూ వస్తుందా డాక్టర్ ఈ వ్యాధి. అయినా



మా వంశంలో ఎవరికీ లేదే డాక్టర్ ఇది" అంటూ ఆందోళనతో నిండిన ఆశ్చర్యం వెలిబుచ్చిందామె!

ఈ వ్యాధి గురించి అంతగా తెలియని ఆమెకు వివరంగా చెప్పడం ప్రారంభించాడు డాక్టర్....

శతాబ్దాల నుంచి మనిషిని పట్టి పీడిస్తున్న ఘోరమైన వ్యాధి కుష్ఠువ్యాధి! 'లెప్రా పాలిసస్' అన్న క్రిముల ద్వారా ఇది వ్యాపిస్తుంది. మానవ జాతిని మాత్రమే పీడిస్తుందని ఇన్నాళ్లు అనుకునేవారు. అయితే ఇది జంతువుల్ని కూడా పట్టుకుంటుందని ఇటీవలే కనుగొనబడింది.

కుష్ఠువ్యాధి క్రిములు అంటుకున్నప్పుడు వాటిని నిరోధించే శక్తి—పెద్దలకు ఎక్కువగా వుంటుంది. పసిపిల్లలలో ఈ వ్యాధి నిరోధకశక్తి తక్కువ. అంచేత పిల్లలలో తొందరగా వ్యాపిస్తుంది. ఈ పొడ ప్రారంభమయ్యేప్పుడు ఎలాంటి దురదా బాధా వుండదు. అంచేత వీటిని గురించి పిల్లలు చెప్పరు. తల్లిదండ్రులూ గమనించకుండా వదిలేస్తారు. ఒక వేళ గమనించినప్పటికీ—"మన కుటుంబంలో ఆ వ్యాధి లేదు. అలాంటప్పుడు పిల్లలకెలా వస్తుంది?" అన్న అజాగ్రత్తలో ఉదాసీనం వహిస్తారు.

పిల్లలకు కొందరికి వ్యాధి నిరోధకశక్తి పూర్తిగా వుండదు. అలాంటి వారికి ఈ క్రిములు సోకడం వల్ల ఇతర భాగాలకు అతిత్వరగా వ్యాపిస్తుంది. చర్మం మీద ఎర్రటి, నున్నటి పొడలు మిలమిలలాడేట్టు కనబడతాయి. చెవులు వాచినట్లు పెద్దవిగానూ, ఎర్రగానూ తయారవుతాయి.

ఈ వ్యాధి క్రిములు ఎలా వ్యాపిస్తాయని కచ్చితంగా ఇంతవరకూ తెలుసుకోడానికి వీలుకాలేదు. అంచేత వ్యాధి లక్షణాలు కనబడిన వెంటనే ఏం చెయ్యాలి – అన్న విషయాలు తెలుసుకోవాలి. ఇది వంశానుగతంగా వచ్చే వ్యాధి కాదు. ఈ వ్యాధి గలవారి సంతానాన్ని కూడా వారి నుంచి వేరుచేసి పెంచినట్లయితే ఈ వ్యాధి లక్షణాలు అసలు కనబడడం లేదు.

ఐతే, ప్రస్తుతం ఈ వ్యాధిని పూర్తిగా నయం చేయడం సాధ్యమే. ఆరంభంనుంచే మందులు సక్రమంగా వాడడం వల్ల వ్యాధి లక్షణాలు మాత్రమే కాదు దీనివల్ల ఏర్పడే దుష్పరిణామాలు కూడా లేకుండా చెయ్యొచ్చు.

దేశమంతటా అన్ని ప్రాంతాలలోనూ ఇవాళ ఈ వ్యాధికి కావలసిన మందులు లభ్యమవుతున్నాయి. అందువల్ల పిల్లల శరీరం రంగులో ఎలాంటి మార్పు కనబడినా అశ్రద్ధచెయ్యకుండా డాక్టర్‌ను సంప్రదించడం శ్రేయస్కరం.

అంతేకాదు—

వైద్యరంగంలో శిక్షణపొందిన ప్రభుత్వోద్యోగులు కొందరు పాఠశాలలకు వెళ్లి బాలబాలికలను వైద్యపరీక్ష చేస్తారు. అలాంటప్పుడు ఈ వ్యాధి లక్షణాలున్నవారు కనబడితే ఈ విషయం తల్లిదండ్రులకు తెలియజేసి కావలసిన సలహా, సహకారం అందజేస్తారు. అలాంటప్పుడు ఉదాసీనం చేసి వ్యాధి బాగా ముదిరిపోయాక వైద్యులను వెతుక్కుంటారు. ప్రారంభంలో గోటితో చిదమడానికి బద్ధకం వేస్తే పెరిగాక గొడ్డలితో నరకడం వంటిదే అవుతుంది.



డాక్టర్ చెబుతున్నదంతా ఒళ్ళు మరచి విన్నదావిడ.

"వింటున్నారా లేదా? అలా చూస్తున్నారేమిటి? మీరేం బెంగపడనవసరం లేదమ్మా. మేము చెప్పేట్టు మందులు వాడారంటే త్వరలోనే పూర్తిగా నయమైపోతోంది" అన్నారు డాక్టర్.

"అలాగే చేస్తాము డాక్టర్. చాలా థాంక్స్!" అంటూ ఎంతో నమ్మకంతో ఇంటికి బయలుదేరిందా తల్లి పాప నెత్తుకుని.

— డా. సి. ఎస్.


'వనిత' పాఠకులకు అభినందనలతో
రవివర్మ తైలవర్ణ చిత్రం
మత్స్య గంధి

# విశ్వసాహిత్యంలో ఉద్గ్రంథాలు

'బ్రాహ్మీదేవి'

"ప్రపంచ నవలా సాహిత్య చరిత్రలో యీ గ్రంథం ప్రకటింపబడటమే ఘనమైన సంఘటన" అని ఉద్ఘాటింపబడిన నవల 'అంకుల్ టామ్స్ కేబిన్' రచయిత్రి హేరిట్ బీచర్‌స్టోవ్ అమెరికాలో (కనెక్టికట్) లిచ్‌ఫీల్డులో 1811 లో జన్మించింది. ఈ గ్రంథం దాదాపు ప్రపంచ భాషలన్నిటిలోకి అనువదింపబడి కొన్ని లక్షల ప్రతులు అమ్మబడింది. అది 1852 లో నాటకీకరింపబడగా వంద సంవత్సరాలు నాటక రంగస్థలం మీద రాజ్యం చేసింది. బానిసలకు స్వేచ్ఛ ఇవ్వాలనే సమస్య మీద అమెరికా సంయుక్త రాష్ట్రాలలో వచ్చిన అంతఃకలహాల యుద్ధం - యీ నవల మూలంగా వచ్చాయని విశ్వసించేవాళ్ళున్నారు. అమెరికా అధ్యక్షుడు అబ్రహాం లింకన్ యీ రచయిత్రి కనిపించినప్పుడు "అయితే ఒక నవల వ్రాసి యుద్ధాన్ని కల్పింపజేసిన వనితామణి మీరన్నమాట" అన్నాడట.

ఆమె యీ పుస్తకాన్ని కావాలని వ్రాయలేదని- 'దీన్ని భగవంతుడే రాశాడు. నేను లేఖకురాల్ని మాత్రమే' అన్నది. ఆమె యీ నవలను 1851లో ప్రకటించిన తరువాత దాని ఘనవిజయంవల్ల - ఆమె రచించి మిగిలిన మంచి గ్రంథాలు - ది మినిస్టర్స్ వూయింగ్, ఓల్డ్ టౌన్ ఫోక్స్, శాంబాసన్స్ ఫైర్‌సైడ్ స్టోరీస్, పొగానుక్ పీపుల్- మరుగున పడిపోయాయి.

ఆమె మరణించే సమయం (1896) దాకా రచనలు చేస్తూనే ఉన్నది. ఆమె రచనలన్నీ మొత్తం 16 సంపుటాలైనాయి. అవి అన్నీ మనోజ్ఞంగానూ-సరసంగానూ ఉంటాయి. ఒక మహా రచయిత్రి సృష్టించిన రచనలే అవన్నీ.

తలితండ్రులకు ఆరుగురు అన్నల తరువాత కుమార్తెగా ఆమె జన్మించింది. తండ్రి నిక్కచ్చిగల మతాచార్యుడు. ఆమె పదునాలుగవ ఏట ఉపాధ్యాయ వృత్తి స్వీకరించింది. ఆమె ఇరువదినాలుగవ ఏట ఆచార్య కాల్విన్ స్టోల్‌ను పెండ్లాడింది. ఆమెకు ఏడుమంది సంతానం. ఇంటి బాధ్యతలూ-పిల్లల పెంపకం-ఉపాధ్యాయవృత్తిభారం - యిన్ని ఉన్నా ఆమె ధారాళంగా రచనలు చేసింది.

బానిసల దుర్భరవిషాదగాథలే యితివృత్తంగా గల యీ 'అంకుల్ టామ్స్ కాబిన్' నవలలో సంగ్రహంగా కథా స్వరూపమిది.

"అమెరికా సంయుక్తరాష్ట్రాలలో అంతః కలహాలకు ముందు కాలమది. కెంటకీరాష్ట్రంలో షెల్బీ ప్లాంటేషన్ మంచి యజమాని చేతుల్లో ఉంది. ఆర్థర్ షెల్బీ పెద్దమనిషి. ఉదారుడు. అతని భార్య ఎమిలి దైవభక్తి, పరోపకారశీలమూ కలది. వాళ్ళ కుమారుడు జార్జి అందరినీ అభిమానంతో చూచేవాడు. పనివాళ్ళందరికీ ప్రీతిపాత్రుడు. అక్కడ ఉన్న బానిసలందరినీ మానవులుగా చూచేవాళ్ళు. అంకుల్ టాం నీగ్రో బానిస అయినా షెల్బీకి మిక్కిలి నమ్మినబంటు. చాలా మంచివాడు. అతని భార్య క్లో వంటపనిలో నిపుణురాలు. ఆమె కూడా షెల్బీ కుటుంబంలో సభ్యురాలుగా ఆదరింపబడేది.

కాని షెల్బీ కొంచెం దుబారా ఖర్చులకు అలవాటుపడి ఋణగ్రస్తుడైపోయి తన బానిసలను అమ్మవలసి వచ్చింది. కరుణలేని కటికవాడు డాన్ హేలే టాంను కొన్నాడు. ఇంకో బానిసల జంట జార్జిహేరిస్, అతని భార్య ఎలిజా. వాళ్ళకు హేరీ అనే అయిదేండ్ల పిల్లవాడు. తన్ను కూడా అమ్ముతాడనే భయంతో జార్జిహేరిస్ కెనడాకు పారిపోవాలని తప్పించుకు వెళ్ళాడు. అతడు పారిపోయిన తర్వాత అతని భార్య-ఎలిజా కుమారుడు హేరీని తీసుకుని తాను కూడా పారిపోవాలని అనుకుని ఓహైవో నది గట్టున ఉన్న ఒక గ్రామానికి చేరుతుంది. మంచుగడ్డలతో ఉన్న ఆ నదిని దాటటానికి పడవకోసం ఎదురు చూస్తూ ఆ గ్రామ సత్రంలో బసచేస్తుంది.

అయితే బానిసల వర్తకుడు డాన్‌హేలీ ఆమెను వెంటాడుతూ వచ్చాడు. ఎలిజా అతన్ని చూచి పట్టుకు బంధిస్తాడని ఆందోళనపడింది. ఆమె ప్రాణాలకు తెగించి మంచు గడ్డలుకట్టిన నదికి అడ్డుపడి ఒక మంచుగడ్డ మీద నుంచి ఇంకోదాని మీదకు దూకుతూ - కాళ్ళకు మంచువలన తగిలిన దెబ్బలతో గాయాలతో ఎట్లాగో నదినిదాటి ఓహైవో రాష్ట్రంలోకి చేరింది.

అక్కడ ఆమెకు సెనేటర్‌బర్డ్ తటస్థపడ్డాడు. అతడు మంచివాడే కాని కొన్ని పిచ్చినమ్మకాలున్నవాడు. డబ్బుపెట్టి కొనుక్కున్న బానిసల మీద యజమానికి అన్ని హక్కులూ ఉన్నవని అతని నమ్మకం. యజమాని కన్నుకప్పి తప్పించుకుని పారిపోతున్న బానిసలకు ఆశ్రయం ఇవ్వడం గాని సహాయం చెయ్యడం గాని నేరమన్న చట్టానికి అనుకూలంగా ఓటు చేసినవాడతడు. కాని దీనావస్థలో ఉన్న ఎలిజాను, ఆమె బిడ్డను చూడగా అతనికి కరుణ కలిగింది. బానిసలకు స్వేచ్ఛ ఇవ్వాలని ఉద్యమం నడుపుతూ - తన బానిసలకు స్వేచ్ఛ యిచ్చి-యితరుల బానిసలు తప్పించుకుని పారిపోవడానికి సహాయం చేస్తున్న హల్లిడే దంపతుల దగ్గరకు చేరుస్తాడు ఎలిజాను ఆమె బిడ్డనూ.

అక్కడ ఎలిజాకు ఆమె బిడ్డకూ ఆదరపూర్ణమైన ఆశ్రయం దొరికింది. అక్కడ హల్లిడే దంపతులు కృషి చేసి ఎలిజాకు ఆమె భర్త జార్జి హేరిస్‌తో పునస్సమాగమం కలిగిస్తారు. అతడు ఆయుధాలు ధరించి స్పెయిను దేశస్థునివలె చలామణీ-అవుతూ ఉంటాడు. అయితే డాన్‌హేలీ యిద్దరు సహాయకులతో అక్కడకు వస్తాడు. వాళ్ల లాకర్, మార్క్స్ అనేవాళ్ళు. వాళ్ళ వృత్తి తప్పించుకుని పారిపోతున్న బానిసల్ని వేటాడి పట్టుకోవడమే. అతి నిర్దయులు, పరమ దుర్మార్గులు వాళ్ళు.

వాళ్ళకు దొరకకుండా జార్జిహేరిస్, ఎలిజా

వాళ్ళ కుమారుడు మళ్ళీ పారిపోవలసి వచ్చింది. వాళ్ళకు ఫ్లెచ్చరు అనే సజ్జనుడొకడు సహాయ పడతాడు. వాళ్ళను డాన్‌హేలీ తన మనుషులతో వెంటాడి ఒక పర్వతప్రాంతంలో కలుసుకుని బంధింపబోతాడు. జార్జిహేరిస్ ఆయుధాలతో పోరాడుతాడు. ఫ్లెచ్చరు డాన్‌హేలీ 'మనిషినొకణ్ణి ప్రక్క లోతుగా ఉన్న లోయలోకి విసరివేస్తాడు. తరువాత జార్జిహేరిస్, ఎలిజా వాళ్ళ బిడ్డ పడవ మీద ప్రయాణం చేసి స్వేచ్ఛా వాతావరణంలోకి-కెనడాలోకి-వెళ్ళి చేరుతారు.

అంకుల్ టామ్ పరిస్థితి అంత సుఖంగా లేదు. అతడు షెల్బీ కమతం నుంచి బయటకు వచ్చినవేళ మహాకరుణా సన్నివేశం. ఛ్లో బావురు మంటుంది. షెల్బీ కుటుంబంలోని పిల్లలూ-బానిసల పిల్లలూ అంతా గగ్గోలుగా ఏడుస్తారు. జార్జిషెల్బీ-యజమాని కుమారుడు-భిన్నుడై-తాను ఏనాటికైనా టాంను మళ్ళీ కొని స్వేచ్ఛ ఇస్తానని ప్రమాణం చేస్తాడు. డాన్‌హేలీ మిస్సిసిపీ నది మీద పడవలో టాంను న్యూ ఆర్లియన్సుకి తీసుకుపోతుండగా బానిసల దుర్భరజీవిత సన్నివేశాల్ని ఎన్నిటినో టాం చూస్తాడు. బానిసలకు ఇవ్వబడిన ఇళ్లు పందుల కొట్టాలకు మల్లే పరమ అసహ్యంగా ఉంటాయి. వాళ్ళ కుటుంబాలు ఎప్పుడు ఎట్లా విడదీయబడతాయో యజమాని యిష్టం. బాధలు భరించలేని బానిసస్త్రీలు నదులలో దూకుతారు. చిన్న పిల్లల్ని తల్లుల నుండి లాక్కొని విక్రయాలు జరుగుతాయి.

సాధారణంగా సినిమా పిచ్చి కుర్రకారు లోనే వుందంటారు పెద్దవారు. కాని అది నిజంకాదు అని నిరూపించింది జుగా భాయ్. అనే అరవై ఏళ్ళ వృద్ధ వితంతువు. ఆవిడీ మధ్య ఓ సినిమాకి ('ముకద్దార్ కా సికందర్' హిందీ చిత్రం) ఒక థియేటర్లో అది ఆడినన్నాళ్ళు-అంటే-183 రోజులు వరసగా 183 సార్లు చూసి రికార్డు సృష్టించింది. ఆ చిత్రంలోని 'ఖవాలి' నృత్యం ఆమెని విశేషంగా ఆకర్షించిందట. ఆ చిత్రం చూడడానికి చివరిరోజున ఆమె వెళ్ళినప్పుడు థియేటర్ యాజమాన్యం ఆమెకి చీర, రవిక పెట్టి సత్కరించారు. ఇంతకీ ఆమె-వీధులలో అవీ యివీ అమ్ముతూ జీవనం గడిపే చిన్న 'వర్తకి'!



అన్నీ చూస్తూ టాం బైబిలు చదువుకుంటూ భక్తిగీతాలు పాడుకుంటూ మనశ్శాంతి పొందాలని ప్రయత్నిస్తాడు. కాని యీ దృశ్యాలు ఒక పట్టాన అతని మానసికస్థితిని విడచిపోవు. పడవప్రయాణంలో ఒక క్రొత్త పరిచయం. ఈవా అనే సుందరబాలిక ఆమె తండ్రి క్లేర్, మేనత్త ఓఫీలియా కూడా ఆ పడవలో ప్రయాణీకులు. ఈవా ప్రేమమయి. టాం ఆమెను దేవతగా చూస్తాడు. ఆమె పొరపాటున నదిలో పడిపోతే టాం నదిలోకి దూకి రక్షిస్తాడు. ఆమె ప్రోద్బలంతో క్లేర్-టాంను కొని తమవెంట తీసుకుపోతాడు.

క్లేర్ కుటుంబం చిత్రమైంది – అతడు ఇంటి పరిస్థితుల్ని పట్టించుకోడు. భార్య మూర్ఖురాలు. ఇంట్లో ఉంటున్న అతని దూరపు వరస చెల్లెలు ఓఫీలియా ఇల్లు నిర్వహిస్తూ ఉంటుంది. అక్కడ టాం జీవితం సుఖంగానే ఉన్నది. క్లేర్ కుమార్తె ప్రేమమయి సన్నిధిలో టాం కూడా క్రైస్తవ సర్వ మానవ ప్రేమ సిద్ధాంతాన్ని అనుభవంలోకి తెచ్చుకుంటాడు. టాప్సీ అనే ఒక బానిసపిల్లకు అబద్ధాలు చెప్పడం కనిపించిందల్లా దొంగిలించడం, దొరికిపోయి కొరడా దెబ్బలు తినడం సహజమై పోయింది. ఆమెను ఈవా తన దివ్యప్రేమతో మార్చగలిగింది.

ఈవాకు జబ్బుచేసింది. కాని ఆమెలో దివ్యత్వం వృద్ధి అయింది. ఆమె ప్రోద్బలంతో తండ్రి క్లేర్ టాంకు స్వేచ్ఛ యివ్వడానికి అంగీకరిస్తాడు. కాని వాయిదా వేస్తూ ఉండగా అకస్మాత్తుగా ఈవా క్రీస్తును చేరిపోయింది. ఆమె మరణం వల్ల ఒక దేవత కనుమరుగైందని టాంతో సహా అంతా విలపిస్తారు. తండ్రి క్లేర్ ఆ దుఃఖంతో కొన్నాళ్ళకే మరణిస్తాడు. అతని భార్య-భర్త అభిప్రాయాలకు భిన్నంగా బానిసలను ఒక బానిసవ్యాపారికి అమ్మింది. టాం కూడా అమ్ముడుపోయాడు. అతనితోపాటు ఎమ్మిలీన్ అనే పదునైదు సంవత్సరాల అందమైన బాలిక కూడా అమ్ముడు పోయింది. కొన్నవాడు సైమన్ లెగ్రే అనే పరమ క్రూరుడు. ఇదివరకే అతనికి కేసీ అనే బానిసకత్తె ఉన్నది. ఆమె స్థానంలో ఎమ్మిలీన్‌ను పెట్టుకుంటాడు. టాంను అతిభారమైన పనులకు ఉపయోగించి, చెయ్యలేకపోతే కొరడాలతో బాదుతాడు. టాంకు అతని బైబిలు అతని విశ్వాసమూ అండగా ఉన్నాయి. ఒకనాడు టాం జ్వరంగా ఉన్న బానిస స్త్రీ చేత పనిచేయించలేదని అతన్ని కొరడాలతో కొట్టించాడు. ఆ దెబ్బలకు టాం లేవలేకపోయాడు.

కేసీ ఎమ్మిలీన్ స్నేహితురాండ్రు అవుతారు. కేసీ ఎమ్మిలీన్‌ను లెగ్రీ పశుత్వం నుండి రక్షించాలనుకున్నది. పారిపోతే లెగ్రీ పెంచుతున్న భయంకరమైన కుక్కలు వెంటాడుతాయి. కేసీ ఒక పథకం పన్నింది. లెగ్రీ ప్రాంగణంలోనే ఒక ఇల్లు ఉన్నది. అక్కడ అతడనేక దారుణాలు చేశాడు. అందుచేత అక్కడ దెయ్యాలు చేరుకున్నాయన్న భీతి ఉండి ఆ యింటిలోకి పోడు. కేసీ ఎమ్మిలీన్ ఆ యింట్లో దాక్కున్నారు. వాళ్ళు ఎక్కడ ఉన్నారో తెలిసి చెప్పలేదని టాంను లెగ్రీ బాధించాడు. అతడు చనిపోతాడు. అయితే అతడు చనిపోయేముందు జార్జి షెల్బీ వచ్చి అతన్ని కొని తీసుకుపోతానన్నాడు. అయితే అది జరుగలేదు. అతడు టాంకు మాత్రం అంత్యక్రియలు చేసి లెగ్రీని చితకపొడిచి వెళ్లాడు.

ఈ హడావిడిలో తప్పించుకొని కేసీ ఎమ్మిలిన్ బయటపడి కెనడాకు ప్రయాణమైనారు. వాళ్ళకు త్రోవలో జార్జి షెల్బీ తటస్థపడి కాపాడుతాడు. ప్రయాణంలో వాళ్ళకు మేడం థేక్స్ అనే ఫ్రెంచి స్త్రీ కలుస్తుంది. మాటల సందర్భంలో ఆమె జార్జి హేరిస్ తన సోదరుడని, అతనికోసం వెతుకుతున్నానని-తను ధనవంతురాలై పిల్లలు లేని విధవరాలునని చెప్పుతుంది. జార్జి హేరిస్ వివరాలు వింటూ అతని భార్య ఎలిజా వివరాలు కూడా విన్న కేసీ తన కూతురే ఎలిజా అని తెలుసుకుంటుంది. కేసీ, ఎమ్మిలీన్, మేడం థేక్స్ కెనడా వెళ్ళి జార్జి హేరిస్‌ను అతని భార్యను కుమారుణ్ణి కలుస్తారు. అంతా సుఖసంతోషాలతో ఉంటారు.

లెగ్రీ పిచ్చివాడౌతాడు. జార్జి హేరిస్ తన భార్యతో, కేసీతో పుత్రునితో నైజీరియాకు వలస వెళ్ళి బానిసలకు స్వేచ్ఛకలిగించే ఉద్యమాన్ని నడుపుతాడు. కేసీ కొడుకు కూడా కన్పిస్తాడు. జార్జి షెల్బీ తన బానిసలందరికీ స్వేచ్ఛ యిచ్చి-పనికావాలన్నవాళ్ళకు జీతాల మీద ఉద్యోగాలిస్తాడు."

ఈ కథ కొంత సుఖాంతమైనప్పటికీ-గుండెలను కదిలించి కంటికి అశ్రుధారలు తెప్పించే బహు విషాదగాథా సంపుటి. □

# తల నూనెలు తయారు చెయ్యడం

కేశాలంకరణం ఒక ప్రకరణమనీ, కురూపికయినా కురులే అందమనీ అంటారు మన పెద్దలు. నిజానికి కురులు వనితలకు సిరులు. అగరు నూనెలతో కురులు దిద్దుకుని, మరులు గొలిపే మనోహర రూపం పొందవచ్చును. శిరోజాలు అందంగా ఒత్తుగా ఆకర్షణీయంగా పెరగాలంటే ఎన్నో జాగ్రత్తలు తీసుకోవాలి. వాటి పెరుగుదలకు, సంరక్షణకు రకరకాల నూనెలు ఉపయోగించటం అవసరం. ప్రస్తుతం మార్కెట్లో ఎన్నోరకాల తల నూనెలు చాలా ఖరీదుల్లో అమ్మబడుతూ వున్నాయి. వీటిని ఇంట్లోనే చౌకగానూ సులభంగానూ తయారు చేసుకోవచ్చును. వాటిల్లో కొన్ని రకాలు తయారు చేసే విధానాలు ఇక్కడ వివరిస్తున్నాను.

శిరోజాలు ఒత్తుగా, నల్లగా నిగనిగలాడుతూ వుండడానికి పోమేడ్ అనే సౌందర్య సాధనాన్ని ఉపయోగించవచ్చును. ఈ పోమేడ్‌ను తయారు చేయటానికి కావలసిన వస్తువులు : బాగా శుభ్రం చేయబడిన వ్యాసలైను మూడు పౌండ్ల పారఫిన్ మైనం నాలుగు అవున్సులు, కొబ్బరి నూనె మూడు అవున్సులు, తగినంత రోస్ ఆయిల్ కావాలి. పారఫిన్ మైనం వ్యాసలైను వెంట్రుకలకు మెరుపును చేకూర్చి నిగనిగలాడేట్లు చేస్తుంది.

పోమేడ్‌కు ఏదైనా రంగు వుంటేనే ఆకర్షణీయంగా కనపడుతుంది. పోమేడ్‌కు కలపడానికి ఏ రంగులు పడితే వాటిని ఉపయోగించకూడదు. పోమేడ్ పచ్చని రంగులో వుండాలంటే క్లోరోఫిల్ అనే రంగును కలపాలి. ఎరుపు రంగులో వుండాలంటే ఆల్కనట్ రూట్ అనే రంగును కలపాలి. రోస్ కలరులో వుండాలంటే టించర్ కార్‌మైన్ అనే పదార్థం కలపాలి.

ఏ రంగును వేయాలనుకుంటామో ఆ రంగును ముందుగా పొడికొట్టి పెట్టుకోవాలి. ఈ పొడిని ఒక పల్చని, తెల్లని గుడ్డలోకి వేసి మూటకట్టి, ఆ మూటను కొబ్బరి నూనెలో మునిగేలా వేసి వుంచాలి. ఈ విధంగా సుమారు ఎనిమిది గంటలసేపు ఊరనివ్వాలి. అపుడు కొబ్బరినూనెకు రంగు వస్తుంది. ఈ కొబ్బరినూనెను అలాగే ఓ వైపు పెట్టాలి.

ఇప్పుడు పారఫిన్ మైనం చాకుతో సన్నగా కోసి బాగా పొడిపొడిగా చేసి పెట్టుకోవాలి. దీనిని ఒక శుభ్రమైన పాత్రలోకి వేసి, పొయ్యిపై పెట్టి సన్నని మంటపై కరిగించాలి. పారఫిన్ మైనం కరుగుతూ వున్నప్పుడు అందులోకి వ్యాసలినీ వేయాలి. మరో రెండు నిమిషాలకు రంగుగా అయిన కొబ్బరినూనెను కూడా పోసి ఒకసారి బాగా కలియపెట్టాలి. కలియపెట్టిన తర్వాత ఒక్క నిమిషం వుండనిచ్చి పొయ్యిపైనుంచి దించేయాలి. ఈ మిశ్రమం చల్లారేలోగానే రోస్ ఆయిల్‌ను పోసి మరోమారు బాగా కలపాలి. ఇదే పోమేడ్. ఈ పోమేడ్ మిశ్రమం ద్రవస్థితి నుంచి ఘనస్థితికి మారేలోగా సీసాల్లోకి పోసి మూత గట్టిగా పెట్టేయాలి. అంటే రోస్ ఆయిల్ కలిపిన కొన్ని నిమిషాలలో సీసాల్లోకి నింపి మూత పెట్టేయాలన్న మాట. ఉపయోగించేటప్పుడు దీనిని వ్రేళ్ళతో కొంచెం తీసుకుని తలకు రాసుకోవచ్చును.

తెల్ల వెంట్రుకలు గలవారు ఇపుడు విచారించవలసిన పనిలేదు. చక్కగా వెంట్రుకలకు నలుపు రంగు డై చేసుకోవచ్చును. ఈ నలుపురంగు ద్రవ మిశ్రమాన్ని కూడా ఇంట్లోనే తయారు చేసుకోవచ్చును. ఇది తయారు చేయటానికి కావలసిన వస్తువులు :

నైట్రేట్ ఆఫ్ కాపర్ 2 గ్రాములు, నైట్రేట్ ఆఫ్ సిల్వర్ 196 గ్రాములు, శుభ్రమైన నీరు 168 గ్రాములు, అమోనియా నీరు 252 గ్రాములు.

ముందుగా నీటిని ఒక పాత్రలోకి తీసుకుని దానికి నైట్రేట్ ఆఫ్ కాపర్, నైట్రేట్ ఆఫ్ సిల్వర్‌లను పోసి బాగా కరిగించాలి. తర్వాత అమోనియా నీటిని కొద్దికొద్దిగా పై మిశ్రమంలోకి పోస్తూ కరిగించాలి. ఇవన్నీ ఒకదానితో ఒకటి కలిసిపోయేలా బాగా కలియపెట్టాలి. ఇప్పుడు నలుపురంగు మిశ్రమం తయారైంది. ఈ రంగును ఒక చిన్న బ్రష్ సహాయంతో అద్దుకుని వెంట్రుకలకు రాసుకోవాలి. ఈ రంగు మిశ్రమం బట్టల పై పడితే మరకలవుతాయి. కాబట్టి దీనిని ఉపయోగించేటప్పుడు నిదానంగా, జాగ్రత్తగా ఉపయోగించాలి. దీనిని చిన్న సైజు సీసాలలో పోసి మూతలుపెట్టి నిల్వచేయాలి.

కొంతమందికి వెంట్రుకలు ఊడిపోతుంటాయి. మామూలుగా దువ్వుకుంటున్నప్పుడు కొన్ని, తలంటుపోసుకునేటప్పుడు మరిన్ని వెంట్రుకలు ఊడిపోవడం జరుగుతూ వుంటుంది. వెంట్రుకలు ఊడిపోవడాన్ని నివారించటానికి ఒక తైలం ఉపయోగించవచ్చును. దీనికి కావలసిన వస్తువులు :

మేస్ ఆయిల్ ఒక అవున్సు డియోడరైజ్డ్ ఆల్కహాల్ ఒకటిన్నర పైంట్, కొద్దిగా రోజ్ ఎసెన్సు కావాలి.

ఈ మూడింటిని ఒక పాత్రలోకి పోసి బాగా కలిపి, సీసాలలోకి పోసి నిల్వ చేసుకుని, ఉపయోగించవచ్చును. అప్పుడప్పుడు ఈ తైలాన్ని ఉపయోగిస్తూ వుంటే వెంట్రుకలు ఊడిపోవడమనేది జరగదు.

ఇలాంటి తైలాన్నే మరో రకంగా కూడా తయారు చేయవచ్చును. దీనికి కావలసిన వస్తువులు:

ఆలివ్ ఆయిల్ నాలుగవున్సులు, సొల్యూషన్ ఆఫ్ అమ్మోనియా ఎనిమిది డ్రాములు, టించర్ ఆఫ్ కాంథారిడెస్ నాలుగు డ్రాములు, బై కార్బనేట్ ఆఫ్ పొటాష్ ఆరు డ్రాములు కావాలి.

పైన చెప్పిన నాల్గింటినీ ఒక సీసాలోకి పోసి బాగా ఝూడించి కలపండి. నాలుగూ బాగా కలిశాక సీసాల్లోకి పోసి మూతలు గట్టిగా బిగించండి. ఈ మిశ్రమాన్ని అప్పుడప్పుడు నూనెలా ఉపయోగిస్తూ వుంటే వెంట్రుకలు రాలకుండా వుంటాయి.

రోజూ వాడకానికి ఘుమఘుమలాడే నూనె ఒకటి తయారుచేసే విధానం చెపుతాను. మీ శక్తికి అందుబాటులో వున్నట్లుగా మంచి కొబ్బరినూనెను తీసుకోండి. దానికి తగినంత మల్లెపూల నూనె సెంటు తీసుకుని కొబ్బరినూనెలో కలపండి. మల్లెల సౌరభం వెదజల్లుతున్న నూనె తయారయింది. దీనికి కూడా ఇంతకు ముందు చెప్పిన విధంగా, కావలసిన రంగును వేసుకోవచ్చును. సువాసనగాను, చూడటానికి ఇంపుగానూ వుంటుంది. హెయిర్ ఆయిల్ సీసాల్లో పోసి పెడితే అచ్చంగా బజార్లో కొనుక్కు వచ్చిన హెయిరాయిలని చెపితే ఎవ్వరూ అనుమానించరు.

గమనిక :

1 పౌండు = సుమారు 453 గ్రాములు
1 అవున్సు = సుమారు 28 గ్రాములు
1 పైంట్ = సుమారు 473 మిల్లీలీటర్లు
1 డ్రాము = సుమారు 1.8 గ్రాములు

—గార్ల సరస్వతి

## ''కూలా'' మసాలా కూర

**'కూలా' చేసేందుకు కావలసిన వస్తువులు : శెనగపిండి 1 కప్పు; వెల్లుల్లి 4 రేకులు; పసుపు చిటికెడు; నెయ్యి 3 టేబుల్ స్పూన్లు; మిర్చి నాలుగు; ఉప్పు, అల్లం, కొత్తిమెర.**

మసాలా చేసేందుకు :

**ఉల్లిపాయలు రెండు; టొమాటోలు రెండు; గరం మసాలా పొడి 1 స్పూను; ఉప్పు, నూనె, అలంకరణకి 1 స్పూన్ కొబ్బరికోరు, కరివేపాకు.**

చేయవలసిన విధానం : (''కూలా'') మిర్చి, అల్లం, వెల్లుల్లి, పసుపు, కొత్తిమెర కచ్చాబచ్చాగా నూరాలి. నూరిన మసాలాలో శెనగపిండి, ఉప్పు, కలిపి చపాతీ పిండిలా కలపాలి. కొంచెం నెయ్యి వేస్తే రుచిగా వుంటుంది. పిండిని 6 భాగాలుగా విడదీయాలి. పిండిని రోల్స్‌గా చేసి ఆవిరిపై ఉడికించాలి. ఉడికిన ముక్కలను నూనె లేదా డాల్డాలో వేయించాలి.

మసాలా చేయు విధానం : ఉల్లి, టొమాటో లను సన్నగా పొడవుగా కోయాలి, నూనె కాచి కోసిన ముక్కలు వేసి ఉప్పు, గరం మసాలాపొడి వేసి కలిపి వేయించాలి. తయారైన " కూలా " ముక్కలను ఈ మసాలాలో వేసి వేయించాలి. 5 ని॥ల తర్వాత దింపాలి. ఆవాలు, కరివేపాకు వేయించి పైన చల్లాలి. కొబ్బరి తురుము కూడా అలంకరించి వేడివేడిగా తినాలి.

### సూరత్

**కావలసిన పదార్థాలు : మాంసం - $\frac{1}{2}$ కిలో, ఉల్లిగడ్డ-1, వెల్లుల్లి-ముడు పాయలు, యాలకులు-6, లవంగాలు-6, ఎండుమిరపకాయలు-4, అల్లం, ఉప్పు, నెయ్యి, నూనె తగినంత**

తయారుచేయు విధానం : మాంసం బాగా కడిగి ముక్కలుగా చేసుకోవాలి. ఉల్లిపాయ ముక్కలు, లవంగాలు, యాలకులు, వెల్లుల్లి, అల్లం, ఎండు మిరపకాయలు అన్నీ కలిపి నూరాలి. ఒక పాత్రలో కాస్త నెయ్యిపోసి అది కాగిన తర్వాత అందులో ఉల్లిముక్కలు వేసి వేయించాలి. ఆ తరువాత దాంట్లో మాంసం ముక్కలు, నూరిన మసాలా వేసి కలపాలి. ఇప్పుడిహ ఉప్పు వేసి కొంచెం నీరుపోసి సన్నటి సెగపై ఉడికించాలి. మసాలా అంతా గట్టిపడ్డాక స్టవ్ మీద నుంచి దింపాలి. ఇలా చేసుకున్న సూరత్ మసాలా మీద కొత్తిమిర తరిగి చల్లుకోవాలి. ఉల్లిపాయ చక్రాలుగా తరిగి దీనిపై అమరిస్తే చూడడానికి బాగుంటుంది. తినడానికి రుచిగా వుంటుంది. —వల్లి శ్రీ నాగరాజు

# వంటలు



ఉందూ్య :

ఉంద్యూ అంటే మిక్స్‌డ్ కూర. ఇందులో చాలా రకాల కూరగాయలు వాడ్తారు. చలికాలంలో ఉంద్యూలేని శుభకార్యం కాని, పిక్నికు కాని, పార్టీ కాని వుండదు. యిది గుజరాతీ వారికి చాలా ముఖ్యమైన వంటకం. ఈ ఉంద్యూ చలికాలంలోనే చేయడంలోని ఉద్దేశం ఏమంటే, చలికాలంలో అన్నిరకాల కూరగాయలు తాజాగా, చౌకగా దొరకు తాయి. కనుక ఈ వంట పూరీ, చపాతీ, అన్నం లోకి లేక టిఫిను లాగా తినడానికి కూడా చాలా బాగుంటుంది.

కూరలు : ముఖ్యమైనవి వంకాయలు $\frac{1}{2}$ కిలో; $\frac{1}{2}$ కిలో బంగాళాదుంపలు, (ఈ రెండు చిన్న సైజులో ఉంటే ఆపళంగా నాలుగు గాట్లు పడేసి వాడచ్చు) పందిరి చిక్కుడు కాని బీన్స్ కాని, పచ్చి బఠానీ గింజలు, దొండకాయలు, సొర, కాలీఫ్లవర్, టొమాటోలు 4 పెద్దవి. టొమాటోలు, వంకాయలు వదిలేసి మిగిలిన కూరల ముక్కలు తలో కప్పు ఉండేచాలు. పచ్చిమిరప నాలుగు పొడవుగా తరుక్కొని ఉంచుకోవాలి. కొత్తిమిర ఒక అర కప్పు; కొంచం కరివేపాకు; మెంతాకు (తరిగినది) అర కప్పు.

మిగిలిన మసాలా : ధనియాలు 2 స్పూన్లు, జీలకర్ర $\frac{1}{2}$ స్పూను కలిపి పొడిగొట్టి వుంచాలి. కారం $\frac{3}{4}$ చెమ్చా; చక్కెర $1\frac{1}{2}$ చెమ్చా; చిటికెడు సోడా; కొంచం పసుపుపొడి; నూనె 1 కప్పు; శనగపిండి 1 కప్పు; ఆవాలు, జీలకర్ర చెరొక స్పూను; తగినంత ఉప్పు.

బంగాళాదుంపలు చెక్కు తీసి ముక్కలు తరిగి ఉంచుకోవాలి. మిగిలిన కూరలు పెద్ద ముక్కలుగా తరగాలి. నేను రాసినవన్నీ వెయ్యాలని లేదు. జిగట వచ్చే కూరలు పనికిరావు. ఏవో నాలుగు కూరలు వేసుకుంటేచాలు. వాడే కూరలనుబట్టి, మనం వాడబోయే మసాలా ఎంత వేయాలి-అన్నది ఆలోచించాలి. నేను యిచ్చిన మసాలా పాళ్ళు వంకాయలు ప్లస్ యింకో మూడు కప్పుల ఏ కూర ముక్కలైనా ఫరవాలేదు. లేక అన్నిరకాలు $\frac{1}{2}$ కప్పు ముక్కలు చొప్పున వేయచ్చు.

ముఠియాలు : తరిగిన మెంతాకు, శెనగపిండి, తగినంత ఉప్పు, చిటికెడు కారం, వంట సోడా వేసి పూరీ పిండిమాదిరి కొంచెం నీటిలో తడిపి ముద్ద చేయాలి. పిండి ముద్దకు కొంచం నూనె పైన అద్ది, రొట్టెల పీటపై అరచేతుల్లో అటూ యిటూ రోల్ చేస్తే పొడుగు కర్రవలె పిండి సాగుతుంది. దాన్ని 1 అంగుళం పొడవున ముక్కలు కోసి, అర కప్పు నూనె, బాణలిలో పోసి కాచి, దానిలో కోసి వుంచుకున్న ఈ ముఠియాలు దోరగా కాల్చి ప్రక్కన తీసిపెట్టి వుంచుకోవాలి.

పెద్ద వెడల్పాటి కళాయి గిన్నె పొయ్యి మీద వేసి మిగిలిన అర కప్పు నూనె వేసి, ఆవాలు జీలకర్ర వేసి, అవి చిటపటలాడేక కరేపాకు వేసి, తర్వాత ముందుగా వంకాయలు, కాలీఫ్లవరు బంగాళాదుంపలు వేసి 5 నిమిషాలు మగ్గిన తర్వాత మిగిలిన కూర ముక్కలు వేసి, వాటిపై ధనియాల జీలకర్రపొడి, కారం పొడి, పచ్చిమిర్చి ముక్కలు, పసుపుపొడి, చక్కెర వేసి బాగా కలిపి 1 గ్లాసు నీరు వేసి మూతబెట్టాలి. సన్ననిమంటపై ఉడికించాలి. 10 నిమిషాలు కానిచ్చి ఉంద్యూకు తగినంత ఉప్పు వేసి, గరిటెకాడతో ముక్కలు చితికిపోకుండా కలపాలి. అప్పుడప్పుడు జాగ్రత్తగా కలిపి, కూరల ముక్కలన్నీ ఉడికాయి అన్న తర్వాత కొత్తిమిర, వేయించిన ముఠియాలు, వేయించిన నూనె, అన్నీ ఉంద్యూలో వేసి కలపాలి. 2 నిమిషాలు అన్నీ కలిసి వుడికిన తర్వాత ఉంద్యూ తయారవుతుందన్నమాట. —పద్మిని పాలూర్



# బామ్మగారి పేజీ

"ఇల్లు" అన్నది రెండు అక్షరాల మాటే కావచ్చుగాని, అందులో ఎంతో పవిత్రత వుంది. మనం నివసించేది ఇంట్లోనే కాబట్టి, ఇల్లు ఎంత పరిశుభ్రంగా శుచిగా, పెట్టుకోవాలి అన్నది - ఎవరూ చెప్పనవసరం లేదు. ముఖ్యంగా ఇంట్లోని గదులు– వంట గదీ, పడక గదీ మరీ పరిశుభ్రంగా వుండాలి. మనిషికి నిద్ర ఎంతో అవసరం గదర్రా మరి, నిద్ర పోయే గది, దాని పరిసరాలూ ఎంత శుభ్రంగా, చక్కగా వుంచుకోవాలి! గదిలోకి మంచి గాలి వచ్చేలా చూసుకుంటాం – ఎందుకని? చక్కని ఆరోగ్యం కోసం. అలాగే వంట గది. వంట గదిలో మనం తినే ఆహారం తయారు చేసుకుంటాం. తినే ఆహారం ఎంత శుభ్రంగా, నిరపాయకరంగా వుండాలి! అందుకని వంటగది ఎప్పటికప్పుడు చక్కగా శుభ్రం చేసుకుంటూ, చక్కగా పెట్టుకోవాలి. కొందరి వంటగదులు చూస్తే చాలా అపరిశుభ్రంగా కనిపిస్తూ వుంటాయి. గోడలకి మసి, కింద అంతా జిడ్డు, పైన బూజులు, అక్కడక్కడా గంజివార్చిన నీళ్ళు, వాటిలో ఈగలు - ఇలా అపరిశుభ్రంగా వుంటే, అది ఎంత అనారోగ్యకరం! అయితే, పెద్ద పెద్ద వంటిళ్ళుండాలి, అంతా అంతా దొరల పద్ధతిలో వుండాలి అని నేనన్ను - ఉన్నదాంట్లోనే శుభ్రత చూసుకోవచ్చు గదా.

వంటిల్లు అనగానే వంట పదార్థాలన్నీ వుండే చోటు గనక, ఈగలు, దోమలు, బొద్దెంకలు, ఎలుకలు, చీమలు, బల్లులు - ఇవన్నీ మసలడానికి అవకాశం వుంది. ఎప్పటికప్పుడు వంటగది శుభ్రం చేసేసుకుంటూ వుంటే, వీటి బెడద తప్పుతూ వుంటుంది.

మనవాళ్ళు వంటగదికి కొన్ని లక్షణాలుండాలని చెప్పారు. ఇంటికి ఆగ్నేయ దిశలో వంటగది వుండాలన్నారు. కిటికీలుండాలన్నారు; పొగ పోవడానికి పైన మార్గం వుండాలన్నారు; వంటపాత్రలు, వంట గదీ ఎప్పుడూ శుభ్రంగా వుండాలన్నారు. అలాగే వంటచేసే వారు కూడా - మన యిళ్ళలో తల్లో, బామ్మో ఎవరో ఒకరు చేస్తారు - ఎంతో శుచిగా శుభ్రంగా వుండాలి. 'స్నానం చెయ్యకుండా వంట చెయ్యడం, స్నానం చేస్తే వంటగదిలోకి వెళ్ళి తల తుడుచుకోడం-లాంటి వేవీ చెయ్యకూడదన్నారు. అలా అక్కడికెళ్ళి తల తుడుచుకుంటే, తల వెంట్రుకలు రాలి పడతాయి. అందుకనే, వంట యింట్లో తల తుడుచుకోకూడదు; తల దువ్వుకోకూడదు. పూర్వం రాజులు తమ దగర వంట వాళ్ళని పెట్టుకునేటప్పుడు, వాళ్ళకి విధిగా తలపాగలో, టోపీలో వుంచేవారు – తలవెంట్రుకలు పడకుండా వుంటాయని. ఈ అలవాటు ఇప్పటికీ వుందటర్రా - అవేవీ, పెద్ద పెద్ద హోటళ్ళలో వడ్డన చేసేవారూ, వంట చేసేవారూ పొడుగాటి టోపీలు పెట్టుకుంటార్ట! వంటవాళ్ళకి గోళ్ళు కూడా పెద్దగా లేకుండా చూసేవారుట రాజులు. వాళ్ళ ఆరోగ్యాలు ఎలా వున్నాయని ఎప్పటికప్పుడు పరిశీలించడానికి వాళ్ళమీద వైద్యుల్ని పెట్టేవారట. వంట వాళ్ళందరూ వైద్యుల సూచన ప్రకారం నడుచుకునేవారట. అయినా-రాజులు తాము అన్నం తినే ముందు, అందులో ఏదైనా విషం లాంటిది కలిసి వుందేమోనని, ముందుగా కాకులకో, జంతువులకో వేసేవారట.

ఆ విధంగా వంట చేసేవారికి రాజులు అంతటి ప్రాముఖ్యత ఇచ్చారు. కదర్రామరీ, ఆహారంవల్లనే మనం బ్రతుకుతున్నాం - ఆ ఆహారం వంట ఇంట్లోంచి వస్తుంది. అలాంటప్పుడు వంట గదికి ఎంత ప్రాముఖ్యత ఇవ్వాలి?

బల్లులు, దోమలు, సాలెపురుగులు తక్కిన పురుగులు ఇవన్నీ ఆహార పదార్థాల్లో పడకుండా చేసుకోవాలంటే, ముందు వంటగదిలో అలాంటి పురుగులేవీ లేకుండా జాగ్రత్తపడాలి. ఐనా మనకు తెలియకుండానే ఒక్కోసారి ఆహార పదార్థాలు విషపూరితాలయిపోతాయి. అన్నం తిన్న తర్వాత కడుపులో దేవినట్టుగా వుండడమూ, వాంతి రావడమూ, విరేచనాలు కావడం మొదలైనవి - విష లక్షణాలు. అలా జరిగినప్పుడు, వెంటనే డాక్టరు దగ్గరికి పరుగెత్తాలి. ఇలాంటి వాటికి ఇంటి వైద్యాలు కూడా వున్నాయనుకోండి. అయినా, అది ఎలాంటి విషమో తెలుసుకోకుండా, మనం ప్రయోగాలు చేస్తూ కూచోలేముకదా!

మనం వార్తా పత్రికల్లో చూస్తూనే వుంటాము - 'విషాహారంవల్ల ఇంతమంది మృతి' అని! ఆ ఆహారంలో ఎలాంటి విషం కలిసి వున్నదీ ముందుగా చెప్పలేం. ఒక్కోసారి ఏవైనా విష కీటకాల మూలంగా ఆహారం విషపూరితం కావచ్చు. పాత్రలు పరిశుభ్రంగా లేకపోతే కావచ్చు; ఇత్తడి గిన్నెల్లో చింతపండు కలిసిన పదార్థాలు పోసినప్పుడు కావచ్చు. ఆహారం నిలవ వుండడంవల్ల కావచ్చు. ఇలా ఎన్నో కారణాలుంటాయి. మన అజాగ్రత్తవల్ల ఆహారం విషమయమై దానివల్ల ఆపద తెప్పించుకునే పరిస్థితి ఎందుకు కల్పించుకోవాలి?—

వంటగదిని ఎప్పుడూ శుభ్రంగా వుంచుకోండి. అయితే మీకు తెలియదని కాదర్రా నే చెప్పడం— మీకు మరోసారి జ్ఞాపకం చేస్తున్నాననుకోండి. వండిన ప్రతి వస్తువు మీదా విధిగా మూతలు పెట్టండి. కూరగాయలు తరిగేటప్పుడు, కాస్త కుళ్ళినట్టు కనిపించినా, పారేయండి. పొద్దున వండుకున్న పదార్థాలు సాయంకాలం తినడం వరకూ పర్వాలేదు; మర్నాటివరకూ వుంచకండి. (పచ్చడి ఊరగాయల్లాంటివి కాదు) వండే ముందు ప్రతి పదార్థాన్నీ శుభ్రమైన మంచినీళ్ళతో కడగండి. కొందరు మన పెరట్లోని కరివేపాకే గదా అని నిర్లక్ష్యం చేస్తారు. దాన్ని కూడా శుభ్రంగా కడిగిన తర్వాతనే పదార్థాల్లో వేసుకోవాలి. ఇలాంటి విషయాలు మీకు తెలియవని కాదు. పెద్దలందరూ

చెప్పేమాటే. నేనూ మరోసారి చెబుతున్నాను. మీరు మీ పిల్లలకి చెబుతారు; వాళ్ళు వాళ్ళ పిల్లలకి చెబుతారు. ఆయురారోగ్యాలను ఇచ్చే 'వంటగది' గురించి ఎవరు చెప్పినా ఎన్నిసార్లు చెప్పినా తప్పేముందర్రా? —

## ప్రశ్నలకు జవాబులు

**ఆర్. ఇందిర, కోరగుంటపల్లె**

స్త్రీ వధువుగా మారిన క్షణం నుంచి నల్లపూసలు, మట్టెలు ధరించాలంటారు కదా–ఎందుకని తెలిపేది.

ఆమెకు పెళ్ళయినట్టు తెలియడం కోసం. అది–అనాదిగా వస్తున్న ఆచారం.

**కె. జి. సరళకుమారి, కుప్పం**

ఆవు, దూడకు కట్టిన తాడు దాటి ఎవ్వరూ అవతలికి వెళ్ళరాదంటారు. ఎందుకని?

దాటడంలో పొరపాటయితే, దభీమని పడతాము. మనతోపాటు ఆవు మెడకీ దెబ్బ తగుల్తుంది. కదూ!

**జి. రమణీమణి, ఖర్గపూర్**

ఆడపిల్లని వయస్సూ, మగవాళ్ళని జీతం అడగకూడదంటారు - ఎందుకని బామ్మగారూ?

ఆడవాళ్లు వయసు దాచుకోవాలనుకుంటారు – మగవాళ్ల కంటె. ఎంచేతంటే, మగాళ్లు కనిపించరుగాని, ఆడవాళ్లకి తొందరగా పెద్దతనం వచ్చేసినట్టు కనిపిస్తుంది–నిజానికి ఆటే వయసు లేకపోయినా. అంచేత, వయసు తక్కువగా చెప్పడమో, చెప్పక పోవడమో చేస్తూ వుంటాము. ఏమైనా, చాలామందికి తమ వయస్సు చెప్పాలని వుండదు – అందుకని అడగకూడదు. అలాగే మగాళ్ళ జీతాల విషయం కూడా. అయితే, ఇవాళ ఆడవాళ్లు కూడా బాగా వుద్యోగాలు చేస్తున్నారు గనక, వాళ్ళనీ జీతాల విషయం అడగకూడదు; వయస్సు లాగానే. మరి మనలో మాటర్రా–మగాళ్లని కూడా వయస్సుల విషయం అడక్కూడ దట!



**సి. రమాదేవి**

మద్రాసులోని ప్రముఖ సాంస్కృతిక సంస్థ 'కళాసాగర్' ఇటీవల 'ఉద్యోగం స్త్రీ లక్షణం' అనే అంశంపై నిర్వహించిన వక్తృత్వపు పోటీలలో కుమారి చోడవరపు రమాదేవి 'ఉత్తమ వక్త'గా ఎన్నికై కళాసాగర్ లిటరరీ అవార్డు పొందింది. మద్రాసు క్వీన్‌మేరీస్ కళాశాలలో - బి. ఏ. (సోషల్ సైన్సెస్) చివరి సంవత్సరం చదువుతున్న రమాదేవికి వ్యాసరచన పోటీలన్నా, వక్తృత్వపు పోటీలన్నా అమిత ఉత్సాహం. ఆమె ఆరవ తరగతి చదువుతున్నప్పుడే అంతర్ పాఠశాల వక్తృత్వపు పోటీల్లో ప్రథమ బహుమతి సంపాయించింది. అప్పటినుంచి కుమారి రమాదేవి వివిధ పోటీలలో దాదాపు పాతిక బహుమతులు పొందడం చెప్పుకోదగ్గ విశేషం! 'పుస్తక పఠనం, వీణావాద్యం, కథలు రాయడం అంటే నాకు ఇష్టం' అంటుంది రమాదేవి.

**యస్. రాజేశ్వరమ్మ, ఉంగుటూరు**

ఏమండి బామ్మగారూ! సంవత్సరంలో రెండు సార్లయినా నేరేడుపండు తినాలంటారు. ఎంచేతనండీ?

నేరేడుపండు తినడం మంచిదేనమ్మా—చలవ చేస్తుంది, గుండెకి మంచిది. కాని ఎక్కువగా తింటే, గొంతు పట్టుకుపోతుంది; విరేచనాన్ని బంధిస్తుంది. అయితే, నేరేడు–క్రిముల్ని నాశనం చేస్తుంది. అంచేత మనం ఎప్పుడైనా ఒకసారి మందుగానైనా తీసుకోవాలంటారు. ఇంకోటి కూడా చెబుతారు–పొరపాటున ఆహారంతో తల వెంట్రుక ఏదైనా, లోపలికి పోయిందనుకోండి — అది పేగుల్లోనో ఎక్కడో చుట్టుకుపోవచ్చు — అలాంటి దానికి నేరేడుపండు విరుగుడు — అంటారు. అలా, లోపల ఎక్కడయినా తల వెంట్రుక వుంటే— నేరేడుపండు దాన్ని తిన్నగా మలమూత్ర కోశాలవేపు తీసుకుపోయి, బయటికి పోయేలా చేస్తుందిట!

**యమ్. ప్రసూనాంబ, దిండిగల్లు**

నేను చాలాకాలంగా మలబద్ధంతో బాధపడుతున్నాను. ఏవో ఇంగ్లీషు మందులు తీసుకున్నా - అప్పటికప్పుడు 'బద్ధం' తగ్గినా - మళ్ళీ కొన్నాళ్ళకు వస్తోంది. ఇంగ్లీషు మందుల కంటె, మన వైద్యంలోనే ఏవో మంచి మందులున్నాయన్నారు. మీకేమైనా తెలిస్తే చెబుతారా?

దానికి మందులు చాలా వున్నాయమ్మా— అయితే, కొంతకాలం పాటు — మలబద్ధం తగ్గిపోయినా కూడా ఈ మందుల్ని వాడాలి. ఇలాటి రోగం వున్నవాళ్ళు గోధుమ అన్నం తినడం మంచిది. లేదా, రాత్రి పూట అన్నం మానేసి గోధుమ చపాతీలు తిన్నా మంచిదే. అయితే మనవాళ్లు–రాగి చెంబులో రాత్రి నీళ్ళు పోసి, తెల్లవారు ఝామునే లేచి, 5, 6 గుక్కలు ఆ నీళ్లు తాగమంటారు. ఆ నీళ్ళు విరేచనాన్ని జారీ చేస్తాయని. అలాగే ఉదయమే తాంబూలం వేసుకుని మంచి నీళ్ళు తాగినా విరేచనం అవుతుందంటారు. ఏమైనా ఇవన్నీ తాత్కాలికాలు. అలా కాకుండా చితగ్గొట్టిన అల్లం, జీలకర్ర నేతిలో వేయించి బెల్లం కలిపితే, లేహ్యంలా అవుతుంది. ఈలేహ్యాన్ని ఉసిరికాయంత వుండ చొప్పున, కొన్నాళ్ళపాటు పరగడుపున పుచ్చుకోండి. అయితే, మీరు ఎక్కువగా విరేచనాలకి మందులు పుచ్చుకుంటున్నారేమో — అది మాత్రం చెయ్యకండి. ఆ మందులు ఎక్కువ కావడంవల్ల కూడా– మలబద్ధం ఎక్కువ అవుతుంది!

# సంగతులు

జర్మనీకి చెందిన ఎడిత్ ఎరీకా అనే అందాల యువతి జయపూర్‌కు చెందిన గోపాల్‌సింగ్ అనే రిక్షావాలాను ప్రేమించి పెళ్ళి చేసుకున్న ఉదంతాన్ని ఇటీవల అన్ని వార్తా పత్రికలూ పతాక శీర్షికలతో ప్రచురించాయి. ఆ వార్తను చదివినవారంతా ప్రేమకు కళ్లేకాదు—ఎల్లలూ లేవని వ్యాఖ్యానాలు చేశారు. మరి కొందరు—విదేశీయులకు భారతదేశపు సంస్కృతిపట్ల గల అనురాగానికి ఇది తార్కాణం అని భుజాలు ఎగురవేశారు. అయితే ఆ తర్వాత జరిగిన సంఘటనలు ఇవన్నీ 'ఊకదంపుడే' అని నిరూపించాయి! రాజస్థాన్‌లో మారుమూల గ్రామానికి చెందిన యువకుడు గోపాల్‌సింగ్. బ్రతుకుతెరువు కోసం జయపూర్ వెళ్ళి రిక్షా నడపడం ప్రారంభించాడు. కొన్నాళ్లకు సొంతంగానే ఒక సైకిల్ రిక్షా కొనగలిగాడు. జయపూర్‌కు విదేశీ యాత్రికులు ముఖ్యంగా హిప్పీలు ఎక్కువగా వస్తూ వుంటారు. వారితో తనకు వచ్చీరాని ఇంగ్లీషులో మాట్లాడుతూ వారి నుంచి మంచి బేరాలు రాబట్టేవాడు గోపాల్‌సింగ్. ఓ రోజు ఎడిత్ ఎరికా అనే జర్మన్ యువతీ అలాగే పరిచయమైంది. ఆమె తరచూ గోపాల్ రిక్షాలోనే రాకపోకలు సాగించడం వల్ల వారి మధ్య పరిచయం బాగా పెరిగి ప్రేమగా మారింది. ఈ పరిచయాన్ని పురస్కరించుకుని తన 'వీసా' ముగియబోతోందనీ, తను గోపాల్‌ను పెళ్ళాడితే తప్ప భారతదేశంలో వుండడం సాధ్యం కాదని ఎరీకా ఓ రోజు చాలా బెంగపడిపోతూ చెప్పింది. గోపాల్ సంతోషంతో "ఆర్య సమాజ పద్ధతి"లో ఆమెను పెళ్ళి చేసేసుకున్నాడు. గోపాల్ స్వగ్రామానికి వెళ్ళి - తల్లిదండ్రుల ఆశీస్సులు పొంది జయపూరు నుంచి తిరిగి వస్తూండగా — దారిలో పోలీసులు ఎరీకాను అరెస్టు చేశారు. 1976 సం॥ లోనే ముగిసిపోయిన 'పాస్ పోర్ట్' తారీఖులను 1979 సం॥కి దిద్దుబాటు చేసి ఆమె మోసం చేసిందనీ; అందుకు జైలు శిక్ష తప్పదనీ; విచారణ ముగిసేవరకు జైల్ నుంచి వదలాలంటే నగదుగా పదివేలరూపాయలు చెల్లించాలనీ కోర్టు ఉత్తరువు జారీ చేసింది. గోపాల్ కిందా మీదాపడి ఎలాగో డబ్బును సేకరించి కోర్టువారికి చెల్లించడానికి సిద్ధమయ్యాడు. దీనికి తోడు - "గోపాల్‌సింగ్ అనే వ్యక్తి తన భర్తగా చెప్పుకుంటూ నన్ను బ్లాక్ మెయిల్ చేయడానికి కుట్ర చేస్తున్నాడు" అని తన వకీలు ద్వారా కోర్టుకు విన్నవించిందిట ఎడిత్ ఎరీకా!

అంతర్జాతీయ బాలల సంవత్సరం కేవలం పత్రికలకు, వేదికలకు మాత్రమే పరిమితం అయిపోలేదు. నిజంగానే బాలల సంక్షేమానికి ఎంతో కొంత దోహదం చేసింది—అనడానికి ఒక ఉదాహరణ మన రాష్ట్ర ప్రభుత్వం చేపట్టిన కోటి రూపాయల పథకం. శిశు సంక్షేమ పథకాలు రూపొందించడానికి ప్రత్యేకంగా కోటి రూపాయల నిధిని యేర్పాటు చేయనున్నట్లు రాష్ట్ర శిశు సంక్షేమ శాఖామంత్రి శ్రీమతి రోడామిస్త్రీ తెలియజేశారు. అంతర్జాతీయ బాలల సం॥లో సిద్దిపేట, కరీంనగర్, విజయవాడలలో కొత్తగా ఐదు బాల భవన్‌లు ప్రారంభించినట్లూ; అలాగే మరో పది బాల భవన్‌లు వివిధ జిల్లా కేంద్రాలలో నిర్మింపబడతాయనీ వాటి శాఖలు గ్రామ ప్రాంతాలకు కూడా విస్తరింపబడతాయనీ ఆమె వెల్లడించారు.

మన దేశంలాంటి కొన్ని అభివృద్ధి చెందుతూన్న దేశాలలో పెరుగుతూన్న జనసంఖ్యను అరికట్టడం ఎలా? అన్నది అంతులేని సమస్య. అయితే శిశు జనన సంఖ్య తగ్గడం కూడా ఓ సమస్యగా తయారయింది పశ్చిమ జర్మనీలో. సరైనంతమంది పిల్లలు లేకపోవడంతో ఇటీవల నిర్మించబడిన పాఠశాలలు కొన్ని మూయబడ్డాయి. పిల్లల ఆటవస్తువులు తయారుచేసే పరిశ్రమ రోజు రోజుకు క్షీణిస్తోంది. అంచేత అక్కడ పుట్టే ప్రతి రెండో పాపకు 400 రూ॥ నుంచి 1000 రూ॥ వరకు తల్లిదండ్రులకు అలవెన్స్ ఏర్పాటు చేశారు.

# సమాచారాలు

భార్యను అర్ధాంగి, సహధర్మచారిణి అంటూనే ఆమెను జూదంలో ఓడిపోయి అష్టకష్టాలు పడ్డాడు ధర్మరాజు అంటుంది మహాభారతం. ఇవాళ కూడా అభినవ ధర్మరాజులు అక్కడక్కడా వున్నారని గుర్తు చేస్తుంది ఉత్తరభారతంలో దీపావళినాడు రాత్రి జరిగిన ఓ సంఘటన :

మోరాదాబాద్ జిల్లా మొహల్లాభూర్ గ్రామానికి చెందిన బాల్మీకి అనే ప్రబుద్ధుడు జూదంలో చేతిలో వున్న డబ్బంతా పోగొట్టుకున్నాట్ట. ఆఖర్లో ఒళ్ళు మండి కట్టుకున్న పెళ్ళాన్ని పణంగా పెట్టి ఆడాడు; ఓడిపోయాడు. మరునాడు ఉదయం పంచాయతీ జరిగింది. అతని భార్యను జూదంలో గెలుపొందిన వానికి అప్పగించారట – భారతం నాటి కురుసభకు ఏమాత్రం తీసిపోని పంచాయతీ పెద్దలు !

అమెరికాలో దాదాపు నాలుగు వందల యాభై మంది జనాభా గల చిన్న గ్రామం హామిల్టన్. ఆ వూళ్లో వున్న కిండర్ గార్డన్ స్కూల్లో ఎనభై ముగ్గురు పిల్లలు చదువుకుంటున్నారు. వారిలో పదిమంది కవల పిల్లలు. ఆ గ్రామానికి సంబంధించినంతవరకు అది సర్వసాధారణమైన విషయమే !

ఆచారం పేరుతో స్త్రీ జాతిని అమానుషంగా పీడించిన సతీ సహగమనాన్ని రూపుమాపడానికి రాజారామమోహనరాయ్ ఎంతో కృషి చేశారు. సతీసహగమన నిషేధ చట్టం అమలు చేశారు. పర్యవసానంగా ఈ తరంవారికి పుస్తకాలలో తప్ప సతీ సహగమనం అంటే ఏమీ తెలియదు. కాని – ఇటీవల సావిత్రి అన్న పదిహేడేళ్ళ నవవధువు సహగమనం చేసి అందర్నీ ఆశ్చర్యపరిచింది ! సావిత్రి భర్త — రమాకాంత్ తివారీ ఇంజనీరింగ్ మూడో సం॥ చదువుతుండేవాడు. రమాకాంత్, అతని తమ్ముడూ 'జారి' అన్న గ్రామంలో జరిగిన ఒక కొట్లాటలో దుండగులచేత కాల్చి చంపబడ్డారు. ఆ సోదరులకు అంత్యక్రియలకు ఏర్పాట్లు జరిగాయి. చితిపేర్చి శవాలను వుంచారు. నిప్పు అంటించడానికి కొద్దిసేపు వుందనగా కొత్త పెళ్ళికూతురు సావిత్రి భర్త తలను తన తొడల మీద వుంచుకుని చితి మీద కూర్చుని నిప్పంటించమందిట ! అక్కడ చేరిన బంధుమిత్రులు ఎంత ప్రాధేయపడి వారించినా తన పట్టుదలను వదలకుండా భర్తతోపాటు తను కూడా అగ్ని కీలలకు ఆహుతై పోయింది సావిత్రి!

బెంగళూరులో 'సిగప్పు రోజాక్కళ్' అన్న తమిళ చిత్రం ప్రదర్శింపబడుతోంది. అందులో కథానాయకుడు నవయౌవనంలోని యువతులను మానభంగం చేసి అమానుషంగా హత్య చేసే విచిత్రమైన మనస్తత్వంగల పాత్ర ! సినిమా హీరోను ఆదర్శంగా తీసుకుని ఇదే కథను ఒక నెల క్రితం తమ నిజ జీవితంలోనే జరిపి చూపారు ఇద్దరు యువకులు. వీరి దారుణానికి బలైనవారు ఇద్దరూ ముక్కుపచ్చలారని బాలికలు ! వసంత ఐదేళ్ళ బాలిక. మధ్యాహ్నం భోజనం సమయంలో పాపను చూడడానికి బడికి ఆమె తల్లి వెళ్ళింది. పాప జాడ కనబడలేదు. పాపను అన్నిచోట్లా గాలించారు. కనబడలేదు. ఆఖరికి నిర్మానుష్యంగా వున్న బట్టల మిల్లు వెనుక ప్రదేశంలో శీలభంగం (?) చేయబడి బ్లేడుతో గొంతు కోయబడి చచ్చి కనబడింది !

మరుసటి రోజూ ఇలాంటిదే మరో దుర్ఘటన జరిగిపోయింది. అర్ధరాత్రి దాటాక ఇంటికి వస్తూన్న ఒక కార్మికునికి బాధతో మూలుగుతూన్న పసిపాప వేదనా స్వరం వినపడింది. తీరా వెళ్ళి చూస్తే ఏడేళ్ళ పాప మానభంగం చేయబడి – ముక్కూ, ఒక చెవి కోయబడిన స్థితిలో విలవిలలాడుతోంది. రత్న అనే ఆ అమ్మాయి రెండు రోజుల తర్వాత ఆస్పత్రిలో మరణించింది.

ఈ రెండు దుస్సంఘటనలు ప్రజలలో భీతిని చెలరేపాయి. పోలీసుశాఖ తీవ్రంగా విచారణ జరిపి రెండు వారాల తర్వాత దోషుల్ని పట్టుకుంది.

బెంగళూరు శ్రీరామపురం ప్రాంత దుండగుల ముఠాకు చెందిన ప్రభాకర్, కుమార్ అన్న ఇరవై, ఇరవై ఒక్క సంవత్సరాల యువకులు ఈ ఘోరమైన హత్యలు చేశారుట. పోలీసుల కథనం ప్రకారం– వీళ్ళు "సిగప్పు రోజాక్కళ్" సినిమాను చాలాసార్లు చూసి అందులోని హీరోనూ తామూ నిజ జీవితంలో అనుసరించి చూడాలని నిర్ణయం తీసుకున్నారట !

వీధి నిద్రపోతూంది.

చీకటి కాపలా కాస్తోంది.

రాజుగారి తోటలో గజ్జి కుక్క 'కుయ్యో'మని మొరిగింది. నిద్రాభంగమవ్వడానికి అక్కడ రాజుగారు లేరు. రాజులు పోయారు. రాజ్యాలు పోయ్యాయి.

కొన్ని భవంతులు కార్యాలయాలయ్యాయి. రాజ ప్రాసాదాలు శిథిల శిల్పాలే అయ్యాయి. పూల తోటలు స్వేచ్ఛా వాయువుల్ని పీల్చుకుని విచ్చలవిడిగా బలిసి అడవులే అయ్యాయి.

అందుచేత—

ఆ తోటను నాటించింది రాజుగారే అయినా ఆ రాజుగారిప్పుడు లేరు! ఉన్నది రాజులు గాడే!

రాజులు కళ్ళు విప్పేడు — గజ్జికుక్క అరుపు కర్ణకఠోరంగా వుంది. నేడో రేపో అన్నట్టుంది దాని స్థితి.

"వెధవది...ఇక్కడ చచ్చిందా....ఆ పీడంతా తనకే చుట్టుకుంటుంది. గోడ దాటి బయటకుపోతే యే మునిసిపాలిటీవాడో చూసుకుంటాడు."

నిశ్చింతగా నిద్రపోతున్నారిద్దరూ....

నిశ్చింత కాక? దొంగ భయమా? దొర భయమా? ఆ మాటకొస్తే దొంగభయం కంటే దొర భయమే ఎక్కువ.

"ఇదిగో నీ పేరేమిటోగానీ, రేపొద్దుటికి నీ పాక తీసేయకపోయావో....అగ్గిపుల్లెట్టెస్తాను - అనక చూద్దూగాని తమాషా."

ఉదయం జవాను అన్న మాటలు గుర్తొచ్చాయి. పాక పీకేయమన్నందుకు భయమేసినా, తన గూటిని 'పాక' అన్నందుకు నవ్వొచ్చింది రాజులికి.

మనసులోనే నవ్వుకున్నాడు - తనదే పాకంటే వూళ్లో వున్న పాకలన్నీ చిన్నబుచ్చుకుంటాయి. కాదు మరీ? రెండు కమ్మలు; నాలుగాకులు; మరో నాలుగు గోనె పట్టాలు.

అది పాకా? తనది పాకా? కాదు....కాదు రాజమందిరం!

పూల తోటలోని అందాల అద్దాల మందిరం.

ఆ మందిరంలో పగలు సూర్యుణ్ణీ, రాత్రి చంద్రుణ్ణీ, చుక్కల్నీ కూడా చూడొచ్చు.

అమావాశ్య అర్ధరాత్రినీ, మండు టెండల్నీ: తుఫాను ఉధృతాన్నీ, వర్షపాతాన్ని...అన్నీ చూడొచ్చు! ప్రకృతిలో పరవశించొచ్చు.

తన ఆలోచనక్కి తనే నవ్వుకున్నాడు రాజులు. మర్రిచెట్టు మీద గుడ్లగూబ కూసింది—రాత్రి గడిచేందుకు మరో జాము వ్యవధి వుంది.

*

గుడ్లగూబ అరుస్తూనే వుంది. అల్లుతున్న తాటాకు బుట్ట అక్కడే వదిలేసి, లేచి చెట్ల సందుల్లోంచి ఆకాశంలోకి చూశాడు రాజులు. ప్లస్సుల్లాగా ఇంటూల్లాగా సూరీడు!

కాంతిరేఖలు చెట్ల ఆకుల పైనా, పూల రెమ్మల పైనా బంగారపూత పూస్తున్నాయి.

గుడ్లగూబ కన్పించలేదు.

ఎండుటాకులు శబ్దమైతే తలతిప్పి చూశాడు. ఒకరూ....ఇద్దరూ....ముగ్గురూ.

అబ్బో! చాలామందే!

# మార్పులేదు!

మాధవి సుంకర

చిరుగుల దుప్పటిని నిండా కప్పుకుని గుడిసెలోంచి ముందుకు వంగి ఒక మట్టి బెడ్డను దాని మీదికి విసిరాడు.

కుఁయ్‌మంటూ ఒక్క అరుపు అరిచి బరువుగా కదిలిపోయిందది.

మళ్ళీ నిద్రకుపక్రమించాడు రాజులు. గజ్జి కుక్క వెళ్ళిపోయింది..నిద్ర కూడా వెళ్ళిపోయింది.

ఉన్నవల్లా ఆలోచనలు! వెల్లికిలా పడుకుని మీదికి చూశాడు. గుడిసె కన్నాల్లోంచి చిక్కటి చీకటి అందవికారంగా కన్పిస్తోంది.

రాజులు గుండెలో వేయి ముళ్లు గుచ్చుకున్నట్లయింది. ఆ ఆలోచన అటువంటిది.

ఒక్కసారి ప్రక్కకు చూశాడు. సీతాలు నిబ్బరంగా నిద్రపోతుంది. సీతాలు ప్రక్కనే చంటాడు. ఏ పేరు పెడితే వాడు 'రాజా'లా బతగ్గలడో అనే ఆలోచన్లోనే యింతవరకూ వాడికి పేరే పెట్టలేదు.



సూట్లూ, బూట్లూ....ఇంజనీర్లే అయి వుండాలి!

వారం క్రితం వచ్చిన బాబులు చెప్పనే చెప్పారు. అడవిలా పెరిగిన రాజుగారి తోటనంతా నరికించి-శుభ్రం చేసి పార్కు చేస్తారంట. నగరంలో పార్కు లేని లోటు తీరుస్తారట. నిజమే....ఊరు పెరిగింది. పార్కుల్లేవు.

జనమంతా తమ జీవితాన్ని సగం ఆఫీసుల్లోనూ, మిగతా సగం, బస్సుల్లోనూ గడిపేస్తున్నారు.

వాళ్ళకి విశ్రాంతి యేది? విశ్రాంతికి పైమేది? చోటేది? అగ్గిపెట్టె లాంటి యిళ్ళు. వందలకు వందలూ అద్దెలు. ఒక్కచోట ఒకే గదిలో ఎందరో జీవులు.

ఆకాశం....భూమీ....గాలీ.....నీరూ....అందరి దీనూ.

మరి యిదేమిటి?

అడుగులు దగ్గరపడ్డాయి. పెద్ద దొరే!

ఆకాశం రంగు సూట్లో వున్నాడు. అరముగ్గిన జామిపండులా వున్నాడు. రావడంలోనే ఇంగ్లీషులో యేదో గర్జించాడు.

"ఎవరు నువ్వు? ఎన్నాళ్ల నుంచి వుంటున్నా విక్కడ? దొరగారు అడుగుతున్నారు" చిన్న దొర, తెలుగు దొర. తెలుగులో అడిగేడు.

"రాజులంటారండి నన్ను .... సాలాకాలం నుంచి యిక్కడ్నే వుంటున్నాం" నసిగేడు రాజులు.

"ఏం చేస్తుంటావ్"

"ఏదో కడుపు నిండని పని బాబయ్యా. బుట్టలు అల్లుతా" చిన్న దొర ఇంగ్లీషులో అదేమాట పెద్ద దొరతో చెప్పాడు.

పెద్ద దొర మళ్ళీ ఇంగ్లీషులో ఏదో అరిచాడు. చిన్న దొర తెలుగులో కసురుకున్నాడు.

"ఏమిటి? బుట్టలల్లే బతికేస్తున్నావా? అదే నిజమైతే ఇక్కడి కర్రా, కలపా, పూలు, పళ్ళూ ఏమవుతున్నాయ్?".

రాజులు ఏదో చెప్పబోయాడు. కానీ అక్కడున్న వారిలో ఒకరి కళ్ళెర్రబడ్డంతో కాస్త తడబడ్డాడు.

"బుట్టల్తోపాటు సూదులూ, పూసలు కూడా రోడ్డుమీదెట్టి అమ్ముకుంటా బాబయ్యా! ఎప్పుడేనా కాయా, కసరూ రాలితే తిండమే గానీ మరేటీతెల్దు."

"నీకు తెలుసో లేదో యిది ప్రభుత్వం ఆస్తి. ఎవరూ యిక్కడ వుండటానికి వీలు లేదు.... తక్షణం నువ్వు ఖాళీ చేసెయ్యాలి. తెల్సిందా?"

చిన్నదొర మాటలకు దిగులు గుండెల్తో తలూ పాడు రాజులు.

"ఇంకా నీలాంటి వారెవరైనా వుంటున్నారా యిక్కడ?"

"చిత్తం మరో నాలుగైదు కుటుంబాలున్నాయి" బూట్లు కదిలాయి.

*

చూపుడు వేళ్ళమీదున్న చుక్కల్ని వెన్నెల వెలుగుతో చూసుకున్నారు రాజులు, సీతాలు.

ఓట్లేస్తే అలా చుక్క వేస్తారని వాళ్ళకి తెల్సిందా రోజే....మునుపెవరూ ఆ తోటలోకి వచ్చే వారు గాదు....ఓట్లెయ్యమని బలవంత పెట్టేవారూ కాదు. అందుకే తెలీదిన్నాళ్ళూ....

ఇప్పుడా తోట నరికి మాన్లు లారీల మీద తీసుకుపోయారు.

అడవి అల్లకల్లోలమైంది....

రాజుల గూడు వీధిన పడింది.

టాపు పాతదే. కాని నేల మాత్రం మట్టిది కాదు....సిమ్మెంటుది. కాకపోతే అప్పటికీ ఇప్పటికీ ఆధారమైన గోడ ఒక్కటే.

పూర్వం ఆ గూటికి బుడ్డిదీప మొక్కటే.... ఇప్పుడు ఎలక్ట్రిక్ వీధి దీపముంది.

*

మైకులూ....కేకలూ ఎక్కడ చూసినా జనం, జనం....!

ఏ నోట విన్నా ఒకే మాట....ఎవరు చర్చించినా అదే సంగతి....

"ఏలికలు మారేరు"-అన్నదే అర్థమైంది రాజులికి.

ఇసకేస్తే రాలనంత జనం....శిశిరంలో....రాజు గారి పూల తోటలో నేల కనబడకుండా రాలిన ఎండుటాకుల్లా జనం! చోద్యాన్ని చూస్తూ నిలబడ్డాడు రాజులు....ఎందుకో ఆనందమనిపించింది... వాళ్ళతోపాటు తనూ కేక వెయ్యాలనిపించింది.

జై....జై లు పలకాలనిపించింది.

కానీ....కానీ జన ప్రవాహం కదిలిపోయింది.

వెనక కార్ల బారు!

"ఎన్ని ప్రభుత్వాలు మారినా ఏం లాభం.... యీ డర్టీబెగ్గర్స్ మారరు. అందమైన ఈ పార్కు గోడ చుట్టూ యీ గుడిసెలేమిటి చండాలంగా...." కారులో వున్న లావుపాటి పెద్దమనిషి అన్నమాట బాణంలా గుచ్చుకుంది రాజులి గుండెల్లో.

"డర్టీబెగ్గర్స్" అన్న మాటకు అర్థం తెలీలేదు పాపం పూర్ రాజులికి. □



కె. జమునారాణి

ఒక విషయాన్ని సూటిగా, అందరికీ అర్థమయ్యేలా విశదీకరించి చెబుతూ, విమర్శనాత్మకంగా కూడా వుండేలా రాయగలిగిన ప్రక్రియ - వ్యాసం. రచనా వ్యాసంగంలో ఒక భాగం అయిన వ్యాస రచనలో పోటీ పెట్టినప్పుడు ఆ పోటీలో అందరికన్న మిన్న అనిపించుకుని గెలుపొందడం చెప్పుకోదగ్గ విశేషమే. అటువంటి ఘనత సాధించిన వనిత కుమారి కోగంటి జమునారాణి. మద్రాసులోని ప్రముఖ సాంస్కృతిక సంస్థ 'కళాసాగర్' ఇటీవల నిర్వహించిన వ్యాస రచన పోటీలలో ఆమె గెలుపొంది వారి 'లిటరరీ అవార్డు'ను పొందింది.

ప్రస్తుతం మద్రాసులోని ఎస్. ఐ. ఇ. టి, కళాశాలలో బి. ఏ (ఎకనామిక్స్) రెండవ సంవత్సరం చదువుతున్న జమునారాణి గత సంవత్సరం అంతర్ కళాశాల క్విజ్ పోటీలో ప్రథమ బహుమతి పొందింది. హిందీ విశారదకు చదువుతున్న ఈమె రష్యన్ భాష కూడా నేర్చుకుంటున్నది. టైప్‌రైటింగ్, కుట్లు, అల్లికలలో బాగా ప్రవేశమున్న జమునారాణికి జర్నలిజంలో రాణించాలని' ఆసక్తి.

మన దేవాలయాలు

# శ్రీరంగం

వైకుంఠ ఏకాదశి (డిసెంబర్ 29) పర్వదిన సందర్భంగా శ్రీరంగంలోని శ్రీరంగ నాథస్వామి దేవాలయం క్షేత్ర విశేషాలను 'మన దేవాలయాలు' శీర్షికలో వివరిస్తున్నాము.

షర్ణ వర్ణ సుగంధ పుష్పాలతో వెలుతురు కళ్లకు కాటుక దిద్దుతూ కనులవిందుగా కళకళలాడే ఫల వృక్షాలకు మూలం కళ్లకు కనబడని వేళ్లు. అలాగే మన ఆలోచనలకు అనుదిన చర్యలకు మూలాధారం మనం గుర్తించి గౌరవించే విలువలు. జాతి జీవనంలో తరతరాలుగా అంతర్లీనంగా కలిసిపోయిన విలువలను సంస్కృతి అంటారు. నాగరికమైన ప్రతి దేశ ప్రజల జీవన గమనాన్ని నిర్ణయించేది ఆ దేశ సంస్కృతి. మనది సనాతన సంస్కృతి. సూక్ష్మమైన సనాతన సంస్కృతీ విలువలకు ప్రతిబింబాలు మన దేవాలయాలు! మన దేశంలో ఆలయం లేని గ్రామం ఎక్కడా కనిపించదు!

చరిత్రకు అందని అతిప్రాచీనమైన దేవాలయాలలో ముఖ్యమైనది కావేరీతీర—శ్రీ రంగ నాథ ఆలయం! కావేరీనది కొళ్లడం, కావేరి అన్న రెండు పాయలుగా చీలి శ్రీరంగ మందిరం చుట్టూ జలమాలలా గలగలా పరుగులు తీస్తూ, కనిపిస్తుంది!

రంగు రంగుల పువ్వులనుంచి మకరందం సేకరించే తుమ్మెదలు; రకరకాల వృక్షాల మీద పక్షుల కిలకిలా రావాలు; వీనులవిందుగా మయిమరపింపజేసే కోయిలమ్మల తియ్యని గీతాలు; కనుచూపు మేరకు పచ్చటి పొలాల మీదుగా ఆటలాడే చల్లటి గాలులు - పరివేష్ఠించిన సుందరమైన కావేరీ ద్వీపంలో వుంది శ్రీరంగ మందిరం!

తమిళనాడులో తిరుచిరాపల్లికి మూడు మైళ్ళ ఉత్తర దిశగా వుండే శ్రీరంగం చోళమండలం లోనిదే. అయినా దక్షిణ దేశాన్ని పరిపాలించిన చేర, చోళ, పాండ్య, పల్లవ హోయసాల, విజయనగర వంశాలకు చెందిన రాజులందరూ ఈ ఆలయ నిర్మాణంలో పాలుపంచుకున్నారు!

ఇక్ష్వాకుడనే రాజు చాలా సంవత్సరాలు తపస్సు చేసి బ్రహ్మనుంచి రంగనాథ విగ్రహం పొందాడుట. ఆ విగ్రహాన్ని అయోధ్యలో ప్రతిష్ఠించి ఇలువేల్పుగా భావించి పూజలు జరుపుతూ వచ్చాడు. రావణ సంహారం తర్వాత రాముడు అయోధ్యకు వచ్చి పట్టాభిషిక్తుడయ్యాడు. పట్టాభిషేక మహోత్సవానికి లంక నుంచి విభీషణుడు కూడా వచ్చాడు. ధర్మ విరుద్ధంగా ప్రవర్తించిన వాడు తన తోబుట్టువే అయినప్పటికి రావణుని వదలి ధర్మానికి తోడుగా శ్రీరాముని పక్షం వహించిన విజ్ఞుడు విభీషణుడు. విభీషణుని వివేక వర్తనకు సంతోషించిన రాముడు తాతముత్తాతల నుంచి తమ పూజా మందిరంలో పూజలందుకుంటున్న రంగనాథ విగ్రహాన్ని ఆయనకు ప్రసాదించాడుట. లంకకు చేరేవరకు ఆ విగ్రహాన్ని దారిలో ఎక్కడా దించకూడదని చెప్పాడట.

లంకా నగరానికి వెళుతూ దారిలో కావేరీ తీరంలో దాహం వేయగా విగ్రహాన్ని దించి 'చంద్ర పుష్కరణి'లో దప్పిక తీర్చుకుని విగ్రహాన్ని తీసుకోబోయాడట. అయితే ఆ విగ్రహం అక్కడే స్థిరపడి పోయిందనీ - ధర్మవర్మ అనే రాజు మొట్టమొదట ఆలయ ప్రాకారాదులు నిర్మించాడనీ - శ్రీరంగ స్థల పురాణం చెబుతుంది.

దేవుడు నిర్గుణుడు అంటాయి వేదాలు. నిర్గుణుడు అంటే ఏమీలేని శూన్యం కాదు. హేయ గుణ రహితుడు, కల్యాణ గుణ పరిపూర్ణుడు అని వ్యాఖ్యానంచేసి, సదాచారంతో మంచితనం, మానవత కల్గి దేవదేవుడైన విష్ణువును భక్తిశ్రద్ధలతో ప్రార్థిస్తే సర్వఐశ్వర్యాలు-శాంతి సంతోషాలు కలుగుతాయన్న విశిష్టాద్వైత సిద్ధాంతం ప్రబోధించారు రామానుజాచార్యులు! పన్నెండవ శతాబ్దంలో వైష్ణవ మత ఉద్ధరణకు కృషి చేసిన రామానుజులు శ్రీరంగంలో చాలా కాలం నివసించి ఇక్కడే విష్ణు సాయుజ్యం పొందారట. శైవులకు చిదంబరంలాగా వైష్ణవులకు శ్రీరంగం "రాజధానీ నగరం" అని ప్రతీతి!





సాధారణంగా గుళ్లు ఊళ్లోనో, ఊరికి వెలుపలో వుంటాయి. అయితే గుడి లోపల వూరు వుండే విశేషం శ్రీరంగంలో చూస్తాము. దాదాపు చదరపు మైలు విస్తీర్ణం, ఏడు ప్రాకారాలతో ఇరవై ఒక్క గోపురాలతో వెలుగొందుతున్న శ్రీరంగ మందిరం వెలుపలి మూడు ప్రాకారాల లోనూ వరుసలు వరుసలుగా ఇళ్లు నిర్మింపబడి వున్నాయి.

గర్భగుడి మీదుగా వున్న విమానం, సుందర మైన పరవాసుదేవ విగ్రహంలో ఓంకారాకృతిలో వుంది. అంచేత దీనిని ప్రణవాకార విమానం అంటారు.

గర్భగృహంలో దేవేరుల విగ్రహాలు లేవుగాని రంగనాథ ఆలయంలోనే - రంగనాయకి, బీబి నాంచారు, గోదాదేవి మొదలైన ఆరుగురు దేవేరు లకు విడివిడిగా మందిరాలు వున్నాయి.

తులసీవనంలో పుట్టి - మంచికి మారుపేరుగా బ్రతుకు సాగించిన పూజారి విష్ణుచిత్తుని ఇంట పెరిగిన గోదాదేవి - పసిప్రాయంనుంచే విష్ణువు మీద ప్రేమానురాగాలు పెంచుకుందట. విష్ణుచిత్తుడు శ్రీరంగనాథుని అలంకరించడానికి కట్టే తులసీ మాలను ఆయనకు తెలియకుండా రోజూ ఓసారి ధరించి మురిసిపోతూ ఎవరూ చూడకముందే యథా ప్రకారం వుంచేస్తూ వుండేది. ఇది ఒక రోజు విష్ణుచిత్తుని కంట పడడంతో అపచారం జరిగి పోయిందని బాధపడిపోసాగాడట. అయితే రంగ నాథుడు విష్ణుచిత్తుని కలలో కనబడి కల్లాకపటం తెలియని బాలిక ప్రేమతో ధరించిన మాలను స్వీక రించడమే తనకు ప్రియమైనదని సెలవిచ్చాడట. నాటినుంచి గోదాదేవి తనను రాధగా, తన పల్లె సీమను బృందావనంగా భావించి గోపాలకృష్ణుని గురించి తేనెలొలుకు పదాలతో అల్లిన గీతమాలిక లను గానం చేస్తూ - రంగనాథునిలోనే లీన మయ్యిందట.

భక్తమీరాను జ్ఞాపకం చేసే గోదాదేవి దివ్య గాథనే ఆంధ్రభోజుడు 'ఆముక్తమాల్యద' అన్న ఆంధ్ర ప్రబంధంగా రచించాడు.

మహావిష్ణువు మాయాశక్తితో 'ముర' అనే లోక కంటకుని సంహరించిన శుభ దినంగా వైష్ణవులు ఏకాదశిని విశ్వసిస్తారు. ధనుర్మాసంలో వచ్చే శుక్లపక్ష ఏకాదశిని వైకుంఠ ఏకాదశి అంటారు.

ఈ పర్వదినాన రంగనాథ గర్భగృహానికి ఉత్తరంగా స్వామి పాదాలకు ఎదురుగా వుండే "స్వర్గ ద్వారం" తెరువబడుతుంది. దేశం నాలుగు చెరగులనుంచీ లక్షలాది భక్తులు యేటా 'స్వర్గద్వార' దర్శనానికి వస్తూ వుంటారు.

గర్భగృహం పూర్తిగా ఆక్రమించిన ఆది శేషుని విగ్రహం బంగారు రంగు రేకులతో కప్పబడి వుంది. దక్షిణ హస్తం శిరస్సు క్రింద వుంచుకుని వామ హస్తం మోకాలు తాకే విధంగా - పడమర దిక్కుగా తల వుంచి దక్షిణాభిముఖంగా శేషతల్పం మీద శయన భంగిమలో అతి గంభీరంగా వుంది రంగనాథ విగ్రహం! అనంతశయనుని సుందర ముఖారవిందం చిందే దివ్య దరహాసం చూస్తూ పాదాలచెంత శాశ్వతంగా రాయిగా పడి వుండే భాగ్యం ప్రసాదించమని కోరుకున్నాడొక రాజు!

పావనగంగకు జన్మనిచ్చిన పాదారవిందాలను మాత్రం స్తుతిస్తూ పాదుకా సహస్రం రచించాడు వేదాంత దేశికుడు అనే భక్త కవి. శ్రీరంగ కౌస్తుభమణి వక్షుని స్తుతించే మరో స్తోత్ర మాలిక ముకుందమాల!



నిప్పు, నీరు, గాలి, భూమి, ఆకాశం అన్నవి పంచభూతాలు. ప్రపంచంలోని ప్రతి వస్తువూ పంచ భూతాత్మకమైనదే. దీనికి సంకేతమే ఐదు తలల ఆదిశేషుడు. పంచభూతాత్మకమైన ప్రపంచమంతా వ్యాపించిన సర్వమయుడు దేవుడు అని పెద్దలు విశ్వసించారు. అందుకే దేవుణ్ణి రంగనాథుడు, అనంతశయనుడు అన్నారు.

ఇలాంటి ఆలయ దర్శనాలవల్ల హృదయ కేదారాలలో భక్తిబీజాలు మొలకెత్తుతాయి. అనుదిన సక్రమజీవనం ద్వారా వాటిని పెంచి పెద్దచేసి నట్లయితే జీవితంలో జ్ఞాన ప్రసూనాలు వికసిస్తాయి - అన్నది విజ్ఞులయిన మన పెద్దల విశ్వాసం! □

# కర్పూరం



దేవుడు లేకుండా దేవాలయం వుండదు. అలాగే కర్పూరం లేకుండా పూజలూ పునస్కారాలూ జరుగవు. గుడిలోగాని, ఇంట్లోగాని పూజ ముగించి "మమ్మల్నందరినీ చల్లగా చూడు తండ్రి" అంటూ హారతిని కళ్ళ కద్దుకుంటాము. మన జీవితాలను కూడా స్వార్థ రహితంగా హారతి కర్పూరంలా దేవుని సేవకు అంకితం చెయ్యాలన్నదే కర్పూర హారతి సందేశం – సంకేతం అంటారు పెద్దలు.

అయితే కర్పూర హారతి చూపడంవల్ల ఇంట్లోగాని, గుళ్ళోగాని పురుగూ పుట్రా చేరకుండా వుంటుందనీ, హారతిని కళ్ళ కద్దుకోడంవల్ల చలవ చేసి కళ్ళు ఆరోగ్యవంతమవుతాయని మనకి తెలిసిన విషయమే. ప్రధాన పూజా ద్రవ్యంగానే కాకుండా ఎన్నో జబ్బులను నయం చేసే ఔషధంగా కూడా కర్పూరం ఉపయోగపడుతుంది.



సాధారణమైన కురుపులు, నిప్పుపడి ఏర్పడే గాయాలూ, వాపులూ కర్పూర లేపనంతో ఆరిపోతాయి. మెత్తగా నూరిన కర్పూరం నెయ్యితో కలిపి పూసినట్లయితే కత్తిగాయాలు కూడా ఇట్టే నయమైపోతాయి.

కర్పూరాన్ని మంచి గంధంతో కలిపి దేహానికి రాసుకున్నట్లయితే దేహ వాతం చల్లారుతుంది. వేడిని తగ్గిస్తుంది. కళ్ళకు చలవ చేయడంవల్ల కర్పూరాన్ని కాటుకలో విశేషంగా వాడుతారు.

పచ్చ కర్పూరం జీర్ణాశయ వ్యాధుల్నీ, అజీర్ణ విరేచనాలనీ, నోటి అరుచినీ, దుర్వాసననీ పోగుడుతుంది. కఫం పోగొట్టడానికీ, దగ్గును తగ్గించడానికీ కర్పూరం ఔషధంలా పనిచేస్తుంది.

కర్పూర తైలం వాత నొప్పులు హరిస్తుంది. క్రిములను నశింపజేస్తుంది. నరాల బలహీనతకు, గుండె జబ్బులకు ఇది మంచిది. చందన తైలం, భృంగామలక తైలం మొదలైన వాటిలో కూడా హారతి కర్పూరం కలుపుతారు.

ఇలా రకరకాల ఔషధాలు తయారు చేయడానికీ, పూజా ద్రవ్యంగానూ వాడడానికి మన దేశంలో మాత్రం నాలుగు లక్షల క్వింటాల్స్ కర్పూరం కావలని వస్తోంది. అయితే మన అవసరాలకు కావలసినంత కర్పూరం మన దేశంలో తయారుకావడం లేదు. అంచేత సాలుకు ఐదు వేల క్వింటాల్స్‌ను దిగుమతి చేసుకుంటున్నాము.

అయితే కర్పూరం ఎలా తయారు చేస్తారు? దేన్నుంచి తీస్తారు? అన్న విషయాలు అందరికీ తెలియవు.



దక్షిణ భారతదేశపు అడవులలో లవంగం చెట్లు బాగా పెరుగుతాయి. ప్రతి ఋతువులోనూ పచ్చగా కనబడే లవంగ చెట్లు ఎనిమిది మీటర్ల ఎత్తు పెరుగుతాయి. వీటి ఆకులు తమలపాకుల్లా వుంటాయి. అయితే ఇంకా కాస్త దళసరిగానూ దృఢంగానూ వుంటాయి. గుత్తులు గుత్తులుగా పూలు పూసే ఈ చెట్ల పళ్ళు నీలం కలిసిన ఎరుపు రంగుతో గ్రుడ్డు ఆకారంలో వుంటాయి. లోపల ఒకే ఒక విత్తనం వుంటుంది.

చెట్లు పెరిగి పక్వానికి రాగానే కొమ్మలు నరికి పై బెరడు ఒలుస్తారు. బెరడు లోపలి భాగాలను విడిగా వేరు చేసి నీడలో ఆరబెడతారు. దీన్నే దాల్చిన చెక్క అంటారు. కొన్ని రకాల వంటలకు వాసన ద్రవ్యంగా మాత్రమే కాకుండా దాల్చిన చెక్కను కొన్ని ఔషధాలు తయారుచేయడానికి కూడా ఉపయోగిస్తారు. విరోచనాలు, వాంతులు ఉపశమనానికి కూడా ఇది ఉపయోగపడుతుంది.



ఈ బెరడు నుంచి ఒక విధమైన నూనె తీస్తారు. దీన్ని 'సినమన్ బార్క్ ఆయిల్' అంటారు. జీర్ణాశయ సంబంధమైన ఇబ్బందులు నివారించడానికి ఈ నూనె ఉపయోగపడుతుంది. వీటి పత్రాలనుంచి తీసే నూనెను సబ్బులు, మిఠాయిలు చెడిపోకుండా నిల్వ వుండడానికీ కలుపుతారు.

దాల్చిన చెక్కలోనే సినమన్ కాంఫర్ అనే ఓ రకం వుంది. వీటి ఆకులు, బెరడునుంచి తీసే నూనె నుంచే కర్పూరం తయారు చేస్తారు. ఈచెట్లు దక్షిణాది నీలగిరి కొండల మీద మాత్రమే పెరుగుతాయి. అంచేత మన దేశం మొత్తానికి సరిపడే కర్పూరం తయారుచేయడానికి కావలసినంత ముడి పదార్థం లభించడంలేదు. ఈ చాలని పరిస్థితిని అసరాగా తీసుకుని కొందరు వ్యాపారస్థులు పారఫిన్ మైనం కరిగించి అందులో కొంత కర్పూరం చల్లి – కర్పూరం బిళ్ళలు తయారు చేసి అమ్ము చేసుకుంటున్నారు.

ఇలాంటి పరిస్థితిని పోగొట్టడానికి కర్పూరం తయారుచేసే పద్ధతుల మీద అనేక పరిశోధనలు జరుగుతున్నాయి. ఈ పరిశోధనలవల్ల మన దేశంలో వుండే కర్పూర తులసి మొక్కలనుంచి కూడా కర్పూరం తయారు చేయవచ్చని కనుగొన్నారు. అయితే ఈ మొక్కలనుంచి కర్పూరం తయారుచేయడానికి అయ్యే ఖర్చు—తయారయ్యే కర్పూరం విలువకన్నా ఎక్కువ కావడంతో ఈ సాహసం చేయడానికి అడుగు ముందుకు వేయడం లేదు.

తూర్పు ఆఫ్రికాలో 'కాంఫర్ బేసిల్' అనే తులసి మొక్కలు విరివిగా వున్నాయి. వీటి నుంచి చాలా చౌకగా కర్పూరం తయారు చేయవచ్చునని తెలుసుకున్నారు. మన దేశంలో ఇప్పుడిప్పుడే ఈ మొక్కలను కాశ్మీర్, ఉత్తర ప్రదేశ్, పశ్చిమ బెంగాల్, మహారాష్ట్ర, కర్ణాటక, తమిళనాడు, కేరళ ప్రాంతాలలో సాగుచేయబడుతోంది. వీటి నుంచి మనకీ కర్పూరం తయారు చేయడం ఇటీవలే ప్రారంభమయింది. □

## నిబంధనలు

'వనిత మాటల కొలువు'లో స్త్రీలు మాత్రమే పాల్గొనాలి. ఈ సంచికలో ఉన్న కూపను పూర్తి చేసి కవర్లో పెట్టి 'వనిత మాటల కొలువు-55' చందమామ బిల్డింగ్స్, మద్రాసు - 600 026 చిరునామాకు జనవరి(80)28వ తేదీలోగా చేరేలా పంపాలి. ఆ కవర్లో మాటల కొలువు కూపను తప్ప మరేదీ ఉండకూడదు. ఒక కవర్లో ఒక్క ఎంట్రీయే ఉండాలి. గళ్ళలో వేసే అక్షరాలు శుభ్రంగా, తెలిసేలా ఉండాలి. కొట్టివేతలూ దిద్దుబాట్లూ ఉండకూడదు. దీని సమాధానం, ఫలితాలూ 1980 మార్చి సంచికలో ప్రచురింపబడతాయి. మా దగ్గర గల సమాధానంతో సరిపోయే సమాధానం పంపినవారికి రూ. 150 లు బహుమతిగా పంపుతాము. సరైన సమాధానం పంపేవారు ఒకరికంటె ఎక్కువమంది గనక ఉంటే, బహుమతి మొత్తం సమానంగా పంచబడుతుంది. దీనికి సంబంధించిన ప్రతి విషయంలోనూ 'వనిత' నిర్వాహకవర్గానిదే తుది నిర్ణయం. ఈ విషయంలో ఎటువంటి ఉత్తర ప్రత్యుత్తరాలూ జరపబడవు.

### ఆధారములు - అడ్డము

1. మంచి మాట చెప్పడం—పట్టణాలూ, పూళ్లూ గల చిన్న భూభాగం లాంటిదా ?
2. బట్ట (తలకి సంబంధించినది కాదు)
3. విలోపించిన స్త్రీ
4. గర్వపడడం
5. ఎండయినా కావచ్చు; వెలుతురయినా కావచ్చు
6. మరలిపోవడం
7. తాగడానికి సాధారణంగా ఎవరూ ఇష్టపడనిది-అందుకని సగమే వుంది
8. ఒక జాతికి చెందిన స్త్రీ
9. కలహం కాబట్టే అంతా కలకలం అయిపోయింది
10. జిత్తుల మారి చిన్నది
11. మొదట్లో పొడుగు తక్కువైన కొమ్మ
12. చెదిరిన చిరుమందహాసం

### ఆధారములు - నిలువు

1. లంబోదరుని తండ్రి
2. మీ కంటికెదురుగా వున్నది
9. క్రూరజాతికి చెందిన స్త్రీ
13. ఇంట్లో స్త్రీలు చేసేదీ, పురుషులు ఆఫీసులో చేసేదీ
14. దశమిలో చెట్టు
15. తాడుతోనూ వెయ్యవచ్చు; జుట్టుతోనూ వెయ్యవచ్చు
16. వెళ్లము
17. ముడవబడిన చెయ్యి
18. 9
19. తరంగము పెద్దది
20. కూడబెట్టుకున్న డబ్బు దనకం, భూమీపుత్రా చెల్లాచెదరైతే ?
21. ఇల్లు
22. చెదిరిన హృదయము
23. నిజానికి గోరు-కిందనుంచే పైకి ఎదుగుతుంది గదా
24. కానలేని అడవి

## వనిత మాటల కొలువు-55
## రూ 150లు బహుమతి

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| 1 | 13 | | 14 | 15 | | 2 | |
| 3 | | | 4 | | | | |
| | | 16 | | | 5 | | 17 |
| 6 | 18 | | | 19 | | | |
| | 7 | | | 8 | 20 | 21 | |
| 22 | | | 9 | | | | 23 |
| 10 | | 24 | | | | 11 | |
| | | 12 | | | | | |

పేరు ....................................................

చిరునామా ....................................................

....................................................

....................................................

# భాషలు నేర్చుకోండి

| తెలుగు | | | తమిళం | | | కన్నడం | | | మలయాళం | | | మరాఠి | | | గుజరాతి | | | ఒరియా | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| ర | ల | వ | ர | ல | வ | ರ | ಲ | ವ | ര | ല | വ | र | ल | व | ર | લ | વ | ର | ଲ | ବ |
| రా | లా | వా | ரா | லா | வா | ರಾ | ಲಾ | ವಾ | രാ | ലാ | വാ | रा | ला | वा | રા | લા | વા | ରା | ଲା | ବା |
| రి | లి | వి | ரி | லி | வி | ರಿ | ಲಿ | ವಿ | രി | ലി | വി | रि | लि | वि | રિ | લિ | વિ | ରି | ଲି | ବି |
| రీ | లీ | వీ | ரீ | லீ | வீ | ರೀ | ಲೀ | ವೀ | രീ | ലീ | വീ | री | ली | वी | રી | લી | વી | ରୀ | ଲୀ | ବୀ |
| రు | లు | వు | ரு | லு | வு | ರು | ಲು | ವು | രു | ലു | വു | रु | लु | वु | રુ | લુ | વુ | ରୁ | ଲୁ | ବୁ |
| రూ | లూ | వూ | ரூ | லூ | வூ | ರೂ | ಲೂ | ವೂ | രൂ | ലൂ | വൂ | रू | लू | वू | રૂ | લૂ | વૂ | ରୂ | ଲୂ | ବୂ |
| రృ | లృ | వృ | — | — | — | ರೃ | ಲೃ | ವೃ | — | — | — | — | लृ | वृ | — | લૃ | વૃ | — | ଲୃ | ବୃ |
| రౄ | లౄ | వౄ | — | — | — | — | — | — | — | — | — | — | — | — | — | — | — | — | — | — |
| రె | లె | వె | ரெ | லெ | வெ | ರೆ | ಲೆ | ವೆ | രെ | ലെ | വെ | — | — | — | — | — | — | — | — | — |
| రే | లే | వే | ரே | லே | வே | ರೇ | ಲೇ | ವೇ | രേ | ലേ | വേ | रे | ले | वे | રે | લે | વે | ରେ | ଲେ | ବେ |
| రై | లై | వై | ரை | லை | வை | ರೈ | ಲೈ | ವೈ | രൈ | ലൈ | വൈ | रै | लै | वै | રૈ | લૈ | વૈ | ରୈ | ଲୈ | ବୈ |
| రొ | లొ | వొ | ரொ | லொ | வொ | ರೊ | ಲೊ | ವೊ | രൊ | ലൊ | വൊ | — | — | — | — | — | — | — | — | — |
| రో | లో | వో | ரோ | லோ | வோ | ರೋ | ಲೋ | ವೋ | രോ | ലോ | വോ | रो | लो | वो | રો | લો | વો | ରୋ | ଲୋ | ବୋ |
| రౌ | లౌ | వౌ | ரௌ | லௌ | வௌ | ರೌ | ಲೌ | ವೌ | രൗ | ലൗ | വൗ | रौ | लौ | वौ | રૌ | લૌ | વૌ | ରୌ | ଲୌ | ବୌ |
| రం | లం | వం | — | — | — | ರಂ | ಲಂ | ವಂ | രം | ലം | വം | रं | लं | वं | રં | લં | વં | ରଂ | ଲଂ | ବଂ |
| రః | లః | వః | — | — | — | ರಃ | ಲಃ | ವಃ | രഃ | ലഃ | വഃ | र: | ल: | व: | ર: | લ: | વ: | ରଃ | ଲଃ | ବଃ |

[వచ్చే సంచికలో మరికొన్ని]



విశాఖపట్నం లయనెస్ క్లబ్బు ఇటీవల విశాఖ సేవాసదన్ ఉన్నత పాఠశాలలో నిర్వహించిన వైద్య శిబిరం - నలుగురు డాక్టర్లు వారి వైద్య సిబ్బందితో యించుమించు రెండు వందలమంది రోగులను పరీక్షించి వారికి ఉచితంగా వైద్యం చేసి మందులను యిచ్చారు. డాక్టర్లు లయనెస్ మహాలక్ష్మి, లయనెస్ శ్యామలా చిట్టి రోగులను పరీక్షిస్తున్న దృశ్యం. —విలేఖరి

మచిలీపట్నం లేడీస్ రిక్రియేషన్ క్లబ్ ఇన్నర్ విల్ క్లబ్ కలిసి గవర్నర్ సతీమణి శ్రీమతి ఎలిజెబెత్ అబ్రహాం మచిలీపట్నం విచ్చేసిన సందర్భంగా వారి గౌరవార్థం ఒక సభని ఏర్పాటు చేశారు. ఎడమనుంచి - లేడీస్ రిక్రియేషన్ క్లబ్ కార్యదర్శి పి. ఆదిలక్ష్మి, క్లబ్ అధ్యక్షురాలు, జిల్లా కలక్టర్ సతీమణీ ఉషాకందా, రెవెన్యూ శాఖమంత్రి శ్రీ జనార్ధనరెడ్డి సతీమణి, శ్రీమతి అబ్రహాం, ఇన్నర్‌వీల్ క్లబ్ అధ్యక్షురాలు వి. ఇందిరాదేవి.





విజయవాడ గాంధీ హిల్ మీద జవహర్‌లాల్ భవన్ ప్రారంభోత్సవంలో ప్రసంగిస్తున్న స్త్రీ, శిశు సంక్షేమ శాఖ మంత్రి రోడామిస్త్రి, కృష్ణా జిల్లా కలెక్టర్ మెహన్‌కందా, ప్రముఖ సంఘసేవికురాలు సీతాకామరాజ్, చెన్నుపాటి విద్య కూడా ఈ చిత్రంలో వున్నారు.

—మల్లిడి కనకరత్నం



రాజమండ్రి ఇన్నర్ వీల్ క్లబ్ తరఫున బి. రత్నవతి భాస్కరరావు స్థానిక ‘వికలాంగుల గృహానికి’ చక్రాల కుర్చీని బహూకరించారు. క్లబ్ తరఫున ఆ కుర్చీని అందజేస్తున్న క్లబ్ అధ్యక్షురాలు బి. మృదులా కమలాకర్, కార్యదర్శి కె. నిర్మలా ప్రశాంత్, బి. రత్నావతి, భాస్కరరావు, డిస్ట్రిక్ట్ 315 ఛైర్‌విమెన్ బి. అన్నపూర్ణ శ్రీరాం.





హైద్రాబాదులో ఇటీవల ప్రఖ్యాత చిత్రకారుడు పి. ఆర్. రాజు చిత్ర కళా ప్రదర్శనం స్థానిక కళాభవన్‌లో లలితకళా అకాడమీ కార్యదర్శి శ్రీ పి. టి. రెడ్డి ఏర్పాటు చేశారు. పి. లక్ష్మి కాంతమ్మ ఈ ప్రదర్శనకు ప్రారంభోత్సవం చేశారు. ఆ ప్రదర్శన తిలకించడానికి వచ్చిన వారిలో ప్రముఖ రచయిత్రి వాసిరెడ్డి సీతాదేవి కూడా వున్నారు.



హైద్రాబాద్ రవీంద్రభారతిలో ఇటీవల కుమారి జి. గీత భరతనాట్య ప్రదర్శన ఇచ్చి పలువురి మన్ననలు పొందింది. కుమారి గీత స్థానిక ఆర్. బి. వి. ఆర్ మహిళా కళాశాలలో ఇంటర్ తొలి సంవత్సరం విద్యార్థిని. —పి. భారతి

# వార్తావని(త)



కలకత్తా ఆంధ్రాకల్చరల్ అసోసియేషన్ (ఆగ్నేయ రైల్వే, గార్డన్ రీచ్ శాఖ) వారు తమ మూడవ వార్షికోత్సవాలను స్థానిక హైడ్‌రోడ్ ఇన్‌స్టిట్యూట్ ఆవరణలో జరుపుకున్నారు. ఆనాటి సాంస్కృతిక కార్యకలాపాలలో ఒక భాగంగా కర్నాటక సంగీత కచేరీలో పాల్గొన్న కళాకారులు - రూపాలిమూర్తి, సుభద్రా సీతారామస్వామి (ఫిడేలు), అన్నపూర్ణ సత్యనాథం (తంబుర)

కాకినాడ నవ్యాంధ్ర మహిళా మండలివారు అంతర్జాతీయ బాలల సంవత్సరం - సందర్భంగా 'బాలల దినోత్సవం' ఏర్పాటు చేశారు. ఆ సందర్భంగా తీసిన ఈ చిత్రంలో మండలి అధ్యక్షురాలు ఎస్. వి. అచ్యుతలక్ష్మి, ముఖ్య అతిథి ఎస్. సరోజినీ శాస్త్రి, ఉపాధ్యక్షురాలు ఎమ్. జె. ఇందిరా రావు, కార్యదర్శి పి. ఉమారాణి వున్నారు. ఆనాటి వేడుకలలో ఒక భాగంగా బాలబాలికలు నృత్య, నాటక ప్రదర్శనలు యిచ్చారు.





అనంతపురంజిల్లా కేంద్ర గ్రంథాలయంలో జాతీయ గ్రంథాలయ వారోత్సవ సందర్భంగా ఇటీవల మహిళా దినోత్సవ సభ జరిగింది. ఈ సభకు రాష్ట్ర స్త్రీ, శిశు సంక్షేమశాఖ అసిస్టెంట్ డైరెక్టర్ జె. వరలక్ష్మి అధ్యక్షత వహించారు. హైద్రాబాదు ఆకాశవాణి న్యూస్ ఎడిటర్ మాడపాటి సత్యవతి, రచయిత్రి ఆలూరి లక్ష్మీదేవి ప్రసంగించారు.



రాజోలు శ్రీ రాజరాజేశ్వరీ మహిళామండలి భవనానికి ప్రముఖ రచయిత్రి కళాప్రపూర్ణ తెన్నేటి హేమలత ప్రారంభోత్సవం చేశారు. మండలి అధ్యక్షురాలు జుబేదా ఇస్మాయిల్, డాక్టర్ రాజకుమారి కూడా ఈ చిత్రంలో వున్నారు.

విశాఖ లయన్ లేడీస్ క్లబ్బు కార్యకర్తలు ఇటీవల రామ్‌నగర్‌లో వెనుకబడిన తరగతులకు చెందిన స్త్రీలకు బాలబాలికలకు ఉచితంగా మందులను పంచిపెడుతున్న దృశ్యం. —విలేఖరి



# వార్తావనిత



బరంపురం వైస్ మెనెట్టెస్ క్లబ్‌వారు కార్యదర్శి ఇ. సుబ్బలక్ష్మి, సంయుక్త కార్యదర్శి జె. జయలక్ష్మి, ఉపాధ్యక్షురాలు పి. లక్ష్మి, కమ్యూనిటీ సర్వీసెస్ చెయిర్‌విమెన్ ఇ. రత్నమాల ఆధర్వంలో ఇటీవల అంతర్జాతీయ బాలల సంవత్సరం సందర్భంగా బాలల దినోత్సవాన్ని జరుపుకున్నారు.



విజయవాడ ఇన్నర్‌వీల్ క్లబ్‌వారు స్థానిక రామరాజ్యనగర్‌లో ఇటీవల బాలలకు ఉచిత వైద్య శిబిరాన్ని నిర్వహించారు. —మీరా

రామచంద్రాపురం లయన్ లేడిస్ ఆక్జలరీ, ఝాన్సీ మహిళా సమాఖ్య సంయుక్తంగా అంతర్జాతీయ బాలల సంవత్సరం సందర్భంగా 'ఆరోగ్యవంతమైన బాల'లకై పోటీ నిర్వహించారు. లయన్స్ క్లబ్ కార్యదర్శి జొన్నలగడ్డ నాగలక్ష్మి ఆధ్వర్యంలో నిర్వహింవబడిన ఈ కార్యక్రమానికి డాక్టర్ రేణుకాదేవి, డాక్టర్ కమల, డాక్టర్ నందివాడ సత్యనారాయణ న్యాయనిర్ణేతలుగా వ్యవహరించారు. ఈ చిత్రంలో ప్రదర్శనలో పాల్గొని గెలుపొందిన మూడు గ్రూపులకు చెందిన బాలలూ వున్నారు.





అనంతపురం ఇన్నర్‌వీల్ క్లబ్‌వారు ఇటీవల ఉచిత పోలియో, ట్రిపుల్ ఏంటిజెన్ ఇంజక్షన్ క్లినిక్‌ను ప్రారంభించారు. స్థానిక పురపాలక సంఘం ఆరోగ్య శాఖాధికారి డాక్టర్ పి. సుందరరావు ఈ క్లినిక్‌కి ప్రారంభోత్సవం చేశారు. ఈ చిత్రంలో క్లబ్ అధ్యక్షురాలు కె. కళావతి, కార్యదర్శి జి. పద్మ, డాక్టర్ ఉషాబాయి వున్నారు.

రాజమండ్రిలోని ప్రముఖ సాంస్కృతిక సంస్థ కళాదర్బార్ నిర్వహించిన పన్నెండవ అఖిల భారత నాట్యగాన పోటీలలో 1979 'నాట్యబాల'లుగా గెలుపొందిన యలమర్తి సుజాత (సీనియర్స్) పానుగంటి పద్మ (జూనియర్స్) బూడిద అనిత (సబ్ జూనియర్స్)





సి. హెచ్. ప్రవీణ్ (రాజమండ్రి) పుట్టిన తేదీ: **16-1-78** తల్లి పేరు: సి. హెచ్. రత్నమాల



కె. ప్రతిమ (ఏలూరు) పుట్టిన తేదీ: **1-1-79** తల్లి పేరు: కె. జాబిల్లి



వి. కిరణ్‌కుమార్ (విశాఖపట్నం) పుట్టిన తేదీ: **14-1-77** తల్లి పేరు: వి. అరుణాజ్యోతి




ఈ నెల పుట్టిన రోజులు గల శిశువుల్లో - ఏడాది పిల్లల గ్రూపులో కె. ప్రతిమ; రెండేళ్ల గ్రూపులో సి. హెచ్. ప్రవీణ్; మూడేళ్ల గ్రూపులో వి. కిరణ్‌కుమార్ 'పుట్టిన రోజు బహుమతుల'కు ఎన్నికైనారు. నిర్ణయింపబడిన పై ముగ్గురితోపాటు, మొత్తం మీద మూడు గ్రూపులలోనూ ఆరోగ్యంగా కనిపిస్తున్న మరో ఇద్దర్ని ఎన్నిక చేసి విడిగా ప్రచురిస్తున్నాము. ఫిబ్రవరి సంచికలోని ఈ శీర్షికకు ఫొటోలు పంపే వారు - వివరాలతో సహా (ఫొటో తీయించిన తేదీ ముఖ్యంగా వుండాలి. ఫొటో వెనుక పెన్సిల్‌తో వివరాలు రాయాలి. ఫొటోలు 'క్వార్టర్' సైజుకు తక్కువ సైజులో వుండకూడదు. తిప్పి పంపడానికి తగినన్ని తపాలా బిళ్లలు గల కవరు జతపరచాలి.) జనవరి 5 వ తేదీలోగా మాకు చేరేలా పంప గోరుతున్నాము.

కె. ఎల్. మంగవందన (తాడేపల్లి గూడెం) పుట్టిన తేదీ: **2-1-79** తల్లి పేరు: సుధాశ్రవణ



ఎస్. చైతన్య (బెంగళూరు) పుట్టిన తేదీ: **18-1-78** తల్లి పేరు: ఎస్. అరుణ



# విశిష్ట ఛాయాగ్రాహకురాలు శ్రీదేవి



కెమెరా భుజాన వేసుకుని ఓ అమ్మాయి ఈ రోజుల్లో కనబడడమన్నది వింతేమీ కాదు. అయితే ఒక అమ్మాయి చిట్టడవుల్లోకి వెళ్ళి తన కెమెరాలో అక్కడి వన్య మృగాలను బంధించినప్పుడు అది అపురూపమైన విషయంగానే అనిపించక మానదు. చేతిలో కెమెరా పట్టుకుని అడవిలోని అందమైన పక్షుల నుంచి భయంకరమైన క్రూర మృగాలవరకు తన కెమెరాతో 'షూట్' చేసిన సాహసి శ్రీదేవి!

పద్దెనిమిదేళ్ళ కుమారి శ్రీదేవి ఈ మధ్య ఫొటోగ్రఫీ ప్రపంచంలో సంచలనాన్ని సృష్టించింది. ఆమె తీసిన వన్య మృగాల చిత్రాలు ఫ్రాన్స్ దేశంలో అంతర్జాతీయ స్థాయి ప్రదర్శనలో పాల్గొని పలువురి ప్రశంసలు పొందాయి. ఫ్రాన్స్‌లోని 'ఆర్టిస్ట్ ఫెడరేషన్ ఇంటర్నేషనల్ డి లా ఫొటోగ్రాఫిక్'కి ఆమె ఎన్నికైంది. ఈ గౌరవం ఫొటోగ్రఫీలో అత్యంత ప్రతిభను కనబరచిన వారికి మాత్రమే లభిస్తుంది. అంతే కాదు గత సంవత్సరం లండన్‌లోని 'రాయల్ ఫొటోగ్రాఫిక్ సొసైటీ ఆఫ్ గ్రేట్ బ్రిటన్'కి అసోసియేట్‌గా కూడా ఎన్నికైంది. ఈ ఘనత దక్కిన అత్యంత పిన్న వయస్కురాలు శ్రీదేవి!

ఫొటోగ్రఫీ కళ శ్రీదేవికి వంశానుగతంగా వచ్చిన ఆస్తి. పుట్టుకతోనే అబ్బిన విద్య అని కూడా చెప్పవచ్చును. ఆమె తండ్రి బి. ఎన్. ఎస్. దేవ్ ప్రస్తుతం మధ్యప్రదేశ్‌లో చేరిన ఒకప్పటి కొరియా సంస్థానానికి మాజీ సంస్థానాధిపతి. వన్య జీవుల ఛాయాగ్రాహణకై 'రాయల్ ఫొటోగ్రాఫిక్ సొసైటీ ఆఫ్ గ్రేట్ బ్రిటన్' వారి ఫెలోషిప్ పొందిన మొదటి భారతీయుడు ఆయన. సంస్థానాలన్నీ పోయాక ఆయన బెంగళూరులో స్థిరపడ్డారు. శ్రీదేవి సోదరుడు ఆర్. దేవ్ కూడా ఛాయాగ్రహణంలో ఆరితేరిన వ్యక్తి. అందువల్ల ఇది కుటుంబపరంగా శ్రీదేవికి లభించిన విద్య అని చెప్పవచ్చును.

శ్రీదేవి తీసిన వన్య మృగాల చిత్రాలు ఇంగ్లండు, అమెరికా, ఫ్రాన్స్, ఆస్ట్రేలియా, చైనా, యూరోప్ దేశాలలో ప్రదర్శింపబడ్డాయి. మనదేశంలో వివిధ రాష్ట్రాలలో కూడా ప్రదర్శింపబడి అందరి ప్రశంసలూ అందుకున్నాయి. ఆమెకు పేరు తెచ్చాయి.

భోపాల్‌లో ఇంటర్‌వరకు చదివిన శ్రీదేవికి నలుపు తెలుపుకన్న వర్ణచిత్ర ఛాయాగ్రహణం అంటే చాలా ఇష్టం. "అందుకు కారణం అంటూ ఏమీలేదు. అడవిలో సహజ సౌందర్యమైన పరిసరాలలో స్వేచ్ఛా జీవితం గడుపుతూ హాయిగా జీవించే వన్యమృగాలను అంత సహజంగానూ, కన్నులపండువగానూ చూపాలంటే అందుకు రంగుల హంగులు అవసరం. అది వర్ణచిత్రాల ద్వారానే అధికంగా సాధ్యమవుతుందని నేను భావించాను. నలుపు తెలుపు ఎప్పుడో కాని ఉపయోగించను" అన్నారు శ్రీదేవి.

శ్రీదేవి ఈ వన్యమృగాలను ఫొటో తియ్యడం ప్రారంభించి అయిదేళ్ళే అవుతోంది. అప్పటి వరకు ఆమె తన తండ్రి, సోదరుల చిత్రీకరణ విధానం గమనిస్తూ వుండేది. అదొక్కటే ఈ రంగంలో ఆమెకుగల అనుభవం.

కెమెరాతో తన తొలి అనుభవం గురించి చెబుతూ - "ఒకసారి మా నాన్నగారు మమ్మల్నందర్నీ అక్కడి అడవి జంతువులని ఫొటో తియ్యడంకోసం ఆఫ్రికాకి తీసుకువెళ్ళారు. ఆఫ్రికా అడవులు ప్రపంచ ప్రఖ్యాతిగాంచినవాయె. అక్కడికి వెళ్ళిన తర్వాత మా నాన్నగారి దగ్గర అదనంగా వున్న 16 ఎమ్. ఎమ్. కెమెరాని ఉపయోగించేందుకు ఎవరూ లేకపోయారు. మా నాన్నగారు ఆ కెమెరా నా చేతికి యిచ్చి 'యిలా చెయ్యి...అలా చెయ్యి' అని సలహా చెప్పారు. ఫిలిం డెవలప్ చేసిన తర్వాత నేను తీసిన చిత్రాలన్నీ బాగా వచ్చాయి. అప్పటికి నాకు ఐదు సంవత్సరాలు మాత్రమే" అంది శ్రీదేవి.

అయితే జ్ఞానం వచ్చిన తర్వాత ఆమె తీసిన మొదటి చిత్రం - బండిపూర్ అడవుల్లో మదించిన ఒక ఏనుగు!

శరీరానికి లవణాలు కావల్సినప్పుడల్లా కాలితో మన్నుకొట్టి తొండంతో తీసుకుని నోటిలో వేసుకుని ఊదడం ఏనుగుల అలవాటు. ఆ దృశ్యాన్ని అద్భుతంగా తీసింది శ్రీదేవి. ఇదే ఆమె మొట్ట మొదటి చిత్రం. ఇది తియ్యడానికి ఆమె ఉపయోగించిన కెమెరా - నిక్కాన్. ఈ కెమెరాతో ఆమె తీసిన పద్దెనిమిది స్లైడులు ఫ్రాన్స్‌లో ఆమెకి ఆ గౌరవం, ఆదరణ లభింపజేశాయి. 'ఈ కెమెరా నాకన్న ఒక సంవత్సరం పెద్దది' అని చెప్పారు శ్రీదేవి.

ఫొటోగ్రఫీకి ఏకాగ్రత, దృఢమైన నిర్ధారణ, టైమింగ్ అవసరమని అభిప్రాయపడే శ్రీదేవి ఫొటోలు తీసేటప్పుడు కాంతి కిరణాల తీవ్రత కోసం లెక్కగట్టే పరికరాలను ఉపయోగించదు. ఇంత లైటు వుంటే ఈ విధంగా తియ్యాలి అన్నది ఆమె మనసులో ముద్ర వేసుకుపోయింది. ఇటువంటి సాధనాలు ఉపయోగించడం సృజనాత్మక ఛాయాగ్రహణానికి అడ్డంకి అన్నది ఆమె భావన.

శ్రీదేవికి ఫొటోగ్రఫిలోనే కాక క్రీడలలో కూడా ఉత్సాహం వుంది. ఈత, టెన్నిస్, బాస్కెట్‌బాల్, క్రికెట్, బాడ్మింటన్, టేబుల్ టెన్నిస్, బిలియర్డ్స్‌లలో ఆమెకు ప్రవేశముంది. సంగీతం, సాహిత్యాధ్యయనం ఆమెకు ప్రియమైనవి.

''వన్యమృగాలని ఫొటోలు తీసే వనితలు మన దేశంలో నాకు తెలిసి ఇద్దరమే వున్నాము. మరొకరు శ్రీమతి శర్మ. ఇలా ఇద్దరితోనే మడి గట్టుకుని కూర్చుంటే లాభంలేదు. అన్ని రంగా





లలో ముందంజ వేస్తున్న వనితలు ఈ రంగంలోకి కూడా ప్రవేశించాలి. వన్యజీవుల ఛాయాగ్రహణ క్షేత్రానికి రావాలి. అప్పుడు ప్రకృతిని శోభింపజేసే మరిన్ని సుందరమైన ఛాయాచిత్రాలు వస్తాయి'' అని తన అభిప్రాయాన్ని వ్యక్తం చేశారు శ్రీదేవి. □








ఎమ్. వేదవల్లి, విశాఖపట్నం

మనకు పనికిరావని పారవేసే పాలకవర్లు ఏ విధంగా ఉపయోగించుకోవాలో తెలియజేస్తారా?

చాలా ఉపయోగకరమైన ప్రశ్న వేశారు. ఎందుకంటే వీటిని ఏమి చేయాలో తెలీక చాలామంది పారవేస్తుంటారు. కాని వీటితో చేసిన బ్యాగ్స్, కర్టెన్స్ ఎంతో బాగుంటాయి. పైగా మెరుస్తూ నావల్టీగ వుండి, మనం చెప్పేదాకా అవేమిటో కూడా తెలుసుకోలేరు. వీటితో పువ్వులు, మొగ్గలు చేసుకుని మనకెలా కావాలో అలా కుట్టుకోవాలి. వుంటుంది.

ఇక పువ్వులు, మొగ్గలు ఎలా చేయాలో చెబుతాను. ఫోటో చూడండి మీకు బాగా అర్థమవుతుంది. పెద్దపువ్వుకు 5 అంగుళాల వ్యాసం గల గుండ్రటి ముక్క కావాలి. ఒక బ్యాగ్‌కు 2 ముక్కలు అవుతాయి. చిన్న పువ్వుకు 3 అంగుళాల వ్యాసం గల ముక్క కావాలి. ఒక బ్యాగ్‌కు 6 పువ్వులు సులభంగా అవుతాయి. మిగిలిన ముక్కను పారవేయక మొగ్గలు చేసుకోటానికి వుపయోగించాలి. మొగ్గలకు అంగుళంన్నర వెడల్పు, అంగుళం పొడవు ముక్క కావాలి. మరీ పెద్ద మొగ్గలయితే బాగుండవు. చిన్నవయితేనే ముద్దుగా వుంటాయి. మొగ్గలతో కర్టెన్‌కు కుట్టినప్పుడు డిజైన్ చుట్టూ పాలకవర్ ముక్క సన్నగా వుండేలా రెండు పొరలు తీసుకొని పైపింగ్‌లా కుడ్తే మొగ్గల కుట్లు కనిపించక డిజైన్ స్పష్టంగా వుంటుంది. నెమళ్ళ కళ్ళకు నల్లటి గుండ్రటి ఓ మోస్తరు సైజు పూసలు కుట్టాలి.

పువ్వులు: గుండ్రటి ముక్క చుట్టూ పాయంట్ ఒక అంగుళం వదలి మిషన్ మీద పోగు పోయాలి. రెండు కొనలలోనూ ఒక్కొక్క దారం పట్టుకు నిదానంగా లాగితే కుచ్చుగా వస్తుంది. పువ్వులాగా చేత్తో బాగా సర్ది ఈ రెండు దారాలూ కలిపి సూదికి ఎక్కించి నాలుగు కుట్లు అటు ఇటు వేస్తే మధ్యన గట్టిగా వుంటుంది. ఇది రైట్ సైడ్ దీని మీద పుప్పొడిలాగా బటన్‌కు గుడ్డ వేసి కుట్టాలి. కర్టెన్ పైపింగ్‌కు ఏ రంగు వేస్తామో అదే రంగు గుడ్డ అయితేనే బాగుంటుంది దీనికి.

పుప్పొడి: పువ్వు సైజును బట్టి ప్యాంట్ బటన్ గాని, షర్ట్ బటన్‌నుగాని తీసుకోవాలి. చిన్న బటన్‌కు ఒక అంగుళం చదరం ముక్క తీసుకొని పాయంట్ వన్ ఇంచ్ వదలి గుండ్రంగా పోగు పోయాలి. అడుగున బటన్ వుంచి లాగి, దాని



విటిని మిషన్ మీదే కుట్టాలి. కాని చాలా జాగ్రత్త అవసరం. ఏమాత్రం బలంగా లాగినా కట్ అవుతాయి. అందుకే లాగేటప్పుడు చాలా సున్నితంగా లాగాలి. ఫోటోలో ముగ్గు డిజైన్ వున్నది పూలతోనూ, నెమళ్ళు మొగ్గలతోనూ కుట్టినది. కర్టెన్స్‌కు కేస్మెంట్ కుట్లు లైనుగా వేస్తే, దాన్ని అర్ధ అంగుళం వెడల్పు టేప్‌తో కవర్ చేస్తే వెనకవైపు కూడా డిజైన్ లాగావుండి, రెండువైపులా అందంగా కనిపిస్తుంది. పువ్వులను చేత్తో కర్టెన్ మీదికి టాక్ చేయాలి. మొగ్గలను మాత్రం మిషన్ మీద కుట్టాలి. మొగ్గల బ్యాగ్‌కు కావలసిన సైజు, షేప్‌లో రెండు తెల్ల శాటిన్ గుడ్డలు కత్తిరించుకొని, పైనుండి చుట్టూ మొగ్గలు కుట్టుకోవాలి. ఆఖరున మధ్యలో తెల్ల బటన్‌కు పాలిథిన్ ముక్కతోనే కవర్ కుట్టి పెట్టాలి. ప్రక్కకు, హేండిల్‌కు 2 అంగుళాల వెడల్పు ముక్కకు మొగ్గలు పెట్టి, మధ్యలో పొడవు ముక్కలతో మడుస్తూ కుట్టాలి. అప్పుడు మధ్య కుట్లు కనిపించవు. (మొగ్గలకు వేసిన కుట్లు) లోపల సాటిన్ లైనింగ్ తెల్ల ప్లాస్టిక్ జిప్ బక్రం (Bakram) సహాయంతో వేయాలి. పట్టు చీరలు కట్టినప్పుడు ఈ బ్యాగ్ ఉపయోగిస్తే హుందాగా







చుట్టూ 3,4 మార్లు దారం చుట్టి ముడివేసి, మిగిలిన గుడ్డ కత్తిరించాలి. దీనిని పువ్వు మీద మధ్యలో వుంచి బయటికి కనిపించకుండా అడుగున కుట్లు వేయాలి. వసుపురంగు గుడ్డ మధ్య పుప్పొడికి వాడితే తెల్ల చేమంతిలాగ వుంటుంది.

మొగ్గలు: ముక్కను సగంకన్న తక్కువగా మడిచి, మధ్యలో పైన పాయింట్‌గా వుంచి కుడి, ఎడమలు మడిచి ఓ వైపు మాత్రం ఒక కుట్టు చేత్తో వేయాలి. ముక్కోణాకారంలో వుంటుంది మొగ్గ. మొగ్గలన్నీ కుట్టుకోవాలి ముందుగా. చాలా మొగ్గలు కావాలి. టైమ్ బాగానే పడుతుంది మరి మొగ్గలు తయారైన పిమ్మట కావలసిన ఆకారంలో మిషన్ మీద కుట్టుకోవాలి.

ఇకపోతే, అన్నింటికన్నా ముందు చేయవలసింది ఏమిటంటే పాల బ్యాగ్స్‌ను ముందు జాయింట్ వద్ద, తర్వాత ఓపెన్ వద్ద కత్తిరిస్తే 6 అంగుళాల వెడల్పు, 12 అంగుళాల పొడవుగల ముక్క వస్తుంది అన్ని బ్యాగ్స్‌ను ముందు ఇలాగ విడదీసుకొని పాల వాసన పోవటానికిగాను సర్ఫ్ నీళ్ళలో ఒక గంట నానబెట్టి, తర్వాత మంచి నీళ్ళలో జాడించి గుడ్డతో తుడిచి, 15 నిమిషాలు ఎండలో ఆరబెట్టాలి. ఇది చాలా ముఖ్యం. చిన్న పిల్లలు స్కూల్‌కు తీసికెళ్ళే బ్యాగ్స్‌కు కూడా ఇలా పువ్వులు, మొగ్గలు కుట్తే చాలా బాగుంటుంది.

డోర్ కర్టెన్స్‌కు మొగ్గలతో డిజైన్ కుట్టాలంటే ముందస్తుగా ఒక తెల్లని గుడ్డలో డిజైన్ పెన్సిల్‌తో గీసుకుని, ఈ తెల్ల గుడ్డ మీద మొగ్గలు నింపాలి. తర్వాత జాగ్రత్తగా మిగిలిన తెల్లగుడ్డనంతా కత్తిరించి సన్నగా పైపింగ్ కుట్టి, ఆ తర్వాత దీనిని కర్టెన్ మీద కుట్టాలి. అంటే అప్లిక్‌లాగన్నమాట. వెనకవైపు కుట్లు కనిపించకుండా టేప్ కుట్తే డిజైన్ అవుట్‌లైన్‌గా కనిపిస్తుంది.



కె. జి. హేమలత, కుప్పం

దోమతెర గుడ్డపై జాకెట్ చేతులకు డిజైన్లు ఎలా వేస్తారో తెలియజేయగోరుతున్నాను.

మేటీబట్టకు ఎలా గళ్ళు లెక్కపెడ్తామో అలానే దీనికి రంధ్రాలు చూసుకోవాలి. ముందుగా మనం వేసే డిజైన్ ప్రకారం రంధ్రాలు అడ్డంగా వున్నాయో, నిలువుగా వున్నాయో చూసుకోవాలి. ఇది చాలా ముఖ్యం. విచ్చెల దారం అయితే 6 పోరలతోనూ, పురిదారం అయితే 2 పోరలతోనూ కుట్టాలి. పెద్ద సూది కావాలి. ఫోటోలో మధ్యన వున్న డైమండ్ ముందుగా కుట్టుకుని ఆ తర్వాత లోపలవున్న డైజీలాంటి పువ్వులు కుట్టుకోవాలి రేకులకుగాను సూది మీదికి 20-30 మార్లు దారం చుట్టి ఫ్రెంచ్ నాట్ వేయాలి. (రింగ్‌స్టిచ్)

వంకీలు



చేతులకు ఇలాంటి డైమండ్స్ నిలువుగా కుట్టుకుంటే చాలా అందంగా వుంటాయి. చలికాలానికి తగ్గట్టు కావాలనుకుంటే వూల్‌తో జిగ్‌జాగ్ డిజైన్ నిండా కుట్టుకుంటే చలికి తట్టుకోగలుగుతాం. చేతులకు గాను ముందుగా షేప్ కట్ చేయకుండా ఔట్‌లైను. గుర్తుపెట్టుకుని దారంతో టాకాలు వేయాలి. అప్పుడే మీకు తెలుస్తుంది రంధ్రాల తీరుతెన్నులు మొదట్లో గుడ్డ కత్తిరించేటప్పుడే ఈ హెూల్స్ ప్రకారం కత్తిరించాలి. లేకపోతే తప్పు వస్తుంది. ఈ నెట్ వర్క్ చేసిన జాకెట్ చేతులు చాలా అందంగా కనిపిస్తాయి. 6 లేక 8 అంగుళాల వెడల్పులో దోమతెర గుడ్డ మీద ఎంబ్రాయిడరీ చేసి చీరలకు బార్డర్‌గా వేస్తే చాలా గ్రాండ్‌గా కనిపిస్తుంది. ఫ్రేమ్ ఉపయోగిస్తే కుట్టు బాగా వస్తుంది. బొమ్మ, ఫోటో చూస్తే వివరంగా అర్థమవుతుంది.

ప్రకృతి:

# మీ చర్మాన్ని సంరక్షించే విశేషజ్ఞుడు

ప్రకృతి మీకు అందమైన, నునుపైన చర్మాన్నిచ్చి అంతటితో ఊరుకోలేదు. దాంతోబాటే ఆ చర్మాన్ని అలాగే అందంగా ఉంచడంకోసం సాధనాల్ని సమకూర్చింది. ప్రకృతి సహజసౌందర్య సాధనాలు పసుపు* గంధపుచెక్క* కుంకం పువ్వు* మేం వీటన్నిటినీ ఒకేచోట పొందు పరిచాం — ఒకే క్రీమ్‌లో.

కృత్రిమంగాని పదార్థాలుగల శింగార్ టర్మరిక్ క్రీమ్, మీ చర్మానికి మరింతరంగు, మరింత నునుపుదనం, సాఫీగా ఉండేతీరు అత్యంత సహజమైన రీతిలో సమకూరేందుకు తోడ్పడుతుంది. దీన్ని కొనండి...వాడి చూడండి... కేవలం 3 నెలలోనే ఫలితాలను మీ అంతట మీరే చూసి తెలుసుకోండి.

- పసుపు క్రిమినిరోధకంగా పనిచేస్తూ, మీ చర్మానికి మరింత రంగునిస్తూ దాన్ని పసిపాప చర్మంలా మృదువుగా రూపొందిస్తుంది.
- గంధపు చెక్క మీ చర్మానికి చల్లదనాన్నిచ్చి, మొటిమల్ని మాయంచేసి, అంటిపెట్టుకొని వుండే సుగంధాన్నిస్తుంది.
- కుంకం పువ్వు చర్మానికి కలిగే వాపులు, ఎలర్జీలకి శమనత్వాన్ని యిస్తుంది. వీటన్నిటితోపాటు ఆహ్లాదకరమై, అంటిపెట్టుకుని వుండే పరిమళం కూడా.




కొత్త

# శింగార్

## టర్మరిక్ బ్యూటీ క్రీమ్

— చర్మ సంరక్షణకోసం ప్రకృతి సహజమైన సాధనం

భారతదేశమంతటా విశ్వసించే సాంప్రదాయికమైన సౌందర్య సాధనాలను తయారుచేసే శింగార్ సమర్పణ




శింగార్ కాస్మెటిక్స్ ప్రైవేట్ లిమిటెడ్

everest/79/SH/63 tl

# నేరస్థుల కథలు



2

“ చున్నీ...ఈ అమ్మగారు మీ ప్రాంతం నుంచే వచ్చారు!'' అంటూ లేడీ డాక్టరు వంటగదిలో వున్న ఒక ఖైదీని పలకరించారు.

మమ్మల్ని చూడగానే ఆ యువతి నమస్కరిస్తూ, చేతులు కట్టుకుని నిలబడింది.

“ చున్నీ....మీది ఏవూరు?'' అని పహాడీ (భాష)లో ప్రశ్నించాను.

ఆ ప్రాంతం భాషలో మాట్లాడితే ఆమెకు సంతోషం కలుగుతుందనుకున్నాను కానీ నా మాటలు ఆమె హృదయంలో కల్లోలాన్ని రేకెత్తిస్తాయని వూహించలేకపోయాను?

అకస్మాత్తుగా చున్నీ-తన చేతులతో ముఖాన్ని కప్పుకుని, వెక్కి వెక్కి ఏడ్వడం ఆరంభించింది.

“ చాలాకాలం తర్వాత మీ ద్వారా తన ప్రాంతపు మాటలు వినడం వల్ల, అక్కడి జ్ఞాపకాలు ఆమెను కలవరపరచి వుంటాయి. లేకపోతే, ఆమె యిలా ఏడవదు. ఆమె ఈ విధంగా ఏడవడం మేమెప్పుడూ చూడలేదు'' అని లేడీ డాక్టర్ ఆంగ్లంలో చెప్పింది. చున్నీ 'మూడ్' మార్చాలని-“చూడు... నాకు కొంచెం పనుంది. అమ్మగారికి మన పాఠశాల, జైల్లోని తక్కిన విభాగాలు చూపించు!'' అని ఆమెకు పురమాయించింది.

చున్నీ నా ముఖం చూడలేక, తల వంచుకునే “ పదండి '' అన్నది.

ఆ పాఠశాలలోని పిల్లలందరూ ఆరేళ్ల వయసు నిండనివారే. కానీ, వాళ్ల ముఖాలలో తాండవించే దైన్యం, జీవితంలో ఎంతో అనుభవాన్ని సంపాయించినట్లుగా స్ఫురింపజేస్తోంది.

వాళ్లకు ఆరేళ్లు రాగానే, నేరస్థులుగా అంతవరకు తమతోపాటే జైలులో వున్న తల్లులకు దూరమౌతారు. ఆ తర్వాత తమ భవిష్యత్తు ఏవిధంగా వుంటుందో వాళ్ళకూ తెలియదు. వాళ్ల తల్లులకూ తెలియదు! ఐనా, ఆరేళ్ళ తర్వాత తల్లి ప్రేమ వాళ్లకు అవసరం లేదన్నట్లుగా వాళ్ళను తల్లుల నుంచి విడదీసే ఈ నిబంధన ఎందుకు వుండాలనీ నాకు అర్థం కాలేదు!

ఆ స్కూలు పిల్లల్లో కొందరు పాటలు పాడారు. కొందరు నాట్యం చేశారు. నేను అక్కడకు రావడం వల్ల కొంతసేపైనా — ఆ పిల్లలు స్వతంత్రంగా వుండగలిగిన వాతావరణం ఏర్పడినందుకు తమలో తాము చాలా ఆనందించినట్లుగా నాకు అనిపించింది!

స్కూల్లోంచి బయటికి వచ్చాము.

“ మీరు చున్నీతో ఏకాంతంగా మాట్లాడతారనుకుంటాను!'' మాకూడా వున్న జైలర్ - నన్ను ఒక గదిలో కూర్చోబెట్టి వెళ్ళిపోయింది. నా కుర్చీ ప్రక్కనే మరో కుర్చీ వున్నా కూడా చున్నీ నా కాళ్ళ దగ్గరే కూర్చుంది.

ఆమె కథ విన్న తర్వాత, ఆమెపట్ల నాకు ఏర్పడిన సానుభూతి వర్ణనాతీతం.

---

**గౌరాపంత్ శివాని**

---

అది హిమాలయ పర్వత ప్రాంతాలలో వున్న ఒక కుగ్రామం.

ఆ గ్రామంలో పొలాలకు దూరంగా వున్న కొండచరియల్లో చున్నీ మేకలు కాస్తూ వుండేది. ఇంటిపనులు కాగానే, మేకలను తోలుకుంటూ వెళ్ళడం, సాయంత్రానికి తిరిగి వచ్చెయ్యడం ఆమె దినచర్యల్లో ఒక తప్పనిసరి కార్యక్రమం....

పక్కగ్రామంలో వుంటున్న ఒక యువకుడు ఒక రోజు ఏదో పని మీద ఆ ప్రాంతాలకు వచ్చాడు. చున్నీ అందం, ఆమె అమాయకత్వం - అతన్ని విశేషంగా ఆకర్షించి వుంటాయి. తన తల్లికి చున్నీ నచ్చినదా లేదా అన్న విషయాన్ని కూడా పట్టించుకోకుండా - తను ఆమెనే పెళ్లి చేసుకుంటానని పట్టుపట్టాడు.

ఒక్కగానొక్క కొడుకు అలా పట్టుపట్టేసరికి వేరే దారిలేక, అతని తల్లి - చున్నీతో పెళ్లికి అంగీకరించింది. కానీ, ఆమెకు లోలోపల చున్నీ అంటే ద్వేషం ఏర్పడింది. తన మాట కూడా లెక్క చేయనంత స్థితికి కొడుకు వచ్చాడంటే, చున్నీ అతన్ని బాగా తన వైపుకు తిప్పుకోగలిగిందని ఆమె అనుమానం!

కాపురానికి వచ్చిన తర్వాత - చున్నీకి అత్తగారి దునరుసలు ఆరంభం అయ్యాయి. అయినా, భర్త తనపట్ల చూపే ప్రేమ కారణంగా, అత్తగారి మాటలను అప్పటికప్పుడే మర్చిపోతూ వుండేది.

చున్నీకి వివాహమై పదిహేను రోజులైంది. అప్పుడే మన దేశానికీ, చైనాకి మధ్య యుద్ధం ఆరంభమైంది. యుద్ధంలో చున్నీ భర్త - సైనికుడిగా చేరవలసివచ్చింది. ఆ తర్వాత ఎంతకాలం ఎదురుచూసినా, చున్నీ భర్త గురించిన వివరాలు తెలియలేదు. అందరూ చున్నీ భర్త - యుద్ధంలో చనిపోయాడనే అనుకున్నారు.

దాంతో అంత కాలం తన కోడలిపట్ల లోలోపల అణగారుతూ వచ్చిన ద్వేషం ఒక్కసారిగా భగ్గుమంది. 'నువ్వే నా కొడుకును పొట్టన పెట్టుకున్నావ్' అని చున్నీని ఆమె అత్త - తిట్టడం ఆరంభించింది.

ఐతే, చున్నీకి తన భర్త బ్రతికేవున్నాడని ఒక గట్టి నమ్మకం. అందువల్లే ఆమె తన మంగళ సూత్రం, బులాకీవంటి ఆభరణాలు తీసివేయడానికి ఎంతమాత్రం అంగీకరించలేదు. తన భర్త రోజూ కలలోకి వచ్చి, తనతో మాట్లాడుతూ వున్నాడని అమాయకంగా అందరితోను చెబుతూ వుండేది.

చున్నీ స్థితి ఆ వూళ్లోని మగ పెద్దలు పట్టించుకోకపోయినా, ఆడవాళ్ళు మాత్రం ఆమెను సూటిపోటి మాటలలో వేధించసాగారు.

భర్త చచ్చిపోయినా, టింగురంగామని ఆభరణాలు అలంకరించుకుని, నవ్వుతూ, తుళ్ళుతూ తిరుగుతూ వుందని, ఈమె ప్రవర్తన మంచిది కాదనీ - ఆమెను బహిష్కరించినట్లు చూడడం ఆరంభించారు.

ఒకప్రక్క యింట్లో అత్త పోరు, మరోప్రక్క బయట ఆడవాళ్ళు దెప్పిపొడుస్తూ వుండడంతో. చున్నీకి మనశ్శాంతి లేకుండాపోయింది.

ఒక రోజు చున్నీ పొలానికి వెళ్లి గడ్డి కోసి ఆ మోపును తల మీద పెట్టుకుని ఇంటికి వస్తోంది. తమ పక్కింట్లో వుంటున్న ఒకామె దార్లో ఎదురై, "ఏం .... భలే హుషారుగా వున్నావు. ఎవరి దగ్గరకు వెళ్ళి వస్తున్నావ్" అని ఒక వేశ్యతో మాట్లాడినట్లుగా మాట్లాడింది.

దాంతో చున్నీ అగ్గి మీద గుగ్గిలమే అయింది. ఆమెలో రగులుతోన్న ఆవేశం ఒక్కసారిగా విజృంభించింది. ఆ క్షణంలో తాను ఏం చేస్తున్నదీ కూడా ఆలోచించకుండా కోపంగా చేతిలో వున్న కొడవలిని ఆమె మీదికి విసిరేసింది. ఆ కొడవలి ఆమె గొంతుకు తగిలింది. అంతే! ఆమె అక్కడికక్కడే విరుచుకు పడిపోయింది.

ఆ దృశ్యాన్ని చూసి, చున్నీ భయంతో గడ్డి మోపు అక్కడే పారేసి, తన పుట్టింటికి పారిపోయింది. కొడవలి దెబ్బతిన్న ఆ స్త్రీ చనిపోవడంతో, హత్యా నేరానికి పోలీసులు చున్నీని అరెస్టు చేసి, ఆమెను 'అల్మోడా' జైలుకు తీసుకుపోయారు.

ఆమెను బ్రహ్మ హత్యాపాతకం చుట్టుకున్నదని, జామీను యివ్వడానికి ఎవరూ ముందుకు రాలేదు. ఆమె తండ్రి కూతురి పరిస్థితిని చూసి, విద్యుద్ఘాతం తగిలినవాడిలా అయిపోయాడు. పోలీసులు కూతుర్ని జీపులో తీసుకుపోతూ వుంటే, విరాగిలా మౌనంగా ఇంట్లోనే కూర్చుండిపోయాడు. తల్లి – జీపు వెనుకే–ఏడుస్తూ కొంత దూరం పరుగెత్తింది. ఆ తర్వాత వాళ్ళు ఏమయ్యారో — చున్నీకి తెలియనేలేదు.

కోర్టులో ఆమెను ప్రశ్నించారు. "నువ్వు ఆమెను హత్య చేశావా?" అని.

"నేను ఆమెను హత్య చెయ్యాలని అనుకోలేదు. కానీ, ఆ సమయంలో అలా అయిపోయింది!" అన్నది చున్నీ అమాయకంగా.

ఆమెకు యావజ్జీవ కారాగారవాస శిక్ష ప్రాప్తించింది.

స్వతహాగా చున్నీలో వున్న మంచితనమే ఆమెను కాపాడుతూ వచ్చింది. తన వినయ విధేయతలతో ఆమె జైలు అధికారుల సానుభూతి చూరగొన్నది. చాలా కొద్దికాలంలోనే అందరి ఆదరాభిమానాలు సంపాయించి, తక్కిన ఖైదీలకు సత్ప్రవర్తనలో 'మార్గదర్శి'గా జైలు అధికారుల ద్వారా ఆమెకు ప్రత్యేకమైన 'బాడ్జ్' కూడా లభించింది. నిరక్షరాస్యురాలైన ఆమె-జైలులోనే చదువు నేర్చుకుంది.

ఇలా కొన్నాళ్ళు ఆమె జైలు జీవితం - కొనసాగుతుండగా, ఒకరోజు, సగటు సినిమాలలో జరిగేలా, హఠాత్తుగా చున్నీ భర్త ఆమె ముందు ప్రత్యక్షమయ్యాడు!

తన భార్య కావాలని హత్య చెయ్యలేదని, ఆమెకు న్యాయం జరిగేలా చూడమని పై కోర్టుకు అర్జీ దాఖలు చేశాడు. ఆ తర్వాత హైకోర్టుకు, సుప్రీం కోర్టుకు కూడా వెళ్ళాడు. చివరకు ఆమెకు నాలుగేళ్ళు జైలుశిక్ష నిర్ధారణ అయింది!

ఈ మధ్యలో భర్త ఆమెకు తరచుగా ఉత్తరాలు రాస్తూ వుండేవాడు. ఆ ఉత్తరాలలోనే, అతన్ని చూసుకుని ఆనందిస్తూ వుండేది చున్నీ.

భర్త - ఆమెను చూడడానికి బయలుదేరితే, అతని తల్లి, వెళ్ళడానికి వీలులేదని ఆంక్ష పెట్టేది. కారణం ఒకసారి బహిష్కరింపబడిన యువతిని, ఎవరు కలుసుకుని మాట్లాడినా, ఆ వ్యక్తి వూళ్లో వాళ్ళందరికి విందు భోజనం ఏర్పాటు చేయాలనేది వాళ్ళ కులంలోని సంప్రదాయమట!

నాలుగేళ్ల జైలుశిక్ష విధించిన తర్వాత ఆమె ఈ జైలుకు వచ్చి రెండేళ్లయినా, భర్త గురించి ఆమెకు ఏమీ తెలియలేదు.

అంతవరకు జైలులో వున్న అన్ని రోజులూ, భర్త ఉత్తరాలను చదువుకుని, తృప్తి పడ్డ చున్నీకి ఆ తర్వాత భర్త నుంచి ఏ కబురూ రాకపోయేసరికి, ఆమె మానసికంగా ఎంతగానో క్రుంగిపోయింది.

తన భర్త మరొకరిని పెళ్లిచేసుకున్నాడేమోనన్న అనుమానం కూడా ఆమెలో చోటు చేసుకుంది. ఐనా, ఆమె గుండె రాయి చేసుకుంది. జైలు జీవితానికి ఆమె పూర్తిగా అలవాటు పడిపోయింది.

"నన్ను పూర్తిగా ఇలా వదులుకోవడమే నా భర్త ఉద్దేశ్యమైతే, నా కోసం కోర్టుల చుట్టూ తిరిగి, నా శిక్షను ఎందుకు తగ్గించాలి!" అని అమాయకంగా చున్నీ ప్రశ్నించింది.

"నీ గురించి మీ తల్లిదండ్రులతో మాట్లాడతాను. వాళ్ల చిరునామా చెబుతావా?" అని అడిగాను.

"ఆ పుణ్యమూర్తుల పేర్లు ఈ పాపపు నోటితో ఎలా ఉచ్చరించను!" అన్నది చున్నీ. ఎంత బ్రతిమిలాడినా, చున్నీ వాళ్ల పేర్లు చెప్పలేదు.

వాళ్ల వూరు గుర్తులు మాత్రం చెప్పింది. వాళ్ల తల్లి, తండ్రి ఎలా వుంటారో చెప్పింది....కానీ ఆమె చెప్పిన గుర్తులతో వాళ్ళను కలుసుకోవడం చాలా కష్టమనిపించింది.

ఆమె మంచితనానికి, నిర్మల హృదయానికి ఇంతటి ఘోరమైన శిక్ష లభించినందుకు నా మనసు మౌనంగా ఆక్రోశించింది.

"నా భర్త ఇక నన్ను వదిలేసినట్లే. పుట్టింటి వాళ్లకు నా ముఖం చూపడం నాకు ఇష్టం లేదు. యావజ్జీవకారాగారం ఐతే, ఈ జైలునే నా ఇల్లుగా భావించి స్థిరపడేదాన్ని. కానీ....ఇంకో రెండేళ్లలో నన్ను బయటికి పంపించివేస్తారు... అప్పుడు నేను ఎక్కడికి వెళ్లాలి....దొరసానీ....మీరే చెప్పండి... మీరే చెప్పండి?" అని ఆమె రోదిస్తూనే, నన్ను ప్రశ్నించింది.

ఆమెకు నేనేం సమాధానం చెప్పను? *

"వెయ్యి అబద్ధాలు ఆడైనా ఒక్క పెళ్లి చెయ్యమన్నారు పెద్దలు. అంటే అబద్ధం అనేది శుభ కార్యమైన పెళ్లిలో కూడా పనికివస్తుందన్నమాట. అబద్ధాల పంచాంగానికి అరవై ఘడియలు త్యాజ్య మట. మామూలువాటికే కాస్తో కూస్తో తేడా వుంటే యిక దీని విషయమై వేరే చెప్పాలా ?

మనవారు కొన్ని విషయాలలో అబద్ధాన్ని 'మినహాయింపు' చేస్తారు. అంటే ఆ విషయాలలో అబద్ధమాడినా, నిజమాడితే వచ్చే పుణ్యం దక్కక పోయినా, అబద్ధమాడితే వచ్చే పాపం లేదా దోషం రాదని భావం.

" వారిజాక్షులందు, వైవాహికములందుఁ
బ్రాణ, విత్త, మానభంగమందు
చకిత గోకులాగ్ర జన్మ రక్షణమందు
బొంకవచ్చు, నఘము పొందదధిప ! "

అని మన పురాణాలే ఘోషిస్తున్నాయి.

ఒకానొక ఆధునిక కవిని, యెవరో కవిత్వం వ్రాసి యివ్వమని తొందరపెట్టారట, పెండ్లికో, పేరంటానికో మరి ! ఆయన ఒక్క నవ్వు పువ్వులా రువ్వుతూ—

" అబద్ధాలాడడమంత సులభం
అవదుసుమా ! కవిత అల్లడం "

అని తేలికగా కొట్టిపారేసారట.

అయినా అబద్ధం ఆడేది కూడా అంత తేలికైనది కాదు. ఎందుకంటే వున్నది వున్నట్టుగా చెప్పే నిజాన్ని తేలికగా చెప్పవచ్చు. కానీ కల్పించి చెప్పే అబద్ధాన్ని వెల్లగ్రక్కడం తేలిక కాదు.

కొందరు ఆడవారు అబద్ధాలాడితే గోడ కట్టి నట్లుంటే, మరికొందరివి తడిక కట్టినట్లుంటుంది. లేదా గోడ మీద దౌడు తీసినట్లు వారి అబద్ధం క్షణంలోనే యెగిరిపోతుంది. కాబట్టి అబద్ధమాడేది కూడా ఒక కళ అని యిందుమూలంగా అబద్ధమే ధ్రువపరుస్తున్నది. అంతెందుకు, హరిశ్చంద్రుడు అబద్ధమాడలేకనేకదా రాజ్యాన్ని, నిజదార సుతులను పోగొట్టుకొని అష్టకష్టాలతో అల్లాడినాడు. లేకుంటే 'రాజా' లా అబద్ధమాడివుంటే మహారాజులా కాలు మీద కాలు వేసుకొని రాజ్యమేలేవాడే.

ఒక సాయంత్రంపూట యేదో ఆలోచిస్తూ కూర్చున్నాను. అంతలోనే "చూసావా అమ్మాయ్ ! నా మహత్తుతో సత్యహరిశ్చంద్రుణ్ణి కూడా చిత్తు చేసాను...." పకపకమంటూ అంతర్ధానమైపోయింది అబద్ధం. అలా వెళ్తూ అబద్ధం యింకా యిలా అంది :

"నా పేరు అన్ని పాఠశాలలలోను టంగుటూరి మిరియాలంతేసి అక్షరాలతో "అబద్ధమాడరాదు" అని వ్రాసి వుంటుంది. నా ప్రస్తావన న్యాయ స్థానాలలోనూ ముద్దాయిలు ప్రమాణం చేసేటప్పుడూ "దేవుని యెదుట ప్రమాణం చేసి నిజమే చెబుతాను. అబద్ధమాడను" అని నిజం కక్కినా, కక్కక పోయినా నా పేరుమటుకు వారిచేత కక్కిస్తారు. నా మీద కొన్ని సామెతలు లేవదీసారు. మచ్చుకు కొన్ని యిచ్చట ముచ్చటిస్తాను. "బొంకరా, బొంకరా పోలిగా అంటే టంగుటూరి మిరియాలు తాటికాయలంతేసి అన్నాట్ట."

'రామాయణం రంకు—భారతం బొంకు' ఆ మాటకొస్తే అసలు యీ మనుష్యులూ, ప్రపంచమూ సర్వమూ మిథ్య (అసత్యం). జగమే మాయ, బ్రతుకే మాయ.

"సర్వం మిథ్య నాయనా !" ఎన్నడూ అబద్ధాలాడి యెరుగని సర్వసంగపరిత్యాగుల, సాధు పుంగవుల నాలుకల మీద కూడా నా శబ్దం నాట్యమాడుతుంది.

శివుని జటాజూటంలోని జటల్లాగ చీటికి మాటికి జూటామాటలల్లేవారు యెందరో యీ ఝూటా ప్రపంచంలో. అబద్ధాలాడడమంటే వారికి మంచినీళ్ల ప్రాయమే. అంతేకాదు వెన్నతో పెట్టిన విద్య కూడా.

ఎవరైనా "నే నెప్పుడూ అబద్ధమాడను" అంటూ సారెసారెకు చెబుతుంటే—"అబ్బో ! చాల్లేవయ్యా ! మహా సత్యహరిశ్చంద్రుని మాదిరి మాట్లాడుతావుకానీ," అంటూ "హరిశ్చంద్రుడు వెడుతూ తనకు మారుగా యితగాణ్ణి వుంచి పోయాడు చూడండర్రా !" అని యెగతాళిచేయడం కూడా కద్దు.

నూటికి నూరుపాళ్లు అబద్ధాలాడితే "శుద్ధ అబద్ధం" అని తాటాకులు కడతారు. అబద్ధమాడితే ఆడపిల్లలు పుడతారని అంటారు, ఆడపడుచులు. అంటే ఆడపిల్లలు కలవారంతా అబద్ధాలాడే వుంటారని కచ్చితంగా చెప్పగలమా ? అయినా ఆ విధంగానైనా అబద్ధాలు ఆడకుండా వుండాలని ఆ రూపంలో హెచ్చరిక చేస్తుంటారు.

"నిజమాడితే నిష్ఠూరం" అని ట్రేడ్ మార్క్. కాబట్టి యిట్టి యిక్కట్టు గట్టెక్కాలంటే—పెళ్లి చేసి చూడు, ఇల్లు కట్టి చూడు లాగ అబద్ధం ఆడి చూడు.

లోకం పోకడ మీద వ్రాసిన ఒక కవి పాటను గాయకుడొకడు గానకచేరీలో మృదుమధురంగా పాడాడు. ఆ సమయంలో నిజం గట్టి ఖనిజంగా తోచింది. అబద్ధం కాదు. ఆ పాట మీరూ వింటారా ? నిజంగానే వినండి.

"ఈ లోకం పోకడ చూస్తే
నాలోనే నాకే నవ్వొస్తది
అబద్ధాలకోరు, యీ
హరిశ్చంద్రుడు..."

పల్లెటూళ్ళలోని చల్లనివాళ్ళను—"కల్లాకపటం కాననివాడా ! లోకం పోకడ తెలియనివాడా !" అని ఒక సినీ కవి పొగిడితే, మరో సినీ కవి పల్లెటూరి వాళ్ళేకాదు—"పిల్లలూ, దేవుడూ చల్లనివారే కల్ల కపట మెరుగని కరుణామయులే" అని అన్నాడు.



రంకుతనం, బొంకుతనం దాగవని అన్న నోళ్ళు అబద్ధాలాడితే ఆయుస్సు అల్పమనీ అన్నాయి.

అన్ని నొప్పులకు "అంజనం" ఎలాగో అన్ని తప్పులకు అనృతాంజనం అలాటిది అని ఆమోద ముద్ర వేశారు శ్రీ ఆరుద్ర. అప్పులబాధ పడేవారికి దివ్యౌషధం ప్రసాదిస్తూ అప్పులిచ్చిన వాళ్ల చెప్పులు అరిగిపోయేలా చేస్తుంది అబద్ధం అనే ఆయుధం.

"నువ్వు చేసినవి తప్పుడు పనులు. పైగా అబద్ధాలు కూడానా?" రుసరుసలాడుతూ కసరుకొనేవాళ్ళు ఎందరు లేరు?

ఆడినమాటను తప్పని వారిని "సత్యహరిశ్చంద్రుడు" అని అంటారు. మరి ఆడి తప్పితే? క్రింది పద్యం చూడండి.

"ఆడిన మాటను తప్పిన
గాడిద కొడుకంచు(దిట్టగా విని, అయ్యో!
వీడా నా కొడుకంచును
గాడిద యేడిచెగదన్న! ఘనసంపన్నా!"

అబద్ధాలాడితే తిట్లు తప్పవు అని పై పద్యం నిరూపిస్తుంది. కాబట్టి అబద్ధాల జోలికి పోకండి జాగ్రత్త!

చేదు నిజం అంటారు. అంటే అబద్ధం తీపి అనేగా అర్థం మరి. కొందరు ఆడవారు నిట్టూరుస్తూ—"ఏం చేస్తామమ్మా! మా ఆయన నిజం చెప్పినా నమ్మరు" అంటారు. అబద్ధమాడి వుంటే నమ్మేవారేమో! అనే అర్థం ధ్వనించేలా.

అల్లరివాడైన నల్లనివాడే కల్లరివాడైనప్పుడు ఇక చిల్లర మానవుల సంగతి వేరే చెప్పాలా? వారి కల్లలు కోకొల్లలు.

అబద్ధమాడరాదు—అంటాము కానీ ఆ పేరు వ్యక్తులను పిలవడంలో మటుకు వెనుకాడము. ఎల్లమ్మ, పుల్లమ్మ లాగా కల్లమ్మ, ఎల్లయ్య, పుల్లయ్య లాగా కల్లయ్య, కల్లప్ప వగైరా....

ఐతే, నిజం మోతాదు మించినా మొహం మొత్తుతుంది. అబద్ధ మెక్కువైనా వాసన కొడుతుంది. "ఎప్పటికెయ్యది" అన్నట్లు పూర్తిగా ప్రాణం మీదికి వస్తే (వారిజాక్షులందు, వైవాహికములందు) తప్ప అబద్ధమాడరాదుట!

సత్యమేవ జయతే అంటే అబద్ధమాడితే అపజయం అని అర్థం. చెడు వుంటే కానీ మంచికి అర్థం లేదు. అలాగే అబద్ధాలు వుంటేనే నిజం అనే పదానికి విలువ వుంటుంది.

—తేల్కర్ విజయలక్ష్మిబాయి

ఏడు సంవత్సరాల లోపు పిల్లలకి పోలియోవ్యాధి రాకుండా "పోలియో డ్రాప్స" ఇస్తాం కదా! పోలియోవ్యాధి ఎలా వస్తుంది? దాని నివారణోపాయం ఏమిటో తెలుసుకుందాం!

ఈ వ్యాధి-శరీరంలోని కేంద్ర నాడీమండలానికి సంబంధించినది. పోలియో క్రిములను "వైరస్" అంటారు. వైరస్ వెన్నుపాము (స్పైనల్ కార్డ్) మెదడు కొన (Brain stem) భాగములపై సోకడం వల్ల, జ్వరము, పక్షవాతము, ముఖ్యంగా కాళ్ల పక్షవాతముతో పిల్లలను జీవితాంతమూ వికలాంగులుగా చేస్తాయి.



# పోలియో వ్యాధి —

పోలియోవ్యాధి ముఖ్యంగా ఉష్ణమండల దేశాలలోనే వ్యాపిస్తుంది. పిల్లలు తీసుకునే ఆహారం, నీరు, పాలు – క్రిముల చేత కలుషితం కావటం వల్ల ఈ వ్యాధి వ్యాపిస్తుంది. ఈ వైరస్ గొంతులోను, చిన్నప్రేగులలోను వృద్ధిచెందుతాయి. వ్యాధి ఉధృతంగా వచ్చిన కేసులలో సరాసరి కేంద్ర నాడీమండలాన్ని చెడగొట్టటం జరుగుతుంది. అటువంటి కేసులలో పక్షవాతం తప్పనిసరిగా కల్గుతుంది.

వైరస్ సైజు "20-30 మ్యూ"లో ఉండి, మానవ విసర్జితమైన మలములోను, మురుగునీటిలోనూ చాలరోజుల వరకు సజీవంగా ఉండగలదు.

పోలియోవ్యాధి సోకగానే పిల్లలలో ప్రారంభదశలో విపరీతమైన తలనొప్పి, చికాకు, వాంతులు విరేచనాలు ఉంటాయి. వ్యాధి సోకిన భాగంలోని కండరాలు బిగుసుకుపోతాయి. ఒకప్పుడు వెన్ను, మెడలోని కండరాలు కూడా బిగుసుకుపోతాయి.

కొన్ని సందర్భాలలో పక్షవాతం ఉధృతంగాను, ఆకస్మికంగాను ఉంటుంది. తొడ, మోకాలు, పాదాలలోని కండరాల నరాలు దెబ్బతిని సరిగా పనిచేయలేని స్థితి ఏర్పడుతుంది.

శ్వాసనాళిక, శ్వాసకోశంలో చీము లాంటి చిక్కని పదార్థం ఏర్పడి ఊపిరి ఆడదు. ఇది ప్రమాదమైన స్థితిని తెచ్చి మరణానికి దారితీయవచ్చును.

కాలి భాగానికి ఈ వ్యాధి సోకితే ఆ కాలు సన్నగిల్లి సరియైన కదలికలు లేకుండా అవిటిదైపోతుంది.

న్యూమోనియా, మూత్రకోశవ్యాధులు కూడా రావటానికి అవకాశం ఉంటుంది. వ్యాధిని పక్షవాతం రాకమునుపే కనిపెట్టటం కష్టసాధ్యం. పోలియో కేసులు విస్తృతంగా వ్యాపించి ఉన్నప్పుడు ఆ వ్యాధి లక్షణాలను నిర్ధారించవచ్చును గాని ప్రత్యేక సందర్భాలలో డాక్టరు వ్యాధిని గుర్తించేలోపలనే ప్రమాదం జరిగిపోతుంది.

పోలియోవ్యాధి రోగికి చికిత్స చేయటానికి న్యూరాలజిస్ట్, ఇ. యన్. టి. స్పెషలిస్ట్, ఫిజియో థెరపిస్ట్, ఆక్యుపేషనల్ థెరపిస్ట్ మొదలైన ప్రత్యేక విభాగాల నిపుణుల సలహాలు పొందవలసి ఉంటుంది. కొన్ని కేసులకు "ఆర్థోపేడిక్ సర్జన్" సహాయంతో ఆపరేషన్ చేయవలసి కూడా వస్తుంది.

పోలియో వేక్సిన్‌ని అమెరికాలో 1955లో డాక్టర్ "సాల్క్" తయారుచేశారు.

మూడు మాసాల నుండి ఏడాది లోపు పిల్లలకు ఈ మందుని మూడు డోసులలో ఇవ్వాలి. ప్రతి డోసుకి మధ్య నాలుగు నుండి ఎనిమిది వారాల వరకు వ్యవధి ఉండాలి.

పోలియో వాక్సిన్‌ని 20°C టెంపరేచర్‌లో నిల్వ ఉంచాలి.

—డాక్టర్ ఆశారాణి

# అతిథిదేవుళ్ళు

ఆ రోజు రెండో శనివారం. ఆయనకెట్లాగూ సెలవు రోజే కదా అని కాస్త ఆలశ్యంగా వంట మొదలెట్టాను. కూర తరుగుతూంటే వాకిట్లోంచి 'అమ్మా....అన్నపూర్ణమ్మ తల్లీ' అని వినిపించింది.



నన్నందరూ 'పూర్ణా....పూర్ణా' అని పిలవడమే కాని పూర్తి పేరు పెట్టి పిలిచేవాళ్ళు చాలా తక్కువమంది. ఆ వచ్చింది ఎవరై వుంటారా అని వెళ్ళి చూశాను. బయట ఎవరో ఇద్దరు అపరిచిత వ్యక్తులు నిలబడివున్నారు. ఒకామె - గంగాభాగీరథీ సమానురాలు. రెండవ ఆమె - కుంకుమ శోభితురాలు.

వాళ్ళిద్దరూ నా వైపు తేరిపార చూడసాగారు. "నేనేనండీ అన్నపూర్ణని....ఏంకావాలి" అన్నాను.

"నాకు తెలుసమ్మా....నువ్వే అన్నపూర్ణవని. ఆ ముఖం ఎంత కళకళలాడిపోతోందని....ఏం లేదమ్మా....మాది గుర్రం గుట్ట - ఈమెది గాడిద మెట్ట. ఇద్దరం బస్సులో కలిశాం. వరంగల్లు పోదామని స్టేషనుకి వెళ్ళాము. రైలు నాలుగ్గంటలు లేటట. అసలు యివాళ వెళుతుందో లేదో చెప్పలేమన్నారు. అందుకే కాబోలు 'రైళ్ళ రాకడ....ప్రాణం పోకడ తెలియదన్నారు' అంది గంగా భాగీరథి.

"సరే ఈ మాత్రం దానికి హోటళ్ళు, సత్రవుళు ఎందుకు....మన పూర్ణానందానికి తెలిస్తే (పూర్ణానందం అంటే మా మావగారు లెండి) బాధపడ్తాడు అని యిలా వచ్చాం" అంది కుంకుమ శోభితురాలు.

అప్పటికి వాళ్ళు మామగారి తాలూకు బంధువులై వుంటారని అర్థమైంది నాకు. "రండి....లోపలికి రండి" అన్నాను పక్కకి జరుగుతూ.

"పూర్ణానందం లేడా అమ్మాయి?" అంది గంగా భాగీరథి.

"లేరండి. పొరుగూరు వెళ్ళారు. వచ్చే టైమయింది" అన్నాను.

"ఇంట్లో ఆడకూతురువి నిన్నొక్కదాన్ని విడిచి వెళ్ళాడా...." అంది గం. భా. స. చనువుగా కసురుతూ.

వీళ్ళెవరో....ఎట్లా బంధువులో నాకు తెలియడం లేదు. ఆయనకేమైనా తెలుస్తుందేమోనని అనిపించింది. "లేదండీ....వారి అబ్బాయి వున్నారు. పిలుస్తాను" అన్నాను.

"అబ్బాయి, అంటే నీ మొగుడేనా" అంది కుం. శో.

సమాధానంగా చిరునవ్వు నవ్వాను. "అబ్బ.... ఎంత సిగ్గొచ్చిందే నీకు" అంటూ బుగ్గమీద పొడిచింది గం. భా. స.

ఈ అలజడికి 'ఎవరూ' అంటూ ఆయన రానే వచ్చారు.

"హా నాయనే .... ఇంత గుంటడప్పుడు చూశాను. ఎంత ఎదిగిపోయావురా" అంది కుంకుమ మా ఆయన్ని చూడగానే.

"అప్పట్లో నిన్ను 'చంటోడా' అనేవారు. యిప్పుడేమని పిలుస్తున్నారా....అట్లాగేనా" అంది గం. భా. స.

మా ఆయన్ని 'చంటోడా' అని పిలిచేవాళ్ళని తెలియగానే నాకు నవ్వు ముంచుకు వచ్చింది. ఆయన నా వైపు ఉరిమి చూశారు.

"నా పేరు క్రిష్ణమూర్తి. అప్పుడూ యిప్పుడూ ఎప్పుడూ అలాగే పిలుస్తున్నారు అందరూ. ఇంతకీ మీరెవరు?" అన్నారాయన కాస్త కటువుగా.

పాపం వాళ్ళిద్దరూ నొచ్చుకున్నారనిపించింది నాకు. అందుకే ఆయన్ని పక్కకి తీసుకెళ్ళి వాళ్ళు చెప్పిందంతా చెప్పాను. మామగారొస్తే ఎట్లాగూ చుట్టరికం తెలుస్తుంది కదా ఓపిక పట్టమని చెప్పాను. వాళ్ళకి నా పేరు తెలిసి ఆయన పేరు తెలియకపోయేసరికి నాకెంతో గొప్పగా అనిపించింది.

"సరే .... నీ అవస్థేదో నువ్వుపడు" అని అవతలి గదిలోకి వెళ్ళిపోయారు ఆయన.

ఆ తర్వాత వాళ్ళకి స్నానాల గది చూపించి వంట ప్రయత్నంలో పడ్డాను. ఇంతలో గంగా — "అమ్మా....పోష్టుందా?" అనడిగింది.

"పోస్టు యిప్పుడు రాదండి .... మధ్యాహ్నం పన్నెండు గంటలకి" అన్నాను.

"పోష్టంటే పళ్ళు తోముకుంటారు చూడమ్మా అదీ...." అంది విడమరచి చెబుతూ. నాకు నవ్వాగలేదు. నవ్వితే ఏమనుకుంటారోనని ఆపుకుని పేస్ట్ యిచ్చాను.

స్నానపుట్టం ముగించి యిద్దరూ పూజకి ఉపక్రమించారు. వారికేం కావాలో అని అటువైపు వచ్చిన నన్ను చూడగానే "అమ్మా .... ఒక్క సిల్కు చీర వుంటే ఇవ్వమ్మా .... మడి గట్టుకుంటాను. పట్టుదైనా పర్వాలేదనుకో" అంది గం. భా. స. ఇక తప్పుతుందా అని చీర యిచ్చాను.

పూజకు కూర్చోబోతూ మళ్ళీ పిలిచింది గంగ— "ఏమిటి?" అని అడిగాను.

"ఒక యాప్పుల్లుంటే ఇవ్వమ్మా" అంది.

వేప పుల్ల ఎందుకో తెలియక ఆశ్చర్యపోయాను. "ఇప్పుడేగా మొహం కడుక్కున్నారు" అన్నాను.

నాకు అర్థం కానందుకు విసుక్కుంటూ "దాన్నే సోపంటారమ్మా" అన్నది గంగ.

ఉహూఁ....ఈసారి ఫలితం శూన్యం. "ఇప్పుడేగా సోప్‌తో స్నానం చేశారు. మళ్ళా సోప్ దేనికి" అని అడిగాను.

"పోనీ కోలా వుంటే యివ్వమ్మా — సరి పెట్టుకుంటాము" అంది కుంకుమ.

'ఆవిడ భాషా పరీక్ష అయింది యిక ఈవిడ మొదలు పెట్టింది కాబోలు' అనుకుని "వాటితో ఏం చేస్తారు" అని అడిగాను.

"అయ్యో .... అదేమిటమ్మా భక్తి .... ముక్తి అన్నారు. భగవంతునికి నైవేద్యంగా ఏదైనా ఫలం పెడదామని" అంది కుంకుమ.

అప్పటికి నా 'మట్టి' బుర్ర కర్థమైంది వాళ్ళ భాషా పటిమ.

యాప్పుల్లు, సేపు అంటే యాపిల్ అని, కోలా అంటే అరటిపండని. అయినా ఈ పర భాషా పరిజ్ఞానం మూల నున్న ముసలమ్మవరకు ప్రాకినందుకు నవ్వుకున్నాను.

వాళ్ళు 'భజియింపవే మనసా....ఎంత పాపకారివే నీవు గడుసా' అని ఆరున్నొక్క రాగంలో అందుకుని పూజయిందనిపించారు.

అంతసేపూ అవతలి గదిలో వున్న మావారు గొణుగుతూనే వున్నారు. ఆయనకి సర్ది చెప్పడానికి నా తల్ప్రాణం తోకకి వచ్చింది.

మడివంట కాబట్టి వంటకి కావలసినవి ఇవ్వబోతూంటే గం. భా. స "అమ్మా...ఒక్క రెండు శేర్ల బియ్యం, అర్థశేరు పప్పు, అందులోకి ఆనపకాయ, కాస్త చారులోకి టమోటాలు" అని "అయ్యో....ఈ రోజు శనివారం కదూ... ఒంటిపూట భోజనం తల్లీ....కొంచెం దోసకాయ, వంకాయ కలిపి బండపచ్చడి చేసుకుంటాం. చింతపండు, నూనె కొంచెం ఎక్కువ ఇవ్వమ్మా. పులిహోర కలుపుతాను ఆ చేత్తోనే. ఇహ...పెరుగు, నెయ్యి అబ్బాయిని పంపించి తెప్పించమ్మా.... దేవుళ్ళాడుతూ వచ్చిన అతిధులం. అలా లేదన కూడదు" అంది.

ఆయన మొదట ససేమిరా వెళ్ళనన్నారు. చివరకి నేను పోరగా వెళ్ళక తప్పింది కాదు. మొత్తానికి ఎట్లాగైతేనేం వంట పూర్తయిందనిపించి "బ్రేవ్" మని త్రేన్చారు.

"అమ్మాయ్....ఇది బెంగళూరు సిల్కే కదూ... నీ పేరు చెప్పుకుని మడి కట్టుకుంటాను తల్లీ" అంది గం. భా. స చీర విప్పకుండానే. అసలే ఆవిడ నోరు మంచిదికాదాయె. ఎందుకొచ్చిన గొడవ అని వూరుకున్నాను.

వాళ్ళు కాస్త కునుకు తీశారో లేదో బయట టాక్సీ ఆగింది. ఉలిక్కిపడి లేచి కూర్చున్నారిద్దరూ. "అమ్మాయ్....ఎవరే ఆ వచ్చింది?" అంది కుంకుమ.

"మామగారై వుంటారు" అంటూ చూడడానికి బయటకి వెళ్ళాను.

నే వచ్చేసరికి వాళ్ళిద్దరూ "బండికి టైమైపోయింది" అంటూ బయద్దేరడానికి ఉద్యుక్తులయ్యారు.

"మామగారొచ్చేశారు" అన్నాను.

"ఆ....ఆఁ....చూస్తాంగా" అంటూ మూటాముల్లెతో సహా గుమ్మం వైపు వెళ్ళారు. నేను వాళ్ళ వెనకే వెళ్ళాను. మా ఆయనా నా వెనకే వచ్చారు.

అంతవరకూ టాక్సీలో ఎవరో స్నేహితుడితో మాట్లాడుతున్న మా మామగారు టాక్సీ దిగి తన కెదురుపడిన యిద్దరు 'అతిథుల్ని' చూసి ఆగారు. ఆయన తమవైపు చూడగానే కంగారు కంగారుగా వీధిలోకి పరుగెత్తారు గం. భా. స. కుం. శో. నేను అయోమయంగా చూస్తూండిపోయాను.

"ఎవరమ్మా వీళ్ళు" అన్న మామగారి ప్రశ్న వినిపించి ఉలిక్కిపడ్డాను.

"మీ బంధువులని చెప్పారు....".

"అయితే నన్ను చూసి ఎందుకు పారిపోతున్నారు? అయినా వీళ్ళని ఎప్పుడూ చూసినట్లు లేదే."

నేను తెల్ల మొహం వేసి మా ఆయన కేసి చూశాను. మా ఆయన నావైపు ఎగతాళిగా చూస్తూ "అన్నపూర్ణమ్మ తల్లీ అని వాళ్ళు యధాలాపంగా పిలవగానే మురిసిపోయావు. అతిధులు–దేవుళ్ళతో సమానం అని సకల మర్యాదలు చేశావ్—చివరికి నీ చీర కాస్తా పట్టుకుపోయారు చూశావా" అన్నారు.

"మొత్తానికి బ్రతక నేర్చినవాళ్ళు. నేనుండి వుంటే మరోలా నాటకం ఆడి వుండేవారమో" అంటున్న మామగారి వైపు చూడగానే 'సరే నా పేరు యాధాలాపంగా కలిసిందనుకుంటే మరి మామగారి పేరెలా తెలిసింది వాళ్ళకి' అన్న సందేహం వచ్చింది. ఆ మాటే అన్నాను.

"నాకూ యిప్పుడే తట్టింది. ఇదిగో యిటు చూడు" అన్నారు మా వారు.

కాంపౌండ్ గేటుకి 'పూర్ణానందరావు' అని తెలుగులో పెద్ద అక్షరాలతో వున్న నేమ్ ప్లేట్ నన్ను వెక్కిరించింది.

—'అనామిక'



### సవరణ

"పోయిన డిసెంబర్ సంచికలో ఇచ్చిన 'ముఖ్యద్వారానికి అందమైన అలంకారం' వివరణలో ఒక పొరపాటు జరిగినందుకు విచారిస్తున్నాము. గుమ్మం వెడల్పుకు వుండే కర్ర తీసుకున్న తర్వాత, దానికి 90 రంధ్రాలు చెయ్యాలని రాశాను. అవి కర్రకు సగం వరకే. తక్కిన సగంలో మరో 90 పడతాయి. అంటే 180 రంధ్రాలుండాలి. పూసల జాబితా ప్రకారం ఎడమవేపు నుంచి పూసలు ఎక్కించుకుంటూ వస్తే, మధ్య వరకే వస్తాయి. ఆ తర్వాత కుడివేపు నుంచి కూడా అదే విధంగా అదే జాబితా ప్రకారం ఆరంభించి పూసలు ఎక్కించుకుంటూ రావాలి. అప్పుడు గాని పూర్తి కాదు. పోతే, జాబితాలో ఇచ్చిన 21 వ వరసలో తె-7, ము. ఆ 2 అన్న తర్వాత "తె. 2" వుండాలి. ఇది అచ్చులో లేదు. అలాగే 24 వ వరసలో "...ము. ఆ 1, తె. 6" అన్నది సరిగ్గా అచ్చు కాలేదు. పొరపాటుకు చింతిస్తున్నాము."

—ఆర్. రామలక్ష్మి




## పగడాల పంజరం

(నవల)

[రచన : ఆర్. సంధ్యాదేవి; ప్రచురణ: ఎమ్. శేషాచలమ్ అండ్ కో, మద్రాసు; పేజీలు: 160 వెల: రూ. 3-50]

"నేను మాత్రం మీ చంద్రసేనను కాను. సుజనను" "కాదు. నువ్వు కృషభూపాల్ భార్యవు."

"కాదు....మీ భార్య చనిపోయి మూడు సంవత్సరాలైంది. చనిపోయిన మనుషులు తిరిగి బ్రతికి వస్తారా? అంతా మీ భ్రమ. నేను త్వరలో శ్రీహరి గారికి ఇల్లాల్ని కాబోతున్నాను. నన్ను మర్చిపోండి."

ఎవరీ కృష్ణభూపాల్? అతనికీ సుజనకూ ఏమిటీ సంబంధం? అతను ప్రేమించి పెళ్ళి చేసుకున్న చంద్రసేన ఏమయింది? సుజనను. మేనమామ కూతురుగా భావించి పెళ్ళి చేసుకుందామనుకుంటున్న శ్రీహరికి పెళ్ళి జరుగుతుందా?

చివరిదాకా ఇదే సస్పెన్స్‌తో టెంపో సడలకుండా కథ నడిపిన రచయిత్రి అభినందనీయురాలు; వర్ధమాన రచయిత్రుల చాలా నవలల్లాగే ఇది కూడా మంచి కాలక్షేపాన్నిస్తుంది. రాజా, రాణీలు, భారీ సెట్టింగులు, ఉద్యానవనాలతో సినిమాటిక్‌గా వుంది. రాజా బిరుదులు, జమీందారీలు పోయి చాలా కాలమైనా మన రచయిత్రులు వాటిని వదిలిపెట్టలేకపోవడం ఒక విశేషమే!

అయితే, కథలు కేవలం కాలక్షేపానికే కాదు.... ఎంతో కొంత సాంఘిక ప్రయోజనం కూడా వుండాలనే సదుద్దేశ్యం కథకుల్లో వస్తేకాని ఈనాటి సాహిత్యం ఎంత కాలక్షేపం ఇచ్చినా - కొంత ప్రయోజనాన్ని పొందలేదు.

## ఆశల ఆకాశం

(నవల)

[రచన : ఎ. లక్ష్మీకుమారి; ప్రచురణ : ఎమ్. శేషాచలం అండ్ కంపెనీ, మద్రాసు-1; పేజీలు: 128; వెల : రూ. 3-50]

మధ్యతరగతి వారి మరో కథ ఇది. తల్లిదండ్రులనిద్దర్నీ పోగొట్టుకుని బంధువుల మధ్య ఏమాత్రం ఆదరణ, ఆప్యాయత లేకుండా కేవలం బంధాలు లేని బాధ్యతల మధ్య చిక్కుకున్న వాణి ప్రపంచం మీద ఒకరకమైన కసి పెంచుకుంటుంది. సినిమా అవకాశం రాగానే పంజరం లాంటి ఇంటి నుంచి బయటపడుతుంది. తనకు తోడుగా, నీడగా, గురువుగా నిలిచిన రామారావుతో మద్రాసు మహానగరంలోని ఇంద్రధనుస్సు లాంటి సినిమా ప్రపంచంలోకి అడుగు పెడుతుంది.

అక్కడ ఆశల తుఫానుల మధ్య, నిరాశల విహారికల మధ్య కొట్టుమిట్టాడిపోతుంది. అడుగు ఎక్కడ పడుతుందో తెలియకముందే పరుగు పందాలలో పడిపోతుంది. మధ్యలో అనవసరమైన అనుమానాలతో రామారావు తోడును పోగొట్టుకుంటుంది. కోపంతో, కచ్చతో అన్ని రకాల భ్రష్టత్వాలకు లోనౌతుంది. అనేక కాంతి రేఖలతో వెలిగిపోయే ఈ సినీ ప్రపంచం చాలా చీకటి కోణాలలో నలిగిపోయే అనేక ఆత్మల సంక్షోభాల పునాదుల మీద కట్టబడిందని తెలిసి ఒక రకమైన నిర్లిప్తతకు లోనౌతుంది. అప్పుడు మళ్ళీ ఆమెకు రామారావు కనబడతాడు.

"నీకు నేను, నాకు నువ్వు కావాలి అన్నది తెలిసినప్పుడు యింక మిగిలిన ఏ విషయమేనా ఆటంకం అవుతుందని యిప్పటికీ అనుకోవడం మూర్ఖత్వం...." అంటాడు రామారావు.

రచనా విధానంలో పెద్ద కొత్తదనం లేదు. కానీ కథ ఉంది. సినిమా వ్యామోహంలో ఉండే ప్రతి ఆడపిల్ల చదవవలసిన నవల.

## రేపటి పుడమి

(నవల)

[రచన : వేదుల శకుంతల; ప్రచురణ : ఎమ్. శేషాచలం అండ్ కంపెనీ, మద్రాసు-1; పేజీలు· 140; వెల : రూ. 3-50]

ఇది ఒక రకంగా బావున్న నవల. చదివించగల నేర్పు ఉండే ప్రతి రచయిత్రి ఏం చెప్పదలుచుకున్నారో తెలియకుండానే నవల పూర్తి అయిపోవడం కద్దు. కానీ, ఈ నవలలో కొంత కథ ఉంది.

ఇందులో గాయత్రి ఒక విలక్షణమైన పాత్ర. ఈనాటి మధ్యతరగతి కుటుంబాలలో ప్రతి యువతి ఈ మాత్రం అవగాహన పెంపొందించుకుంటే సంఘం ఇంత అర్థరహితంగా ఉండదు. ఆమె ఆడబడుచు కావేరి మామూలు ఆడపిల్ల. విధి వంచితురాలు. భర్త పోయి ఇద్దరు పిల్లలతో పుట్టింటికి ఆశ్రయానికి వచ్చింది ఆమె. కేవలం రోజులు గడిచి పోవడం లెఖ్ఖ కాదని, కోరికలు పడగ విప్పే వయసులో జీవితేచ్ఛ చంపుకుని తిండికి, బట్టకు బ్రతకడం చాలా నీచమని భావించే గాయత్రి కావేరిని సేవాసదనంలో చేర్పిస్తుంది. అర్థం చేసుకోలేని ఇంట్లో అత్తగారు, బంధువులు చివరికి భర్త కూడా ఆమెను అపార్థం చేసుకుంటారు.

ఒక రకంగా వారందరికన్నా ఎదిగిన గాయత్రి, వాళ్ల అజ్ఞానాన్ని చూసి జాలిపడే స్థితికి వచ్చింది. కొత్త జీవితంలో స్వతంత్ర వాయువులు పీల్చుకునే కావేరి, పునర్వివాహం చేసుకునేట్లైయితే, ఆమె పిల్లలను తను పెంచాల్సి వస్తుందని మాతృత్వానికి కూడా దూరమవడానికి జంకదు ఆమె. కానీ, ఎదిగిన కావేరి ఆలోచనలు వేరు. తనలాంటి జీవితాలకు వెలుగునివ్వడానికి వెన్నెల దారుల్లోకి అడుగు పెడుతుంది ఆమె. చదవతగ్గ నవల ఇది.

# ప్రపంచం

ప్రపంచం దృష్టినంతా ఇవాళ తనవైపు ఆకర్షిస్తున్న దేశం ఇరాన్. పదకొండు నెలల క్రితం షా నిరంకుశపాలన నుంచి బయటపడిన ఇరాన్ మతోన్మాద నిరంకుశత్వంలో చిక్కుకుంది.

షా పరిపాలన నియంతృత్వమే అయినప్పటికీ ఇరాన్‌ను నవ నాగరికం చేయడానికి ఆధునిక మార్గంలో నడిపించడానికి కొంత కృషి చేశాడు. అయితే క్రమక్రమంగా ఏర్పడిన ఆర్థిక సంక్షోభం; మత గురువుల ఆందోళనలు-నిరుద్యోగుల పోరాటాలు షా పరిపాలనకు సమాధి కట్టాయి.

ఆ తర్వాత ఏర్పడిన ప్రభుత్వాధినేత అయతుల్లా ఖొమైనీ. ఇస్లామిక్ విప్లవ సమితి పేరుతో ఖొమైనీ జరిపిస్తున్న దమనకాండ మరింత కౄరంగా తయారయింది.

ఖొమైనీకి ప్రధానమంత్రిగా మెహ్దీబజార్గన్ నియమింపబడ్డారు. ఆయన కూడా మాజీ ఇరాన్ షాకు బద్ధ విరోధి. అయితే ప్రజాస్వామ్యం పట్ల ఆదరాభిమానాలు గల వ్యక్తి. అధికారం అంతా ఖొమైనీ హస్తగతం కావడంతో ప్రధానమంత్రి కేవలం కీలుబొమ్మగా మిగిలిపోయాడు. ఖొమైనీ అడుగులకు మడుగులొత్తే ఇస్లామిక్ విప్లవ సమితి; ముల్లాలు సాయుధ దళాలపై అధికారం చెలాయించడం వల్ల-ప్రధాని పదవి నుంచి కూడా బజార్గన్ వైదొలగవలసిన నిర్బంధం ఏర్పడింది. సైనిక వ్యవహారాలు, విదేశ వ్యవహారాలు, ఆర్థిక విధానాలు ఏదైనాసరే ఖొమైనీ చెప్పిందే 'వేదం!'

పదవి పోగొట్టుకున్న తర్వాత షా ఎక్కడెక్కడో తల దాచుకుని – ప్రస్తుతం న్యూయార్క్‌లో చికిత్స పొందుతున్నాడు. షాకు మరణ దండన విధించబడిందనీ — ఆయనకు అమెరికా ఆశ్రయం ఇవ్వడం ఇరాన్ అంతరంగిక వ్యవహారాలలో జోక్యం చేసుకోవడమే అనీ; ఆయన్ను వెంటనే తమకు అప్పగించాలనీ ఖొమైనీ అమెరికాకు విజ్ఞప్తి చేశాడు. దారుణమైన వ్యాధితో పోరాడుతున్న 'షా'ను ఇరాన్‌కు అప్పగించడం సాధ్యం కాదని అమెరికా తిరస్కరించింది.

ఇస్లామ్ విప్లవ సమితి అనుయాయులైన విద్యార్థులు కొందరు ఇరాన్ రాజధాని టెహ్రాన్‌లో వున్న అమెరికా దౌత్య కార్యాలయాన్ని ముట్టడించి అందులో పనిచేసే దాదాపు డెబ్బైమంది సిబ్బందిని బంధించారు. వారిలో స్త్రీలను, నీగ్రోలను వదలి నలభైతొమ్మిది మందిని బందీ చేసి – 'ఇరాన్ సర్వాధినేత ఖొమైనీకి షాను అప్పగిస్తేనే అమెరికన్ బందీలను విడుదల చేస్తాము. లేకుంటే సజీవదహనం చేస్తా'మని బెదిరించారు!

ఒక దేశంలో మరో దేశపు దౌత్య కార్యాలయాలు నెలకొల్పడం, అలా రెండు దేశాలకు మధ్య సత్సంబంధాలు ఏర్పడి అంతర్జాతీయ అవగాహన పెంపొందడానికే. ఒక దేశంతో దౌత్య సంబంధాలు వద్దు అనుకున్నప్పుడు రాయబార కార్యాలయాలను నిషేధించే హక్కు ప్రతి దేశానికీ వుంది. అయితే దౌత్య కార్యాలయ సిబ్బందిని బందీ చెయ్యడం మానవత లేని చర్య. అందుకే ఇరాక్ లాంటి ముస్లిం దేశం కూడా ఈ చర్యను తీవ్రంగా ఖండించింది.

అమెరికా అధ్యక్షుడు దౌత్య కార్యాలయంలోని బందీలను విడుదల చేయాలని ఎన్నో విజ్ఞప్తులు చేశారు. ఆఖరుకు సైనికబలం ప్రయోగించవలసి వస్తుందని హెచ్చరిక కూడా చేశారు. ఖొమైనీ మాత్రం—షాను వదిలితే తప్ప బందీలను విడుదల చేయడం లేదన్న మొండి పట్టుదలతోనే వ్యవహరిస్తున్నారు.

ఐక్యరాజ్యసమితి భద్రతామండలి సమావేశమై-ఇరాన్-అమెరికా దేశాల మధ్య సౌజన్యస్థితి ఏర్పడాలనీ, ఇరాన్‌లో బందీలుగా వున్న అమెరికా దౌత్య కార్యాలయ సిబ్బందిని వెంటనే విడుదల చేయాలని విజ్ఞప్తి చేసింది.

షా పరిపాలన కాలంలో జరిగిన దారుణ కృత్యాలను ఖండిస్తూ అమెరికా ప్రభుత్వం ఒక బహిరంగ ప్రకటన చేస్తే—దౌత్య కార్యాలయ బందీలను విడుదల చేయడం సులభమవుతుందని — ఇరాన్ విదేశాంగ మంత్రి అబుల్ హసన్ బనీసదర్ తెలియజేశారు.

ఇరాన్‌లో అస్తవ్యస్తంగా తయారయిన ఆర్థిక సంక్షోభాన్ని కప్పిపుచ్చడానికి; వేర్పాటుకోసం కుర్దులు, బలూచీలు చేస్తున్న తిరుగుబాటు నుంచి ప్రజల దృష్టిని మళ్ళించడానికే-అయతుల్లా ఖొమైనీ అమెరికా వ్యతిరేకతను రెచ్చగొడుతున్నాడని రాజకీయ పరిశీలకులు కొందరు అభిప్రాయపడుతున్నారు.

ఏది ఏమైనా అమెరికా దౌత్య కార్యాలయంలోని బందీలు విడుదల కావడమే గాక-ఇరాన్-అమెరికా దేశాల మధ్య సుహృద్భావం ఏర్పడి శాంతి నెలకొనాలని నూతన సంవత్సరంలో 'ప్రపంచం' కోరుకుంటోంది.

సౌదీ అరేబియాలోని మక్కా మసీదు ప్రపంచ వ్యాప్తంగా వున్న మహమ్మదీయులందరికీ పవిత్ర స్థలం. జీవితకాలంలో ఒక్కసారైనా మక్కాయాత్ర చేయాలని ముస్లిం సంప్రదాయకులు చెబుతారు. గత ఇస్లాం సంవత్సరం చివరి రోజున అంటే నవంబర్ ఇరవైన వేకువ జామున మక్కామసీదులో వెయ్యిమందికిపైగా ప్రార్థనలు జరుపుతున్నప్పుడు – నల్ల దుస్తులు, ఎర్ర తలపాగాలతో ఒక ముఠా ప్రవేశించింది. ఆ ముఠా నాయకుడు "ఇస్లాం జాతిని నడిపించడానికి వచ్చిన 'రక్షకుడు' నేను" అని తుపాకీతో జడిపించడంతో ప్రార్థనా సభ అల్లకల్లోలమయింది. ఆ ముఠా కొందరు యాత్రికులతో సహా మక్కామసీదును ఆక్రమించుకుంది.

ఇస్లాం మత అనుయాయుల్ని నడిపించడానికి 'రక్షకుడు' వస్తాడని షియా అనే సనాతన ముస్లిం తెగవాళ్ళు విశ్వసిస్తారు. ఈ తెగవాళ్ళు ఇరాన్‌లో అధికంగా వున్నారు. ఇరాన్ ఏకైక నాయకుడుగా మతోన్మాదంతో చిందులు వేస్తున్న సర్వాధి నేత ఖొమైనీ. ఆయన ఇరాన్ ఇస్లామిక్ విప్లవాన్ని గల్ఫ్ దేశాలకు కూడా వ్యాపింపజేయడానికి తహతహలాడుతున్నారు. రాజరిక వ్యవస్థలో వుంటూన్న సంపన్నదేశం సౌదీ అరేబియా. దీనికితోడు టెహ్రాన్‌లో బందీలుగా వుంటున్న అమెరికన్లకు సౌదీ అరేబియా సానుభూతి ప్రకటించింది. దాని పర్యవసానంగా ఖొమైనీ పన్నాగమే ఈ దుర్ఘటన అని కొందరు వ్యాఖ్యానిస్తున్నారు.

అయితే – రాజరిక వ్యవస్థను, తిరోగమన శక్తులను ప్రోత్సహించే అమెరికా చేసిన చర్య ఇది అని ఖొమైనీ ఆరోపించారు.

ఒక వారం వరకు పోరాటం జరిపి సౌదీ అరేబియా ప్రభుత్వం, చివరకు మక్కామసీదులోని దుండగులను అదుపులోకి తేగలిగింది. తన్ను 'రక్షకుడు' అని చెప్పుకున్న ఇరవైయేడేళ్ల ముఠా నాయకుడు – మహమ్మదుబీన్ అబ్దుల్లా అల్ కహతానీ తుపాకుల కాల్పుల్లో చనిపోయాడని – సౌదీ అరేబియా వెల్లడించింది! □



Edited & Published by B. Viswanatha Reddi for CHANDAMAMA CHILDREN'S TRUST FUND (Prop. of Chandamama Publications) & Printed by B. V. REDDI at Prasad Process Private Ltd., Madras-600 026.

REGD. No. VANITHA (Telugu) January 1980

# క్రేక్‌జాక్-జనం అంతా మనసుపడేది






**క్రాక్‌జాక్** బిస్కట్లు-తియ్యగా, ఉప్పగా, నోరూరించేలా.